# "గుర్తుపెట్టుకోండి, పోషణనిచ్చే సమపాళ్లుగల ఆహారాన్నివకపోతే ఏమి జరుగుతుందో? చురుకుదనాన్నివ్వడానికి అవసరమయ్యే 'సరియైన' తీరులోని కేలరీలు మీ పాపకి అందవు.

## అందుకే నేను మా పాపకు రిలాక్ యిస్తాను."

ు 'సరియైన' కేలరీలు అంటే ఏమిటి?
ప్లు అనేదిది. ఆహారంలోని ప్రోటీన్లు, కార్బొహైడ్రేట్లు, కొవ్వు ర్థాలు, ఖచ్చితమైన సమపాళ్లు యీ కేలరీలలో వుంటాయని నిజానికి ఇవి బాగా పెరగటానికి, చురుకుగా వుండటానికి, అవసరమైన కీలకమైన ర పదార్థాలు.

ాపకు 'సరియైన' కేలరీలు లభించేటట్లు ఖచ్చితంగా చూడాలి. ప్రతిసారి యిచ్చే ఆహారంలో వుండాలి. రోజూ మామూలుగా వారం ంతంగా యిచ్చే ఆహారంతో అలా యివ్వగలగటం చాలా మంది తల్లులకి ంకాదు

కి పరిష్కారం ?
ాక్ పోషణ నిచ్చే సమపాళ్లుగల సంపూర్ణ ఆహారం. పాపకు 4 నెలలు న్నప్పటి నుండి అంటే, కేవలం పాలు యిస్తే చాలని వయస్సు నుంచి. చ్చే ఆహారం.

ాక్‌లో ప్రోటీన్లూ, కార్బొహైడ్రేట్లూ, కొవ్వు పదార్థాలూ విటమిన్లూ, ్, కాల్షియం, వున్నాయి. దాంతో మీ పాప చురుకుగా వుండటానికి రమైన 'సరియైన' కేలరీలు లభిస్తాయి. రుచికరంగానూ వుంటుంది. ుకే యివ్వండి వెంటనే మీ పాపకు, పోషణనిచ్చే సమ పాళ్లలోగల ాక్

ాపకు 6 నెలలు వచ్చినప్పటి నుంచి వీట్-ఆపిల్, వీట్-ఆరెంజ్, యు వీట్-వెజిటెబుల్ అదనపు లాభం అందించండి
ంచేసి ప్యాక్‌పైన యివ్వబడిన సూచనలను పాటించండి

---

ుతం సెరిలాక్ బేబీ కేర్ బుక్
యుండి : సెరిలాక్, పోస్ట్ బాక్స్ నెం. 21,న్యూ ఢిల్లీ 110029

---




ు పాపాయికి అందించండి సెరిలాక్ లాభం.

# మీ బిడ్డను ఒక జంట లాభంతో బడికి పంపండి.

## రుచి + పోషణ బానీ మిక్స్ నుండి.

మంచి పోషణలో ఉండడమంటే సగం ప్రయత్నం నెగ్గడమే. ప్రతిరోజూ, మీ బిడ్డకు, బానీ మిక్స్ యొక్క రెండు విధాల లాభాన్ని సమకూర్చండి. రుచికరమైన ఆపిల్స్, మామిడి పండు, ఖర్జూరము, ఎండుద్రాక్ష, మరియు పప్పులు, అంతేకాకుండా గోధుమ, బియ్యం, మరియు మొక్కజొన్న వంటి పుష్టికరమైన తృణధాన్యాలను కూడా అది కలిగియున్నది. మీ బిడ్డకి ఇవ్వండి దానికవసరమైన అధిక పోషణను.

**తయారు చేసికొనుటకు ఎంతో అనుకూలమైనది.**



వండుకోవలసిన అవసరం లేదు. ఒక గిన్నెలో కావలసినంత పరిమాణంలో బానీ మిక్స్‌ను వేయండి. మరిగించి సిద్ధంగా ఉంచిన పాలను అందులో పోయండి. మీకు కావలసిన మృదువైన జావ తయారయ్యే దాకా నెమ్మదిగా కలియబెట్టండి.




గ్లాక్సో నుండి వస్తుంది మంచి ఆరోగ్యం.

GL/3/89-R-TEL

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ క్రింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదని, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

## జూన్ 'చతుర' నవల భీమఖండం

సమీక్షకుని పేరు : ..........................................................

చిరునామా : ..........................................................

..........................................................

..........................................................

..........................................................

# రచయిత్రులకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్య పూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకోగల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరీని బట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ లెక్క ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడుతుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482

# చతుర కథలు

## బాకీ

వీధి చివర్న స్కూటర్ మీద కాచుక్కూర్చున్నాడు రాజారావు. "ఈ రోజెలాగైనా సరే ఆ సింహాద్రిగాడిని పట్టుకోవాల్సిందే. మూడు నెల్ల నుంచీ చిక్కకుండా తప్పించుకుంటున్నాడు. ఈ రోజు వాడి అంతు చూడాల్సిందే" అనుకుంటున్నాడు మనసులోనే!

అలా ఓ గంట ఎదురుచూసి అసహనంగా స్కూటర్ స్టాండ్ వేసి రోడ్డు పక్కగా పాన్ షాపు దగ్గర నిల్చుని ఎదురు చూడసాగాడు. ఇంతలో సింహాద్రి సైకిలు మీద వీధి మలుపు తిరుగుతూ కనిపించాడు రాజారావుకు.

ఒక్క ఉదుటున తన స్కూటర్ మీదకు జంప్‌చేసి దాన్ని స్టార్ట్ చేసి సింహాద్రివైపు పోనిచ్చాడు వేగంగా.

రాజారావును చూసిన సింహాద్రి కంగారుగా తన సైకిలును వెనక్కి తిప్పి వేగంగా తొక్కసాగాడు.

రాజారావు స్కూటర్ సింహాద్రి డొక్కు సైకిలును చేరుకోవటానికి ఎంతో సేపు పట్టలేదు. రాజారావు సింహాద్రి పక్కకు చేరుకునే సమయానికి సింహాద్రి సైకిలుతో సహా ప్రక్క సందులోకి పరుగు లంకించుకున్నాడు. రాజారావు స్కూటర్‌తో ఆ సందులోకి పోలేక స్కూటర్‌ను రోడ్డు ప్రక్కనే పెట్టి సింహాద్రి వెనుకే పరిగెత్తసాగాడు.

సింహాద్రి అలా కొంత దూరం పరిగెత్తి ఆ సందు అంతంకావటంతో ఎదురుగా ఉన్న గోడ ఎక్కటానికి ప్రయత్నించసాగాడు. ఇంతలో వెనుకనుంచి వచ్చిన రాజారావు వాడి కాలు పట్టుకున్నాడు. సింహాద్రి ఒక్కసారి కాలు విదిలించి గోడ ఎక్కి అవతలికి దూకేశాడు. సింహాద్రి చెప్పు ఊడి రాజారావు చేతిలోకి వచ్చింది. దాంతో రాజారావు కూడ గోడ దూకి సింహాద్రిని వెంబడించసాగాడు. సింహాద్రి పరిగెత్తే తొందరలో చూసుకోక ఒక అరటి తొక్క మీద కాలువేసాడు.

అంతే! జర్రున జారి వెల్లకిలా పడ్డాడు. అతను తిరిగి లేవబోయేంతలో వెనుక నుంచి రాజారావు వచ్చి అతని మీద పడ్డాడు. సింహాద్రి ఎంత పెనుగులాడినా రాజారావు తన పట్టువిడవ లేదు. ఇక చేసేది లేక సింహాద్రి లొంగిపోయాడు.

రాజారావు అతన్ని లేపి "ఊ! బయటకు తియ్!" అన్నాడు.

"సార్! ఈ ఒక్కసారికీ వదిలేయండి సార్! మరోసారి--" అంటూ సింహాద్రి ఏదో చెప్పబోయేంతలో "మర్యాదగా చెప్పినపని చెయ్"!



గుర్రుమంటూ అరిచాడు రాజారావు.

ఇక తప్పనిసరై జేబులోంచి యాభై నోటు తీసి రాజారావుకిచ్చి చల్లగా అక్కడ నుండి జారుకున్నాడు సింహాద్రి.

రాజారావు వెనక్కి వెళ్ళి స్కూటర్ స్టార్ట్ చేస్తూ గర్వంగా ఫీలయ్యాడు. "వెధవ! ఫ్రెండ్స్‌ను సినిమాకి తీసుకువెళ్తున్నాను. ఓ యాభై అప్పివ్వండంకుల్! అంటే పోన్లే కుర్రాడు గదాని ఇస్తే మూడు నెలల నుంచీ తను కనిపించగానే పక్క సందులోకి పారిపోతాడా! ఈ రాజారావు సంగతి ఇప్పటికి తెలిసింది, వెధవకి"

—పి.వి.యల్.యన్. ప్రసాద్

ముఖచిత్రం- పినిశెట్టి



# ఎవరికి వారే గొప్ప

"బాబుగారూ నమస్కారం" ముఖంలో కొట్టొచ్చిన సంతోషంతో గౌరవంతో చేతులు జోడించాడు అప్పిగాడు.

ఇంటి ముందు పందిరిలో కుర్చీ వేసుక్కూర్చుని పేపరు చదువుతున్న ఫణీంద్రబాబు తల పంకించి అప్పిగాడి వంక చూశాడు.

"మీరు కాలేజీలో శెలవులకి పట్నంనుంచి వచ్చారని తెలిసి పరిగెత్తుకొచ్చాను"

"ఎందుకురా?" దర్పంగా ప్రశ్నించాడు ఫణీంద్రబాబు.

"మరేం! మరేమండి.... మరి.... మరి...." విషయం చెప్పటానికి అష్టవంకరలు తిరిగిపోయాడు అప్పిగాడు.

"తొందరగా చెప్పరా. నన్ను విసిగించకు" కసురుకున్నాడు బాబు.

"చెప్తానండి బాబుగారు - మా యింటి ఆడది మాఘమాసమని పుట్టింటికిపోయింది. దాని యోగక్షేమాలు అడిగినట్టు ఓ ఉత్తరం ముక్క వంపాలని వుందండి"

"వంపు" విసురుగా అన్నాడు బాబుగారు.

"మరి, నాకు సదువురాదు కదండి. ఓ ఉత్తరం ముక్క రాసి పెడుదురూ" ప్రాధేయపడ్డాడు అప్పిగాడు. ఫణీంద్రబాబు అహం దెబ్బతింది.

"ఏమిటీ! నీకు నేను ఉత్తరం రాసి పెట్టాలా? నేను చదివే ఎం.ఏ నీకు ఉత్తరాలు రాసి పెట్టడానికట్రా? నీ ముఖానికి ప్రేమలేఖలు కూడానా? వెళ్ళు వెళ్ళు" విసుక్కున్నాడు బాబు.

అప్పిగాడి ముఖంకుంచించుకుపోయింది. చదువురాని తను పెళ్లానికి ఉత్తరం రాయడం తప్పా? అనుకుంటూ అక్కడనుంచి నిష్క్రమించాడు.

★ ★ ★

పల్లెటూరు ఎలాగూ వచ్చాం గదా, ఎలా ఉందో చూద్దాం అని పొలానికి ఉదయమే వెళ్లి చూశాడు ఫణీంద్రబాబు.

ఆ కార్యక్రమం ముగించుకునేసరికి సూరీడు నడినెత్తిమీదకి వచ్చాడు.

అసలే ఎండాకాలం. పొలమంతా తిరగడం వలన నోరు పిడచకట్టుకుపోయింది. నరానరి నూతి గట్టుమీదికి, కొబ్బరిచెట్ల నీడలోకి వచ్చాడు.

అది వ్యవసాయ బావి. నీళ్లదాకా దిగటానికి మెట్లు లేవు. కొబ్బరి చెట్లకు కాయలు మాత్రం సమృద్ధిగా ఉన్నాయి.

కొబ్బరినీళ్లు తాగాలని వుంది కాని ఎలా? తనకు చెట్టు ఎక్కడం రాదే.

చుట్టూ చూశాడు. నెత్తిన మోపుతో ఆ దారిన పోతున్నాడు అప్పిగాడు.

"అప్పిగా..... ఒరేయ్ అప్పిగా....." పిలిచాడు వాణ్ణి. అప్పిగాడు దగ్గరకొచ్చి "ఏం?" అన్నాడు.

గంతు ఎండిపోయిందరా, కొబ్బరినీళ్లు తాగాలిగానీ, నీకు చెట్టు ఎక్కడం వచ్చుకదా. ఓ రెండు కాయలు తీయరా" అన్నాడు బాబు.

"ఏమిటీ.... నేను చెట్లు ఎక్కడం నేర్చుకున్నది నీకు కొబ్బరికాయలు తీయడానికనుకున్నావా?" గీరగా ప్రశ్నించాడు అప్పిగాడు.

ఫణీంద్రబాబు అదిరిపడి "అదేమిట్రా... తీస్తే అరిగిపోతావా?" అన్నాడు ఆశ్చర్యంగా.

"నువ్వు ఉత్తరం రాయటానికి అరిగిపోలా- అలాగే. అయినా పట్నంలో బ్రాందీ బుడ్లు తాగే ముఖాలకు కొబ్బరినీళ్లు ఎందుకు... వస్తా" అంటూ వెళ్లిపోయాడు అప్పిగాడు.

ఫణీంద్రబాబు ప్రూన్పడిపోయి, కొబ్బరికాయల వైపు చొంగ కార్చుతూ వుండిపోయాడలాగే.

—కొల్లిమల్ల అప్పారావు

## ఋద్భావధాని

"ఏం రామం... ఇంటికి వెళ్ళొచ్చినట్లున్నావ్! ఏమిటి విశేషాలు?"

"ఏమున్నాయ్! అంతా బాగానే ఉన్నారు" నవ్వుతూ చెప్పాడు రామం.

"మన మిత్రబృందం ఏమంటోందేం?"

"ఏమంటుంది...షరా మామూలే! నాటకాలు...డ్రామాలు..."

"అది సరే మన గోపాలకృష్ణ ఏమంటున్నాడు?" వాడిమాట పూర్తికాకుండానే మళ్ళీ అడిగాను.

"ఆ అప్రాచ్యుడి మాట నా దగ్గరెత్తకు..." ఒక్కసారిగా భగ్గుమన్నాడు రామం.

అప్పటిదాకా ఎంతో ప్రసన్నంగా ఉన్న వాడి ముఖం క్షణాలమీద కందగడ్డలా మారిపోయింది. నేను పిలుస్తున్నా విన్పించుకోకుండా చరచరా జనంలో కల్సిపోయాడు.

గోపాలకృష్ణ ఒకప్పుడు మా నాటక సమాజానికే వన్నె తెచ్చిన మణిదీపంగా ప్రజలమన్ననలు పొందినవాడు. వాడు ధరించిన పాత్రలు ఎన్నెన్నో అవార్డులను సంపాదించిపెట్టాయి. వాడి ద్వారా మా ట్రూప్‌కి ఎనలేని కీర్తిప్రతిష్ఠలు లభించాయి. వాడంటే మా అందరికీ గురుభావమే! మూన్నాటరవై రోజులూ తను పోషించే పాత్రను గురించే ఆలోచించేవాడి దీక్ష పట్టుదల మాకెంతో అబ్బురమనిపించేవి.

ఆ తర్వాత ఉద్యోగరీత్యా మేం విడిపోక తప్పలేదు. గోపాలకృష్ణ తప్ప మేమంతా మా ఊరు విడిచిపెట్టి తలో దారీ అయ్యాం. అయితే లక్కీగా రామం ఈమధ్య హైదరాబాద్ ట్రాన్స్‌ఫర్ కావడంతో మా పాతస్నేహం మళ్ళీ కొత్తచివుళ్ళు తొడగడం మొదలెట్టింది.

సాధారణంగా నాకున్న పనివత్తిడి వల్ల మా ఊరెళ్లడం ఎప్పుడోగాని పడదు. అందువల్ల అడపాదడపా ఇంటికి వెళ్ళివచ్చే రామంద్వారానే అక్కడి సంగతులు తెలుస్తుంటాయి. మేం లేకున్నా కొందరు కొత్తవార్ని చేరదీసి గోపాలకృష్ణ మళ్ళీ నాటకాలు ప్రదర్శిస్తున్నట్లూ, అవార్డులమీద అవార్డులు పొందుతున్నట్లూ క్రితంసారి ఊర్నించి వచ్చినప్పుడు పొంగిపోతూ చెప్పాడు రామం. మరి ఇప్పుడేమిటి? వాడి పేరు వింటేనే మండిపడుతున్నాడు. ఇద్దరికీ ఏమైనా గొడవ జరిగిందా? ఇంటికి వెడితేతప్ప విషయం అర్థంకాదన్పించింది నాకు.

★ ★ ★

చాలా కాలం తర్వాత మా ఊరెళ్ళాల్సిన పనిబడింది నాకు. అయిన వాళ్లందర్నీ చూడబోతున్నానన్న సంతోషం నన్నోపక్క ఉక్కిరిబిక్కిరి చేస్తుంటే, మరోపక్క రామం గోపాలకృష్ణల మధ్య గొడవేమిటో తొందరగా తెల్సుకోవాలని మనసు ఉవ్విళ్ళూరుతోంది.

ఇంటికి వచ్చీ రావడంతోనే అమ్మనీ నాన్ననీ పలకరించి, మిత్రుల్ని వెదుక్కుంటూ మెల్లగా ఊరిమీదపడ్డాను.

బజార్లో అల్లంతదూరంలో కన్పించాడు గోపాలకృష్ణ.

నన్ను చూడగానే ఒక్క పరుగున వచ్చి, "ఏరా సూరీ బాగున్నావా? ఎన్నాళ్లయిందిరా నిన్ను చూసి..." అంటూ అమాంతం కౌగిలించుకున్నాడు.

వాడి ఆప్యాయతకి కళ్లలో నీళ్ళు తిరిగాయి నాకు. భుజంమీద చెయ్యివేసి- "కాఫీ తా







గుదాం పద" అంటూ పక్క హోటల్‌కి నడవ బోయాను.

వెంటనే వాడు "వద్దురా. మా ఇంటికి పోదాం! కబుర్లు చెప్పుకుంటూ అక్కడే తాగొచ్చు కాఫీ. పదపద..." అంటూ తనింటికి లాక్కుపోయాడు.

గోపాలకృష్ణ భార్య నవ్వుతూ పలకరించింది. ఇద్దరికీ వేడివేడి కాఫీ ఇడ్లీ ప్లేట్లు అందించింది. మేం ఆమాటా ఈమాటా మాట్లాడుకుంటూ అవి తినేసరికి కాఫీ తెచ్చియిచ్చింది. ఆ తర్వాత మేమిద్దరం కబుర్లలోపడి దాదాపు ఈ లోకాన్నే మరచిపోయాం. గోపాలకృష్ణ నాటకాల గురించి, సన్మానాల గురించి ఎన్నో సంగతులు చెప్పాడు.

మధ్యాహ్నం అయింది.

"ఇంక వెళ్తానురా. భోజనం వేళయింది గదా! అమ్మానాన్నా ఎదురుచూస్తుంటారు" అన్నాను లేస్తూ.

"భోజనం ఇక్కడే చెయ్యరా ఈ పూట! రాత్రికి ఎలాగూ మీ ఇంట్లోనే తింటావుగా..." పట్టుబట్టాడు గోపాలకృష్ణ. వాళ్ళ ఆవిడా వాడికి వంతపాడ్డంతో ఇక తప్పలేదు. భోజనం పూర్తయ్యేంతవరకూ మళ్ళీ మా ముచ్చట్లు నిరాఘంగా కొనసాగాయి. రామం విషయం ఎత్తితే వాడెలా రియాక్టయి మూడ్ పాడుచేసుకుంటాడేనని నేనా విషయం కదిలించలేదు.

భోజనాలు పూర్తయ్యాయి. భార్యాభర్తలిద్దరికీ వస్తానని చెప్పి బయల్దేరబోయాను.

"ఒరేయ్ సూరీ! బిల్ ఏడురూపాయల నలభై పైసలయింది... ఇచ్చివెళ్ళు" అన్నాడు గోపాలకృష్ణ.

"ఏమిటీ?" నేను ఆశ్చర్యపోయాను.

"అవున్రా. రెండిడ్లీ రూపాయి నలభై పైసలు. కాఫీ రూపాయి. భోజనం ఐదురూపాయలు... వెరశి ఏడూ నలభై" అన్నాడు వాడు.

"భలే జోక్‌రా..." పగలబడి నవ్వబోయాను.

"జోక్‌గాదు. నిజమే! డబ్బులివ్వు ముందు" సీరియస్‌గా అన్నాడువాడు.

వాళ్ళావిడేదో అనబోయింది.

"నువ్వు నోర్ముయ్..." అంటూ ఆమెని గదిమి, "...ఇయ్యవేంరా డబ్బులు ఇంకా" అన్నాడు మళ్ళీ.

నేను ముఖం మాడ్చుకుని డబ్బులు వాడి చేతిలో పడేసి వడివడిగా అక్కడినుంచి కదిలాను.

"...ఆ ముదనష్టపు పిసినారి పాత్ర వేసినప్పటి నుంచీ ఇలా తయారవడం నా ఖర్మ. ఇంటికొచ్చిన వాళ్ళని డబ్బులు అడగడం మర్యాదకాదంటే వినిపించుకోరుగదా..." గోపాలకృష్ణ భార్య వేస్తున్న కేకలు మెట్లు దిగుతున్న నా చెవుల్లో పడ్డాయి.

గోపాలకృష్ణ అంటే రామం ఎందుకు మండిపడ్డాడో ఇప్పుడు అర్థమైంది నాకు.

— ప్రతాపచంద్ర



# భయంపై చతుర సమీక్షలు

ఏప్రిల్ నెల 'చతుర'లో ప్రచురితమైన పి. చంద్రశేఖర్ అజాద్ నవల 'భయం'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## యువతకు ఇన్‌స్పిరేషన్

*ప్రథమ బహుమతి రూ 100/- లు పొందిన సమీక్ష*

తెలుగు నవలా సాహిత్యంలో మానసిక విశ్లేషణ నవలలు చాలా తక్కువ. కుటుంబరావు, బుచ్చిబాబు, గోపీచంద్, రావిశాస్త్రి, నవీన్ మొదలైన కొద్దిమంది మాత్రమే ఈ తరహా నవలా రచనలో ప్రసిద్ధులు. మళ్ళీ చాలాకాలం తర్వాత మానసిక విశ్లేషణను, ఆత్మసంఘర్షణనూ ప్రధానంగా తీసుకుని మధ్యతరగతి వ్యక్తుల జీవిత చిత్రణకు పూనుకున్న నవల పి.చంద్రశేఖర్ అజాద్‌గారి 'భయం'.

మధ్యతరగతి కుటుంబాల్లో ఉండే ఆర్థికపరమైన భయాలు, ఆందోళనల కారణంగా ఏర్పడే మానసిక సంక్షోభాన్ని, అలజడిని రచయిత చాలా స్పష్టంగా విశ్లేషించారు. నవలలోని ప్రతిపాత్రా సమాజంనుంచే తీసుకోబడింది. 'నిరంతరం భయానకమైన ఆలోచనల్లో, సమస్యల్లో బాధపడే' మధులాంటి 'మధ్యతరగతి' యువకులు, భర్త బయటికి వెళ్ళింది మొదలు ఇంటికి చేరేంతవరకు సవాలక్ష భయాలతో సతమతమయ్యే జానకిలాంటి ఇల్లాళ్ళు, 'డివైన్‌పవర్' (ప్రత్యేకించి 'మదర్')కి లొంగిపోవడమే మానసికాందోళనల విముక్తికి మార్గమని ఒకపక్క చెప్తూ, తన కుటుంబం విషయంలో మాత్రం తానూ ఆందోళనకు గురయ్యే భరద్వాజ లాంటివాళ్ళు ఇంకా రంగారావు, మనోహర్, సారథి ఇలా.. అన్ని పాత్రలూ అత్యంత సహజంగా వుండడమేగాక, ఆ పాత్రల ఆలోచనలు, భయాలు అన్నీ వాటి స్వభావానికి అతికినట్టుగా వున్నాయి. ఈ ప్రపంచంలోని ప్రతివ్యక్తికీ భయాలు, ఆందోళనలు ఉంటాయన్న విషయాన్ని రచయిత చక్కగా వివరించగలిగారు. భరద్వాజ, సారథి, డాక్టర్ వరుణ్‌లద్వారా భయం (ఫియర్), ఆందోళన (యాంగ్జయిటీ), భీతి (ఫోబియా) మొదలైన వాటిగురించి అతి సరళమైన శైలిలో ఏమాత్రం సందిగ్ధతకి తావులేకుండా 'సగటు పాఠకు'డైన ప్రతి ఒక్కరికీ అర్థమయ్యేలా వివరించిన రచయిత అభినందనీయులు. "ఈ నడుమ మన రచయితలు ఇన్ఫర్మేటివ్ నవలలు రాస్తున్నారు" అని నేటి నవలా రచయితల మీద చిన్న వ్యంగ్యబాణం వేస్తూనే తామూ ఒక విషయం గురించిన ఇన్ఫర్మేషన్ పాఠకులకిచ్చారు.

విషయ ప్రాధాన్యత ఉన్న ఈ నవలకి భాష, శైలి జీవం పోశాయి. మనస్తత్వ చిత్రణ, ఆర్థిక సమస్యల వివరణతో బాటు అప్పుడప్పుడు తాత్త్వికచింతనకు కూడా స్థానమిచ్చి నవలను నడపడం మెచ్చుకోదగ్గ అంశం.

"సాహిత్యంలోలా సమాజం ఉండాలి, సాహిత్యం సమాజంలా ఉండాలి" అన్న మాటను 'భయం' చాలా బాగా నిరూపించింది. ఏ పద్ధతిలో చూసినా ఈ నవల ఉన్నతశ్రేణికి చేరుతుందనడం ఏమాత్రం సాహసంకాదు. అయితే ఈ నవలలో సమాజంలోని అన్ని రకాల వ్యక్తుల చిత్రణను కోరుకోవడం అన్యాయమే అయినా రచయిత 'విరామం'లో చెప్పినట్టు మళ్ళీ ఇంకోసారి మరికొంతమంది కొత్త వ్యక్తుల 'పరిచయాన్ని' పాఠకులు ఆశించవచ్చు.

— సి.ఎ.బాబు, తిరుపతి.





## భయం పోవాలంటే...

**ద్వితీయ బహుమతి రూ 75/- లు పొందిన సమీక్ష**

సమాజంలో, సంసారంలో అనునిత్యం ఎదురయ్యే పలుసంఘటనలు మానవ మస్తిష్కంలోని అంతరాంతరాళాల్లో 'భయం' బీజాలను ఎలా నాటుతాయో సెర్చిలైటు వేసిన ట్టుగా కాకపోయినా టార్చిలైటు వేసి చూపించి నట్టుగానైనా వివరించడానికి ప్రయత్నించారు చంద్రశేఖర ఆజాద్ తన 'భయం' నవలలో.

అనుమానంతో, ఆందోళనతో, అభద్రతతో అనుక్షణం బ్రతుకును భయం భయంగా ఈడుస్తున్న నగటు మనిషి మనస్తత్వాన్ని జానకి పాత్రలో చక్కగా ప్రతిఫలించారు రచయిత. నిజానికి 'భయం' వ్యాధి జానకికొక్కదానికే ఉన్న రుగ్మత కాదు. మధువంటి 'మగ'వాళ్ళు సైతం దీనికి అతీతులు కారు. అయితే భయానికి భయపడి పారిపోకుండా నిలిచి ఎదిరించాలనేదే మధు పాత్రద్వారా రచయిత ఇచ్చే సందేశం. అందుకే అతను దాని మూలాలను కనుక్కోవడానికి ప్రయత్నిస్తాడు- సైక్రియాట్రిస్ట్ వరుణ్‌తో సంభాషణలో తనకు కావల సినది దొరికింది. మనిషిలోని 'ఎగ్రెసివ్ నేచర్' భయాన్ని ఎదుర్కొనడానికి తోడ్పడుతుందని వరుణ్ చెప్తాడు. మరోపక్క జానకి 'భరద్వాజ'తో జరిపిన సంభాషణవల్ల అతను నమ్ముకునే 'మదర్' సిద్ధాంతం అతన్నే తన భయాల నుంచి కాపాడలేకపోయిందని గ్రహిస్తుంది. జీవితంలోని సమస్యలకు భయపడి వేదాంతపరమైన ధోరణిని అనుసరిస్తూ బ్రతుకే మిథ్య అనుకుని బతికే ఎస్కేపిస్టులకు ప్రతీక భరద్వాజ.

అయితే ప్రస్తుతం ఇది మనిషి జీవితానికే భద్రతలేని ప్రమాదాల ప్రపంచం. ఒక పంజాబ్‌లోనో, ఒక కాశ్మీర్‌లోనో (ప్రాణ) భయంలేకుండా బతకమని మనమెవరికీ అంత తేలిగ్గా చెప్పలేం. అక్కడి వాళ్ళకి జీవితం ఏ రోడ్డుమలుపులోనో, బస్సులోనో, రైల్లోనో అంతమవుతుందో అని అనుక్షణం భయమే. అన్నెం, పున్నెం ఎరుగని ఎందరో అమాయకులు అక్కడ తీవ్రవాదుల చేతుల్లో హతమవుతున్న వార్తలు • చదువుతున్నాం. భయాన్ని ప్రేరేపించే పరిస్థితులున్నంతవరకూ మనుషుల్లో భయం అనేది ఉంటూనే ఉంటుంది. భయం పోవాలంటే ఆ పరిస్థితులూ ఉండకూడదు కొన్ని సందర్భాల్లో. అందుకే చివర్లో రచయిత విరామమిచ్చారు. ఐతే, ఎప్పటికప్పుడు నూతన రూపాల్లో తలెత్తే భయాల్ని ఎదుర్కోవడానికి ఆయారకాల ఆత్మరక్షణా పద్ధతుల్లో సంసిద్ధులై ఉండాలి. భయం ఎక్కువైతే దానితోపాటు జాగరూకత, తెగువకూడా ఎక్కువ కావాలి.

— శేషు, తిరుపతి.

## స్ఫూర్తి

**తృతీయ బహుమతి రూ. 50/- లు పొందిన సమీక్ష**

ప్రస్తుత సమాజంలో చాలామందిలో తమకే తెలియకుండా అంతర్లీనమై ఉన్న 'భయం' అనే మానసిక రుగ్మతను వెలికితీసి, దానికి విరుగుడు సూచించే యత్నంలో రచయిత సఫలీకృతులయ్యారనిపించింది. మహాకవి ఆత్రేయ మినహా మరెవర్నూ చర్చించని ఈ కథావస్తువును పాఠకులకు అందించిన రచయిత అభినందనీయులు. ప్రతి మనిషిలోనూ, ముఖ్యంగా భర్త, పిల్లలు అనే ప్రపంచాన్ని తనచుట్టూ ఏర్పరుచుకొని వారి గురించి మాత్రమే ఆలోచించే జానకిలాంటి స్త్రీలకు ఎల్లప్పుడు మనసులో మెదిలే పెనుభూతం 'భయం'. పరిస్థితుల ప్రభావం, పసితనంలోని భయం గొల్పే సంఘటనలు, ముఖ్యంగా ఆత్మస్థయిర్యం లోపించడం కూడా భయాలకు కారణాలు కావచ్చు.

రచయిత పాఠకులకు 'భయం' గురించి పూర్తి అవగాహన కల్గటానికి వీలుగా జానకి జీవితాన్ని ఉదహరించిన తీరు బావుంది. జానకి సంసారనావని నడిపించటంలో పూర్తిగా నిమగ్నమై నిత్యం సమస్యలని ఎదుర్కొంటూ ఊపిరి సలపని రోజుల్లో 'భయం'కి గురికాలేదు. ఏ మనిషైనా సమస్యల వలయంలో చిక్కుకొని ధైర్యంగా వాటిని ఎదుర్కోవడానికి ప్రయత్నించినంత వరకు 'భయం' వారి దరిదాపులకు రాదు. అవి వారి స్వంత సమస్యలే అయి ఉండక్కర్లేదు. తీరికగా ఉన్న సమయా



న్ని సమాజసేవలో వినియోగిస్తే అటు సమాజానికి, ఇటు వ్యక్తికి ఎంతో మేలు జరుగుతుంది.

డాక్టర్ వరుణ్ 'భయం' గురించి ఇచ్చిన వివరణ చాలాబావుంది. చదువుతున్నంతసేపూ ఓ సైక్రియాట్రిస్ట్ దగ్గరికి వెళ్ళి స్వయంగా విషయాన్ని విపులంగా తెలుసుకున్న అనుభూతి కలిగింది. శ్రీధర్, లక్ష్మిల పాత్రలు రచయిత ఆదర్శవంతంగా మలచారు. స్వశక్తితో పైకివచ్చిన మధు, భార్యని భయానికి దూరం చేయటానికి ప్రయత్నించిన తీరు బావుంది. ప్రపంచమంతా 'మదర్' మయం అనుకునే భరద్వాజ లాంటి తాత్వికుడు కూడా 'భయరోగ' బాధితుడే అనుకుంటే నవ్వు వచ్చింది.

ప్రపంచంలోని దాదాపు అన్ని సమస్యలకు, కొన్ని హత్యలకు మూలకారణమైన 'భయం' అనే సామాజిక రుగ్మతను చంద్రశేఖర ఆజాద్ గారు విపులంగా చర్చించి 'భయం'పై ఉన్న కొన్ని భయాలను మాలో పోగొట్టారు. నవల ముగించిన తీరు అద్భుతంగా ఉంది. ఇటువంటి కొత్తతరహా నవలను అందించిన 'చతుర'ను అభినందించకుండా ఉండలేకపోతున్నాం. ఈ నవల జానకిలాంటి వారెందరికో స్ఫూర్తి కావాలి.

— ఎ.రాధాశ్రీనివాస్, కోదాడ.

## మానసిక రుగ్మతకి టానిక్

**రూ.25/-లు బహుమతి పొందిన సమీక్ష**

శ్రీ పి. చంద్రశేఖర్ ఆజాద్‌గారి 'భయం' నవల మారుతున్న సమాజంలో మారని మనస్తత్వాలకి ఓ మేలుకొలుపు. భయమే ఇంధనంగా ఆహుతయ్యే వ్యక్తులకి ఓ తిరుగుబాటు పిలుపు. కట్నాలు, కన్నీళ్ళు, కష్టాలు, పెళ్ళిళ్ళు లాంటి రొటీన్ సబ్జెక్ట్‌నికాక మానవ బలహీనతల్లో ఒకటైన 'భయాన్ని' ఆజాద్‌గారు నవలావస్తువుగా తీసుకోవడం మెచ్చుకోదగ్గ విషయం.

నవలలో రచయిత తను చెప్పదలచుకున్నది చక్కగా చెప్పగలిగారు. కథకు తగిన కథనం నవలకి అందంతెచ్చింది. మనిషిని కుదిపేసే కొన్ని సంఘటనలవల్ల భయంతో ప్రతినిత్యం ఉగిపోయె జానకిలాంటి ఇల్లాళ్ళు మన సమాజంలో ఎందరో ఉన్నారు. అనవసరపు ఆలోచనలతో భయపడేవాళ్లూ ఉన్నారు. కలలు వాళ్ళని మరింతగా కలవరపెడతాయ్. లేని కుటుంబాల్లోనే దేకుకుంటూ వచ్చిన జానకి మనస్సు మరీ సున్నితం అవటంలో ఆశ్చర్యంలేదు. మొరటుతనం తెలియని మనుషుల్ని భయంలాంటి రుగ్మతలు డామినేట్‌చేస్తాయ్. మానసికంగా బాధపడే మనిషిని మరింత బాధపెడుతుంది భయం. బాధ బాధగానే ఉంటే కథే లేదు. బాధా, భయం మనిషిని కృశింపచేస్తూంటే దానికి తరుణోపాయం కావాలి. అప్పుడే భరద్వాజ, సారథిలాంటివాళ్లు అవసరం. డాక్టర్ వరుణ్ అవసరమూ తక్కువేంకాదు. మనోహర్ అకాలమరణం జానకిలో భయానికి పరాకాష్ఠగా మారినా తర్వాత ఓ నవచైతన్యానికి నాందీపలుకుతుంది. ఈ దశలోనే పక్కింటి వదినగారి విషయంలో ఓ సామాజిక అన్యాయం మీద తాను పోరాటం జరపడం, అందులో విజయం సాధించడం ఆమెలో టానిక్‌లా పనిచేస్తాయ్. ఇక్కడ మధు పాత్ర చెప్పుకోతగ్గది. దరిమిలా శ్రీధర్, లక్ష్మిల సాహసోపేతగాథ ఓ పాఠంగా జానకిలోని 'భయం' తొలగిస్తుంది. కొత్తవ్యక్తిత్వాన్ని జానకిలో చూడగల్గుతాం.

అరుదైన సబ్జెక్ట్‌కి ఖరీదైన క్లారిఫికేషన్ జత కావడంతో నవలకు సామాజిక ప్రయోజనం చేకూరింది.

— చినరామచంద్రరావు, రామచంద్రపురం.

## భయంనుండి విముక్తి

**రూ.25/-లు బహుమతి పొందిన సమీక్ష**

రచయిత భయాన్ని చాలా చక్కగా అనలైజ్ చేశారు. భయాన్ని, అంగ్జయిటీకి, ఫోబియాకీవున్న తేడాలను, వాటి పర్యవసానాలను వాటి చికిత్సావిధానాలను చక్కగా విశ్లేషించి చెప్పడంవల్ల పాఠకులకు భయాన్ని గురించిన సైకాలజీని, విజ్ఞానాన్ని బోధించినట్లయింది. విజ్ఞానం మానవుడు సలిపే జీవనపోరాటానికి ఎంతో అవసరం. అనేక శారీరక రుగ్మతలకు, మానసికమైన ఈ భయమే కారణం కావచ్చునన్న అభిప్రాయం రచయిత ఈ నవల ద్వారా తెలియజేశారు. అంతేకాదు భయంపై జానకి





లాంటి స్త్రీమూర్తులు చేసే తిరుగుబాటు పతనమౌతున్న సమాజానికి ఒక విప్లవగుళిక కావచ్చునని గూడ చాలా చక్కగా తెలియజేశారు.

కాని రంగారావు గారికి తన ఫోబియా నుండి విముక్తి దొరకలేదు. కారణం తన రుగ్మతకు కారణం ఆయన ఆలోచించలేదు. ఆ లోపాన్ని సరిదిద్దుకోవడానికి ఆయన ఏ ప్రయత్నం చేసినట్టూ కనిపించదు. కాని జానకి అలాకాదు ప్రతినిముషం ఆమె తనకలాంటి వ్యాధులు రాబోతున్నాయా అని ఆలోచించింది. అలాకాకూడదని గట్టి ప్రయత్నం చేసింది. శ్రీధర్ ఇచ్చే పుస్తకాలు జీవనవిధానంలో మధుతో సహకరించటం, మధు ఇచ్చే కొద్దిపాటి ప్రోత్సాహం, లక్ష్మిధైర్యం, ఈ సంఘటనలనుండి ఆమె చాలా చాలా నేర్పుకుంది. జీవితాన్ని గురించిన తన బయాలు అర్ధరహితమైనవని, అన్యాయాల్ని సహిస్తూపోతే, భయంతప్ప ఫలితం లేదని, అన్యాయాన్ని ఎదిరిస్తే ఇతరులకు సహాయపడటమేకాకుండా, ఎంతో విలువైన మానసిక ఆనందం కల్గుతుందని అనుభవపూర్వకంగా తెలుసుకోగల్గింది. అంతేకాదు. మధు, శ్రీధర్, లక్ష్మిలతోపాటు, సభాసమావేశాలలో పాల్గొనటమే కాకుండా సంఘ విద్రోహక "దేముల్ని అరెస్టుచేయాలి" అంటూ నినాదాలు చేస్తూ విప్లవ ప్రదర్శనలో పాల్గొనే ధైర్యాన్ని పొందగలిగింది జానకి.

భయం నవల పూర్తికాకపోయినా, జానకి భయం నుండి విముక్తి కావడానికి తొలిఅడుగు వేసింది. సహజం, నిత్యం అయిన భయం - కాస్త విరామం పొందటంలో నవల పూర్తయింది. ఈ ఉపసంహారం ఎంతో తృప్తిగా వుంది.

— శమంత ,పెరుమాళ్ళపల్లి.

## సమస్యల పరిష్కారం

*రూ. 25/-లు పొందిన సమీక్ష*

"భయం" నవల మొత్తం మధ్య తరగతి కుటుంబీకుల జీవితాల నిలువుటద్దం. కుటుంబ, ఆర్థిక, సామాజిక పరిస్థితులు, అందులో కలిగే భయాందోళనలు, వాటి పరిణామం, వాటివల్ల కలిగే అనర్థాలను, వాటి పరిష్కారాలను రచయిత వివరించడం ప్రజోపయోగకరంగా ఉన్నాయి. ఒకవిధంగా అలాంటి భయాందోళనలకు గురియౌతున్న సమాజ ప్రజల శ్రేయస్సు దృష్ట్యా ఈ రచన చేశారనే భావన స్పందిస్తున్నది. అది ఈ నవలలో విశిష్ట లక్షణం. ప్రతివ్యక్తికి అర్థమయ్యే రీతిలో వివరించటానికి రచయిత చేసిన ప్రయత్నం ప్రశంసనీయం. అది రచయిత లక్ష్యానికి ప్రతీక.

జానకిలాగే సమస్యలను తమలోనే దాచుకొని తమ భర్తల, పిల్లల సౌకర్యాల కోసమే బ్రతుకుతున్న భార్యలు నేటి సమాజంలో కోకొల్లలు. అలాంటివారు కేవలం వంటింటికే పరిమితం కాకుండా బయటి ప్రపంచంతో సంబంధాలు కల్పించుకోవాలి. వారు తమ భవిష్యత్‌ను వారే తీర్చిదిద్దుకోవాలి. అప్పుడే వారికి పిచ్చి ఆలోచనల నుండి ముక్తి భయాల నుండి విముక్తి. ప్రతీవ్యక్తి శ్రీధర్ భార్య లక్ష్మిలా ఎలాంటి దుస్సంఘటనైనా ధైర్యంగా ఎదిరించగలగాలి. ప్రతీభర్త తన భార్యను ఒక వ్యక్తిగా, స్నేహితునిగా భావిస్తే వారి సమస్యలను భర్తతో చెప్పుకొని పరిష్కరించుకుంటారు. అందుచేత వారి మనస్సు ఎటువంటి భయాందోళనలకు గురికాదు.

నిరంతరం యంత్రాలతో కుస్తీలుపట్టే నేటి ఆధునిక మానవుని మనస్సులో భయం పెరిగితే మానవ మనుగడే కష్టతరమౌతుంది. గాలిలో దీపాల్లాంటి మనుష్యుల జీవితాలను తలచుకుంటేనే భయంవేస్తుంది. ఆ భయమే కొందరి జీవితాలకు తీరని సమస్య అవుతుందని, అది మనిషి వినాశనానికి కారణభూతమౌతుందని చాలామందికి తెలియదు.

భయం, ఆందోళన, భీతి ఏ విధంగా సంక్రమిస్తాయి, వాటి పరిణామాలు అనే దాని విషయమై రచయిత నవలలో చాలా విశదంగా చర్చించారు. అంతేకాక మనోహర్, రంగారావు పాత్రల ద్వారా భయం మితిమీరితే కలిగే అనర్థాలను నిర్దిష్టంగా వివరించగలిగారు. సమాజంలో సమస్యలతో సతమతమయ్యేవారికి పరిష్కార మార్గం తన నవల ద్వారా అందించిన రచయితకు అభినందనలు. ప్రచురించిన "చతుర"కు మా కృతజ్ఞతలు.

— శోభ దేముడు, కోనాం.

చతుర
సంపుటి: 13 సంచిక: 5 జూన్ 1990

భీమన్న స్వయంకృషితో చదువుల్లో సమర్థునిగా నిరూపించుకుని కాలేజీ లెక్చరర్‌గా స్థిరపడిన నవయువకుడు. అతని ప్రగతికి ఉన్న ఒకే ఒక అండ, అడ్డంకి కూడా అతను అమితంగా అభిమానించే స్వంత బామ్మగారే. ఆవిడ చాదస్తాన్ని కాదనలేని బలహీనతతో తానెన్నో కోల్పోతున్నానని అనుకుంటాడతను. అయినా చేయగలిగిందేమీ లేదన్నట్లు చూస్తుండిపోతాడు.

అలాంటి "ప్రశాంత" వాతావరణంలోకి తుఫానులా ప్రవేశించింది అతని విద్యార్థిని ఓ గడుసుపిండం.

ఆ తెలివైన ఆధునిక యువతి ఈ చాదస్తపు బామ్మా-మనవల్ని ఎలా దారిలోకి తీసుకురాగలిగింది? అందుకామె ఆడిన నాటకాలు, ప్రయోగించిన చిట్కాలు ఎలాంటి మలుపులు తిరిగాయి?

సునిశిత హాస్యంతో రసవత్తరంగా సాగే "వయ్యాస్సారెస్" తాజా నవల

# భీమఖిరథం

ఈనెల "చతుర" సమర్పిస్తున్న సమగ్ర నవల

ఉదయం పదిన్నర గంటలవేళ...

స్టాఫ్‌రూం సందడిగా ఉంది. లెక్చరర్లు గ్రూపులు గ్రూపులుగా చేరి పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు. వాళ్ళంతా మరో అరగంటలో క్లాసులకి వెళ్ళాలి. ఈలోగా రిలీఫ్‌కోసం అన్నట్టు క్లాసు పుస్తకాలు, పాఠాలకు సంబంధంలేని ఇతర విషయాల గురించి ముచ్చటించుకుంటున్నారు. ఆ ముచ్చట్లతో పాలుపంచుకొని ఆ జాతికే చెందిన మరోజీవి ఆ గదిలో ఓ పక్కగా కూర్చునివుంది.

ఆ జీవిపేరు భీమన్న. తెలుగు లెక్చరర్‌గా వున్న ఆ జీవికి ఈ వుద్యోగం కొత్త. కాలేజీ, ఇక్కడి మనుషులు అసలీ జీవితమే కొత్త. చాలా విషయాల్లో అతనింకా ఎంతో నేర్చుకోవాల్సివుంది. కొన్ని విషయాలు ఇప్పుడిప్పుడే నేర్చుకొంటున్నాడు. తోటి లెక్చరర్ల మనసులతో బాటు మరోవంక విద్యార్థుల్ని చదివే ప్రయత్నంలో వున్నాడు. ఈ "మహా ప్రస్థానం"లో కొన్ని సార్లు ఎదురు దెబ్బలు తింటున్నాడు; మరి కొన్నిసార్లు సురక్షితంగా గట్టెక్క గలుగుతున్నాడు.

భీమన్న ఇంటర్ ఫస్ట్‌ఇయర్ తెలుగుపుస్తకం ముందేసుకొని ఇవాళ చెప్పాల్సిన పాఠాన్ని మననం చేసుకుంటున్నాడు. నిజానికి రాత్రి చాలాసేపు ఇంటి దగ్గర కష్టపడ్డాడు. పాఠం వరకు ఢోకాలేదు. ఎటొచ్చి పిల్లల ముందు పుస్తకం చూడకుండా మంచి పద్యమొకటి రాగయుక్తంగా పాడి వాళ్ళచేత సెభాష్ అనిపించుకోవడానికే ఈ శ్రమంతా. ఇది తనకి అత్యావసరం కూడా.

దీనికి అతను చెప్పే కారణం ప్రకారం.

తరతరాలుగా కాలేజీ వాతావరణంలో ఓ దుష్ట సంప్రదాయం పాతుకుపోయివుంది. తెలుగు సబ్జెక్టు అంటే స్టూడెంట్సుకి ఏమాత్రం సీరియస్‌నెస్ లేదు. తెలుగు మాస్టారన్నా అదే పరిస్థితి. దీంతో క్లాసులో శ్రద్ధగా తెలుగుపాఠం వినే కుర్రాళ్ళే కరువయ్యారు. ఈ పరిస్థితిని మార్చడం తనొక్కడివల్ల కాదని భీమన్నకి తెలుసు. కాకపోతే తెలుగుసబ్జెక్టు చదివిన నేరానికి... ఆ మాటకొస్తే వాళ్ళ బామ్మ వగైరాలు పట్టుబట్టి చదివించిన నేరానికి... ఈ ఉద్యోగం చేయాల్సి వచ్చిన నేరానికి...క్లాసులో పిల్లల ముందు మనుగడ సాగించకతప్పదు. తన సత్తా ఏమిటో నిరూపించుకోకతప్పదు. పిల్లల్ని ఆకట్టుకుని తెలుగు క్లాసు అనే మహాసముద్రాన్ని ఈదాలి.

అదుగో అందుకే ఈ తిప్పలు. గడుగ్గాయి కుర్రాడొకడు నిన్న అడిగాడు కూడా.

"మాస్టారూ... పద్యాలు వచనంలో చదివితే వినసొంపుగా లేవండి. పాతమాస్టారు చక్కగా రాగయుక్తంగా పాడేవారు. ఆయనకి బోలెడు పద్యాలు కంఠతావచ్చు" ఇదీ ఆ కుర్రాడి విన్నపం.

మిగతా పిల్లలుకూడా ఔను ఔనంటూ అతనికి వంతపాడారు.

దాని అర్థం "మీరూ అలాగే పాడండి" అని.

వాళ్ళు అడిగిన దాన్లో భీమన్నకి తప్పేమీ కనిపించలేదు. కాకపోతే చెమటలు మాత్రం పట్టాయి. తనకి పట్టుమని పది కాదుగదా క్షుణ్ణంగా ఒక్క పద్యమన్నా వచ్చు అన్న ధైర్యంగాని ధీమాగాని లేదు. పైగా రాగయుక్తంగా పాడటమంటే తన గొంతుక్కి ఓ పెద్ద పరీక్ష. నడి సముద్రంలో తుఫానులో ఇరుక్కున్న నావమాదిరిగా భీమన్న చాలా ఇబ్బందిగా ఫీలయ్యాడు ఆకాసేపు. అంతలోనే పిరియడ్ అయిపోయింది. "టైమ్ అయిపోయిందిగదా. రేపు చూద్దాం" అంటూ ఆ క్షణాన హుందాగా ఓ మాట అడ్డేసి బైటపడ్డాడు.

అందుకే రాత్రంతా కష్టపడి ఓ పద్యం బట్టీవేశాడు. చదువుకునే రోజుల్లో పద్యాలు ఏనాడూ బట్టీ వేసిన పాపాన పోలేదు. అందుకే ఓ పట్టాన ఆ పద్యం మింగుడుపడలేదు.

ఎదురుగా గోడగడియారం పదీముప్పావు చూపిస్తోంది.

ఇంకో పావుగంటలో క్లాసుకెళ్ళాలి.

ఫైనల్‌గా తనకితనే ఆ పద్యాన్ని వప్ప జెప్పుకుందామనుకుని ఎదురుగా గోడవైపు చూస్తూ లోలోన మననం చేసుకోసాగాడు. రెండు పంక్తులు పూర్తయ్యాక బ్రేకుపడింది. ఎంత గింజుకున్నా గుర్తుకి రావడంలేదు. సమయం వృధా చేయడం ఇష్టంలేక పుస్తకంలో తలదూర్చాడు.





ఇంతలో వెనకనుంచి భుజంమీద ఎవరో చెయ్యేశారు.

"ఏమిటి గురువుగారూ... రుబ్బుతున్నారు?"

ఆ గొంతు హిస్టరీ లెక్చరర్‌దని గుర్తుపట్టాడు భీమన్న.

వెనక్కి తిరిగి ఆయనవైపు అమాయకంగా చూశాడు.

రుబ్బుతున్నాననంటాడేమిటి? రుబ్బడానికి ఇదేమన్నా కందిపచ్చడా? అనుకున్నాడు భీమన్న. కందిపచ్చడి గుర్తురాగానే భీమన్న నోట్లో లాలాజలం ఊరింది గానీ హిస్టరీ మాస్టారు అదేమీ గమనించుకున్నట్టు లేరు. భీమన్నకి కందిపచ్చడి గుర్తుకురాగానే బామ్మ మదిలో మెదిలింది. ఇవ్వాళ రాత్రికి బామ్మచేత కందిపచ్చడి రుబ్బించుకొని తినాలని ఆ క్షణాన్నే నిర్ణయించుకున్నాడు భీమన్న.

"ఏమిటండీబాబూ...కందపద్యాలు, సీసపద్యాలు కలిసి రుబ్బుతున్నట్లున్నారే- పిల్లల కోసం?" హిస్టరీ మాస్టారు మళ్ళీ అన్నారు.

అందులో కొంత వెటకారం ధ్వనించింది. భీమన్న దాన్ని గుర్తించకపోలేదు.

"స్టూడెంట్స్‌గా వున్నప్పుడు ఎలాగూ రుబ్బక తప్పలేదనుకోండి. లెక్చరర్లమయ్యాకకూడా మనమే రుబ్బడమేమిటండీ? ఎందుకంత కష్టపడతారు? ఉద్యోగం వున్నది సుఖపడటానికా కష్టపడటానికా? అరుబ్బుడు కార్యక్రమాన్ని కుర్రాళ్ళకే వదిలేయండి" హిస్టరీ లెక్చరర్ హితబోధ చేశారు.

'మనం చెయ్యాల్సింది కూడా చెయ్యాలిగదండీ" అన్నాడు భీమన్న సిన్సియర్‌గా.

"అదేనండి నేను చెప్పేది కూడా. మనం చెయ్యాల్సిందే అది" అన్నాడాయన దెప్పిస్తూ.

"ఏది?" అమాయకంగా అడిగాడు భీమన్న.

"కష్టపడటాన్ని కుర్రాళ్ళకే వదిలేయాలి"

"అంటే...?"

"అంటే ఏమిటండీ పిచ్చిపంతులుగారూ..." అంటూ హిస్టరీ లెక్చరర్ ఓ కుర్చీ లాక్కొని భీమన్న పక్కనే కూర్చున్నాడు.

"క్లాసుకు వెళ్ళాక పీరియడైనంతవరకు మనం కష్టపడకుండా చూసుకోవాలి. మీకీ ప్రొఫెషన్ కొత్త. పంతుళ్లలో చాలామందికి నోటి క్యాన్సర్, గొంతు క్యాన్సర్ వస్తున్నదని ఆ మధ్య ఓ సర్వేలో తేలింది. ఎందుకోతెల్సా? అస్తమానం వాగుతుంటాం కాబట్టి. ఈ పిల్లగాళ్ళ కోసం మనం గొంతు చించుకుంటూ క్యాన్సర్ పాలుగా వడమేమిటండీ? అదేదో వాళ్ళచేతే వాగించామనుకోండి మన ఆరోగ్యం క్షేమంగా వుంటుంది గదా. మీరు చెప్పదలుచుకున్న పాఠమేదో... పుస్తకాలు చూసి ఒక్కో కుర్రాడిచేత ఒక్కో పేరా చదివిస్తే పోయే. మీ సబ్జక్టులో అయితే ఒక్కో కుర్రాడి చేత ఒక్కో పద్యం అనుకోండి. ఆలోగా పీరియడ్ అయిపోతుంది" విడమరిచి చెప్పాడు హిస్టరీ లెక్చరర్.

భీమన్నకి ఇతని వైఖరి నచ్చలేదు.

"మన సుఖం మనం చూసుకుంటే కుర్రాళ్ళు అన్యాయమై పోతారుగదండీ"

"మీరు ఉత్త అమాయకుల్లా వున్నారండీ... నేను చెబుతున్నది అబద్ధంకాదు... చరిత్రండీ బాబు చరిత్ర. మీరు ఈ జాబ్‌కు కొత్త కదా... కొత్త రక్తంలో ఇలాంటి ఆలోచన్లు సహజమే. కుర్రాళ్ళు అన్యాయమై పోతారని మీరనుకుంటె అంతకుమించిన తెలివితక్కువతనం మరోటి వుండదు. ఇక్కడ మీరెంతబాగా చెప్పినా వాళ్ళు బైట వేలకి వేలు పోసి ప్రతి సబ్జక్టుకి ట్యూషన్ తీసుకుంటూనే ఉంటారండీ. పాపం వాళ్ళని రెండుచోట్ల కష్టపెట్టడమెందుకులే అని నేనసలు క్లాసులో పాఠాలే చెప్పను"

"మరేం చెబుతారు... టైమెలా గడుస్తుంది?"

"వాళ్ళకి నచ్చిన పిచ్చాపాటీ చెబుతాను. అందులో వున్నంత హాయి ఇంకెందులోనూ వుండదు. అనుభవంమీద మీరే తెల్సుకుంటారండీ" అంటూ కుర్చీలో నుంచి లేచి వెళ్ళిపోయాడాయన.

పదకొండింటికి ఫస్ట్ పీరియడ్ అయిపోయింది! స్టాఫ్‌రూంలో సందడి ఎక్కువైంది. అలిసిన ముఖాలతో క్లాసుల నుంచి కొందరు లెక్చరర్లు రూముకి చేరారు. క్లాసుకి వెళ్ళడానికి

ఇంకొందరు రెడీ అవుతున్నారు. భీమన్నకి ఇప్పటిదాకా నీతి చంద్రిక వినిపించినహిస్టరీ లెక్చరర్ హుషారుగా క్లాసుకి బయల్దేరి వెళ్ళాడు.

భీమన్న ఆఖరిసారిగా పద్యం చూసుకుంటుండగా ఓ కుర్రాడు వెనగ్గా వచ్చి "సర్... ఇప్పుడు మాకు మీరే సర్" అన్నాడు వినయంగా.

"ఆ... వస్తున్నా పద" అంటూ ఆ కుర్రాణ్ణి పంపేసి, భీమన్న కుర్చీలో నుంచి లేచాడు. తెలుగు పుస్తకం, అటెండెన్స్ రిజిస్టర్, డస్టర్, చాక్‌పీస్‌లు తీసుకుని స్టాఫ్ రూమ్ నుంచి బైటపడ్డాడు.

నడుస్తున్నాడేగాని ఆ పద్యమే మనసులో మెదులుతోంది. ఎక్కడా సట్టువడకుండా సాఫీగా సాగిపోతుందా అంటే సందేహమే. ఆ సందేహంలో నుంచి పుట్టుకొచ్చిన వణుకు భీమన్న గుండెల్లో పియానో సంగీతంలా సన్నగా ధ్వనిస్తోంది. దాని ఆనవాళ్ళు ముఖంమీద కనిపిస్తున్నాయి. కర్చీఫ్‌తో చెమటతుడుచుకున్నాడు. అతి ప్రయత్నంమీద గంభీరంగా ముఖంపెట్టి, అదో రకం స్టయిల్‌లో అడుగులేస్తూ ముందుకి నడుస్తున్నాడు.

పక్కక్లాసులోనుంచి హిస్టరీ మాస్టారి గొంతు వినిపిస్తోంది. ఊళ్ళో ఆడుతున్న సినిమాల గురించి ఆయన పిల్లల్ని వాకబు చేస్తున్నాడు.

"ప్చ్... దిగులు, విచారంలేని లెక్చరర్" అనుకున్నాడు భీమన్న మనసులోనే.

పిల్లలకి పాఠాలు చెప్పకుండా, వాళ్ళనిలా మంచి చేసుకోవడమంటే వాళ్ళని చెడగొట్టడంకాక మరేమవుతుంది? ఆలోచిస్తూ నడుస్తున్న భీమన్నకి ఉన్నట్టుండి వింతవింత శబ్దాలు వినిపించసాగాయి. ఆ చుట్టుపక్కలేమన్నా కోళ్ళఫారం వుందేమోనన్న అనుమానం రావచ్చు. కాని భీమన్నకి ఆ ధ్వనులు అలవాటే.. కోళ్ళ అరుపుల్ని గుర్తుకి తెస్తున్న ఆ క్లాసు తనదికాక ఇంకెవరదీ కాబోదన్న విషయం బాగా గుర్తెరిగినవాడు కావడంతో భీమన్న కళ్ళు మూసుకుని ఆ క్లాసులోకి నడిచాడు.

అప్పటిదాకా రణగొణధ్వనులతో మార్మోగిన ఆ గది ఒక్కసారిగా మౌనం దాల్చింది. చీమచిటుక్కుమన్నా వినిపించేటంత నిశ్శబ్దమయ్యేసరికి భీమన్నకి డౌట్ వచ్చింది.

తెలుగు క్లాసులో ఇంతటి బుద్ధిమంతులెక్కడవుంటారు? కొంపదీసి పొరపాటున తాను వేరే క్లాసులోకి రాలేదు గదా అనుకున్నాడు. పిల్లల ముఖాల్ని తరిచి తరిచి చూశాడు. అప్పటికీ నమ్మకం కుదరక 'ఇది ఇంటర్ ఫస్టియర్ క్లాసేగా' అంటూ కూపీలాగాడు.

'ఔనుసార్' - ముందు బెంచీ కుర్రాళ్ళు గొణిగారు.

ఏమిటిమరి? ఇంతమౌనంగా కూర్చున్నారేవీళ్ళు. ఇదేమైనా తుఫానుముందటి ప్రశాంతత కాదు గదా... అనుకుంటూనే పిల్లల ముఖాల్ని గమనించసాగాడు.

క్లాసులోని అబ్బాయిల, అమ్మాయిలందరి దృష్టి బ్లాక్‌బోర్డ్ మీద వుందన్న విషయాన్ని భీమన్న ఎక్స్‌రే కళ్ళు ఇట్టే పసిగట్టేశాయి. వాళ్ళ ముఖాల మీద దోబూచులాడుతున్న వెలుగుకి కారణమేమిటో తెలుసుకుందామని భీమన్న బ్లాక్ బోర్డు వైపు తల తిప్పి చూశాడు. మరుక్షణమే కుర్రమూకంతా ఘొల్లున నవ్వింది!

ఏమాటకామాటే చెప్పుకోవాలి. బ్లాక్‌బోర్డు మీద బొమ్మని చూసీచూడగానే భీమన్న కళ్ళు ఆశ్చర్యంతో మెరిశాయి. ఆ బొమ్మ అతన్ని ఆకర్షించిన మాట నిజం.

ధోవతి, లాల్చీ, నెత్తిన పిలక, ఒక చేతిలో కర్ర, మరో చేతిలో పుస్తకం, కాళ్ళకి కిర్రుచెప్పులు, వంగిన నడుం- ఇదీ ఆ బొమ్మ స్థూల రూపం.

"వీరే మా తెలుగు మాస్టారు" - ఇది ఆ బొమ్మకి రాసిన రైటప్. ఆ ముఖం అచ్చం తనదే. అచ్చుగుద్దినంత ఖచ్చితంగా తన ముఖాన్ని గీయగలిగిన ఆ కుర్రకళాకారుడెవరోగాని మనసులో అభినందించకుండా వుండలేకపోయాడు.

క్లాస్‌రూంలో నవ్వులు అలలు అలలుగా పొర్లిపొర్లి వస్తూనే వున్నాయి.

పక్కక్లాసులోనుంచి హిస్టరీ మాస్టారువచ్చి అసహనంగా ముఖంపెట్టి తలుపు దగ్గర నిలబడ్డారు.

భీమన్న డస్టర్ తీసుకొని టేబుల్ మీద గట్టిగా కొడుతూ 'సైలెన్స్... సైలెన్స్' అంటూ చెవులు చిల్లులువడేంత బిగ్గరగా అరిచాడు.

ఆ అరుపుకి అదిరివడ్డ హిస్టరీ మాస్టరు చెవులు గట్టిగా మూసుకుని తన క్లాసులోకి పరుగుపెట్టారు.

భీమన్న అరుపుకి క్లాసు రూంకూడా ఒక్కసారిగా నిశ్శబ్దమైపోయింది.

"ఏమయ్యా... తెలుగు లెక్చరర్ అంటే మీకెందుకింత చిన్నచూపు? ఎందుకింత ఎగతాళి? తెలుగు భాష ఔనత్యం తెలిస్తే మీరనలు ఇలా ప్రవర్తిస్తారా? మీరిప్పుడు నన్ను అవమానించారనుకుంటున్నారా? అదే మీ తెలివితక్కువతనం. మాతృభాషా బోధకుణ్ణి అవమానించారంటే నిజానికి ఆ అవమానం నాకు కాదు. మన మాతృభాషకే... తెల్సా? మాతృభాషని అవమానించడమంటే మనల్ని మనం అవమానించుకోవడమే. అంటే ఇప్పుడు మీలో ప్రతి ఒక్కరూ ఎవరికి వారే ఇన్‌సల్ట్ చేసుకున్నారన్నమాట. తెలుగు గడ్డమీద పుట్టి తెలుగు భాష గొప్పతనాన్ని తెలుసుకోలేకపోవడం నిజంగా చాలా దారుణమైన విషయం. తెలుగుభాషకి ఎంతటి ఔనత్యం వుందో తెల్సా? తన మేధాశక్తితో ఇవ్వాల్టి రోజున ప్రకృతికే నవాల్‌గా నిలిచిన ఈ మనిషి పుట్టుకలోనే తెలుగుదనముందయ్యా. ప్రపంచంలో ఏ దేశంలో చూసినా... బిడ్డ పుట్టీపుట్టగానే ఏడుస్తాడే కేర్ కేర్‌మని... అచ్చం అది తెలుగు ఏడుపే తెల్సా? అక్కడి నుంచి మొదలవుతుంది తెలుగుభాషకి చైతన్యం. అంతటి మహత్ భాషని నేర్పే మాస్టర్ని మీరిలా అగౌరవపరచడం ఏంబాగాలేదు" అంటూ శ్వాసపీల్చుకునేందుకు కాసేపు ఆగాడు భీమన్న.

పిల్లలు మళ్ళీ బ్లాక్ బోర్డు వైపు చూస్తూ గునగునలు మొదలుపెట్టారు.

భీమన్న డస్టర్ తీసుకుని బ్లాక్ బోర్డు దగ్గరికెళ్ళాడు.

"నేననలు పంచె కట్టనయ్యా" అంటూ బ్లాక్ బోర్డు మీదున్న బొమ్మలో కాళ్ళ భాగం నుంచి నడుముల దాకా డస్టర్‌తో చెరిపేశాడు. పిల్లలు నిశ్శబ్దంగా చూస్తూ ఉండిపోయారు.

"నేనెప్పుడూ లాల్చీలు వేసుకోనే వేసుకోను. నరేనా" అంటు ఛాతి భాగం, చేతులు చెరిపేశాడు. పిల్లలెవరూ మాట్లాడలేదు.

"చచ్చినా నా జీవితంలో పిలక పెట్టనయ్యా" అంటూ ఈసారి తలభాగం చెరిపేసి, పిల్లల వైపు చూశాడు ప్రశ్నార్థకంగా. మళ్ళీ ఓ క్షణమాగి "చేతికర్ర మీరు కొనిచ్చినా పుచ్చుకోనంతే. ఏం మీరు నన్ను ఇలాగే మీ తెలుగు మాస్టారుగా చూడలేరా?" అంటూ చివరిగా చేతికర్రని కూడా చెరిపేశాడు.

బ్లాక్ బోర్డు మీద ఇక బొమ్మ ఆనవాళ్ళు ఏమీ మిగల్లేదు.

భీమన్న తాపీగా వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు. క్లాసంతా నిశ్శబ్దంగా వుంది.

'ఫర్వాలేదు. సీరియస్ మేనేజ్ చేస్తున్నాను' అని మనస్సులో అనుకుంటూ అటెండెన్స్ రిజిస్టర్ తెరిచాడు హాజరు వేసేందుకు.

భీమన్న ఒక్కొక్క పేరు చదువుతుంటే

"ఎస్...సర్...", "ప్రెజెంట్‌సర్..." అంటూ స్టూడెంట్స్ హాజరు చెప్పారు. క్లాసులో మొత్తం అరవై మంది పిల్లలున్నారు. అందరూ హాజరు పలికారు. భీమన్నకి అనుమానం వేసింది. తెలుగు క్లాసుకి అందరూ హాజరు కావడం తన హయాంలో ఇంతవరకు ఎరగడు. అందుకే అతనికి నమ్మ బుద్ధికాలేదు. తలెత్తి ఓమారు క్లాస్ రూం మొత్తాన్ని వరికించి చూశాడు. చాలా బెంచీలు వలుచగా కనిపిస్తున్నాయి. కుర్చీలో నుంచి లేచి నిలబడి వరునగా తలకాయలు లెక్కపెట్టాడు. నగానికి నగం మందే లెక్కతేలారు. అంటే క్లాసుకి రానివాళ్ళకి వేరే వాళ్ళు హాజరు వలికారన్నమాట. మళ్ళీ అటెండెన్స్ రిజిస్టర్ తెరిచి ఒక్కొక్క పేరే పిలుస్తూ, కుర్రాణ్ణి గుర్తుపడుతూ హాజరు వేశాడు. ఈసారి సరిగ్గా ముప్పయ్ మందే పలికారు.

అటెండెన్స్ రిజిస్టర్ మూసి పక్కనపెట్టి, కలం జేబులో పెట్టుకుంటూ భీమన్న అసలు విషయానికొచ్చాడు.

"ఇంతకీ ఆ బొమ్మ వేసిన మహా చిత్రకారుడు ఎవరోయ్?" అందరివైపు చూస్తూ అడిగాడు. ఒక్కరూ మాట్లాడలేదు.

ఓ నిమషం ఆగి మళ్ళీ భీమన్నే నోరు





విప్పాడు.

"పది ఒంట్లు చదువుతాను. ఈలోగా చెప్పాయాలి. లేకపోతే ఫలితం దారుణంగా ఉంటుంది" క్లాసంతా నిశ్శబ్దంగా ఉంది. ఏం జరగబోతోందో ఎవరికీ అర్థం కాలేదు.

ఒకటి...రెండు...మూడు... భీమన్న అంకెలు లెక్కపెడుతున్నాడు.

ఎవ్వరూ పెదవి విప్పలేదు.

ఆరు...ఏడు...ఎనిమిది...

భీమన్న గొంతు మినహాయిస్తే మిగతా వారి మాట వినిపించడంలేదు.

పది అంకెలు చదవడం పూర్తయింది. అయినా ఆ బొమ్మ గీసింది నేనేనంటూ ఎవ్వరూ లేచి నిలబడలేదు.

"ఓహో... క్లాసు మొత్తం కూడబలుక్కుని నమిష్టిగా వేశారన్నమాట" అన్నాడు భీమన్న.

విద్యార్థులనుంచి దీనికీ నమాధానం లేదు.

"అందరూ నిలబడండి" భీమన్న గొంతులోంచి హుకుం జారీ అయింది.

మగపిల్లలంతా ఒక్కొక్కరే నిలబడ్డారు. ఆడపిల్లలు మాత్రం తమకి ఆ ఆదేశం వర్తించదన్నట్టు అలానే కూర్చుండి పోయారు.

"ఏమ్మా... మీకు సెపరేట్‌గా బొట్టు కాటుక పెట్టి చెప్పాలా?" గద్దించాడు భీమన్న.

ఏమనుకున్నారో ఏమో అమ్మాయిలంతా గబుక్కునలేచి నిలబడ్డారు.

అమ్మాయిలకి ఇలా పరాభవం జరిగినందుకు నంతోషంపట్టలేక కొందరు అబ్బాయిలు ఘొల్లున నవ్వారు. వీళ్ళు ఇప్పుడెందుకు నవ్వాల్సి వచ్చిందో భీమన్నకి ఓ పట్టాన అంతు చిక్కలేదు. పిల్లల నవ్వులు మాత్రం ఆగలేదు.

పక్క గదిలోనుంచి హిస్టరీ మాస్టర్ మళ్ళీ తలుపు దగ్గర ప్రత్యక్షమయ్యాడు. పాపం చాలా అసహనంగా ముఖం పెట్టి నిలుచున్నాడాయన. చీటికీమాటికీ ఆయనిలా తన క్లాసు రూంముందుకొచ్చి ఇలా కళ్ళు చికిలించి చూస్తుంటే భీమన్న ఒంటినిండా తేళ్ళు, జెర్రులూ పాకినట్లుగా వుంది.

'నా క్లాసు వ్యవహారంతో నీకేంపని' అని చెప్పాలనివున్నా పిల్లల ముందు గొడవపడటం లెక్చరర్ల స్థాయికి తగదని తనని తానే సమాధానపరచుకున్నాడు.

డస్టర్ తీసుకుని బల్లమీద కొడుతూ 'సైలెన్స్' అని బిగ్గరగా అరవడానికి ఊపిరంతా కూడదీసుకుంటున్నంతలో హిస్టరీ మాస్టరికి ఇందాకటి అరుపు గుర్తుకొచ్చి చెవులు మూసుకుంటూ అక్కడినుంచి గబగబా వెళ్ళిపోయాడు.

మరుక్షణమే భీమన్న "సైలెన్స్" అని అరవడం, పిల్లలంతా సైలెన్స్ అయిపోవడం ఏకకాలంలో జరిగిపోయింది.

క్లాసులో పిల్లలందరూ నిలబడే వున్నారు.

బైటికెళ్ళి పొమ్మంటే బావుణ్ణు మార్నింగ్ షోకి వెళ్ళొచ్చని కొందరు కుర్రాళ్ళు లోలోన ఆలోచన చేస్తున్నారు.

అమ్మాయిలు మాత్రం బితుకుబితుకుమంటూ నిలబడి ఉన్నారు. భీమన్న ప్రిన్సిపాల్‌కు కంప్లెయింట్ ఇస్తాడేమోనని వాళ్ళు భయపడుతున్నారు. ప్రిన్సిపాల్‌కి అసలే ఓవర్ యాక్షన్ చేస్తాడన్న పేరుంది. క్లాసులకి క్లాసుల్నే సస్పెండు చేయడమంటే ఆయనకి మహా సరదా - అందుకే అమ్మాయిలకి భయం.

"చూడండి మై డియర్ ఫ్రెండ్స్..." భీమన్న గొంతువిని అమ్మాయిలు, అబ్బాయిలు వారివారి ఆలోచనల్ని కట్టిపెట్టి అందరూ ఆయనవైపు చూస్తూ నిలబడ్డారు.

భీమన్న ఓ నిట్టూర్పు విడిచి మాట్లాడటం మొదలుపెట్టాడు:

"శ్రావ్యమైన గొంతునుంచి సంగీతం వినిపించినా, చక్కని చిత్రలేఖనం చూసినా నాగుండె ఆనందంతో డాన్స్ చేస్తుంది. ఇందాకటి బొమ్మ నన్ను దృష్టిలోపెట్టుకొని గీసిందే అయినా అందులో ఎంతో కృషివుంది; అంతకు మించిన కళవుంది. దాన్ని నేను అభినందించకుండా వుండలేకపోతున్నాను. ఈ గొప్పతనం మీక్లాసు మొత్తానికే వర్తిస్తుంది. నా క్యారికేచర్‌ని అంత చక్కగా, ఖచ్చితంగా గీసినందుకు మిమ్మల్నందర్నీ అభినందిస్తున్నాను... కూర్చోండి" అంటూ ముగించాడు.



అమ్మాయిలు, అబ్బాయిలు తేలిగ్గా ఊపిరి పీల్చుకుని కూర్చున్నారు. మార్నింగ్ షో ప్రోగ్రాం వేనుకున్న కుర్రాళ్ళు మాత్రం ఉస్సురంటూ చతికిలబడ్డారు.

అందరూ కూర్చున్నాకకూడా చిట్ట చివరి బెంచిలో సోడాబుడ్డి కళ్ళద్దాలకుర్రాడు మాత్రం అలాగే నిలబడి వుండటం భీమన్న దృష్టిలోపడింది. గుమ్మాడికాయలా గుండ్రంగా వున్న ఆ కుర్రాడివైపు చూశాడు భీమన్న-ఏమిటన్నట్టు.

"ఇందాక బొమ్మ గీసింది నేనేసార్...మా నాయనమ్మమీదొట్టు" అన్నాడాకుర్రాడు నెత్తిన చెయ్యిపెట్టుకుంటూ.

క్రెడిట్ అంతా క్లాసు మొత్తానికి దక్కడం ఇష్టంలేక బైటపడిపోయినట్టున్నాడా కుర్రాడు.

"హద్దది...దొరికాడు దొంగ..." భీమన్న మనస్సులోనే గొణుక్కున్నాడు. దొంగని కనుక్కోనేందుకు తాను విసిరిన పాచిక పారినందుకు తనని తానే అభినందించుకున్నాడు. ఈ శుభ సమయంలో మనసారా జుట్టు పీక్కోవాలనిపించింది. ఆ క్షణమే రెండు చేతులూ నెత్తిమీదకి వెళ్ళాయి. మరీ సంతోషమైనా, మరీ కోపమైనా భీమన్న పట్టలేడు. ఆ ఆవేశం చల్లారేక జుట్టు పీక్కుంటేగానీ మామూలు మనిషి కాలేడు. ఉద్యోగంలో చేరాక, కాలేజీ కుర్రాళ్ళముందు మొదటిసారి గెలిచానన్న సంతోషం అతన్ని ఓ పట్టాన నిలవనీయలేదు. కాలేజీ కుర్రాళ్ళముందు జుట్టు పీక్కోవాల్సి రావడం కూడా ఇదే మొదటిసారి. ఇంకో క్షణ మాగితే అతని క్రాఫంతా చిందరవందర అయ్యేదేకాని ఇంతలోనే అతని అంతరాత్మ అడ్డుపడింది.

"ఒరే భీమన్నా ... ఏమిరా నీ తెలివి... రోజురోజుకీ నువు ఎదుగుతున్నావో, సమాజం దిగజారుతోందో తెల్సుకోలేకుండావున్నాను. కుర్రాళ్ళకి టోకరావేసి గెలిచాననుకుంటే ఎలారా చెప్పు! ఏదేమైనా జుట్టు మాత్రం పీక్కోకు. జేబులో దువ్వెనకూడాలేదు. క్లాసులో పిల్లలముందు చెదిరినజుట్టుతో పిచ్చాడిలా కనిపిస్తే నిన్నుమళ్ళీ గేలిచేస్తారు" అని అంతరాత్మ హెచ్చరించడంతో నెత్తిమీదినుంచి భీమన్న బలవంతాన చేతులు తీసేసుకున్నాడు.

సోడాబుడ్డి కళ్ళద్దాల కుర్రాడివైపుచూస్తూ-

"ఏవోయ్... నువు క్లాసుకొచ్చేది బొమ్మలు గీయడానికా? పాఠాలు వినడానికా? పాఠాలకన్నా బొమ్మలే నీకిష్టమైతే చెప్పు- నాలుగు చాక్‌పీసులిస్తాను. వెళ్ళి మంచి సెంటర్ చూసుకొని రోడ్డువక్క బొమ్మలేసుకో. వచ్చేపోయే జనం నాలుగు కాసులు పడేస్తారు. అటు నీ సరదా తీరుతుంది; ఇటు సంపాదనా మిగులుతుంది" అంటూ భీమన్న గద్దించాడు.

వ్యవహారం చివరికిలా తిరిగేసరికి కుర్రాళ్ళంతా అవాక్కయ్యారు. కళ్ళద్దాల కుర్రాడు మరీ ఖంగుతిన్నాడు. క్లాసుమొత్తాన్ని పొగిడిన మాస్టారు తనే ఈ బొమ్మ గీశానని తెలిస్తే వాటేసుకున్నంత పనిచేస్తాడనుకున్నాడుగాని చివరికిలా బెడిసికొడుతుందనుకోలేదు. తను చేసిన చిలిపి పనిని తన నోటిమీదగానే అందరిముందూ ఒప్పేసుకున్నాడు! ఇప్పుడిక వేరేదారేలేదు.

"దొరికిపోయాను... నా ఖర్మగాలి దొరికిపోయాను" అని తననితానే తిట్టుకుంటూ, ఆ కుర్రాడు బెంచీమీద చతికిల బడుతుంటే...

"ఏమిటా గొణుగుడు... నోర్మూసుకుని కూచో" అని గద్దించాడు భీమన్న

ఎంత తెలుగు మాష్టారైతే మాత్రం తెలుగులోనే తిట్టాలని ఏముంది? క్లాసులో కుర్రాళ్ళని తిట్టాల్సి వస్తే ఎంచక్కా ఇంగ్లీషులో ఎన్నితిట్లు లేవు! తెలుగువంతులు తెలుగులో కాక ఇంగ్లీషులో తిడితేనే పిల్లలముందు వెయిట్ పెరుగుతుందని తను చదువుకునేరోజుల్లో తెలుగు మాస్టారు అనేవారు. అందుకే ఎప్పుడు ఎవర్ని తిట్టినా ఇంగ్లీషులోనే తిట్టేవారాయాన! ఇడియట్...రాస్కెల్... బ్రూట్... స్కౌండ్రల్...స్టుపిడ్... - భీమన్న పెదాలనుంచి అప్రయత్నంగా ఈ పదాలు బైటికి దొర్లాయి.

"యూజ్‌లెస్‌ఫెలో..." ఓ కుర్రాడు మరో ఇంగ్లీషు తిట్టు అందించాడు.

మిగతా పిల్లలంతా ఘొల్లున నవ్వారు. వెనక బెంచీల్లో కుర్రాళ్ళు బల్లలు చరుస్తూ అరవసాగారు. గదంతా నవ్వులతో మార్మోగిపోతోంది. తలుపుదగ్గర హిస్టరీ మాస్టారు మళ్ళీ ప్రత్యక్షమయ్యాడు. భీమన్న ఆయనవైపు గు




త్రగా చూశాడు. అప్పటిదాకా అనవసనంగా వున్న హిస్టరీ మాస్టారు బలవంతాన ముఖానికి నవ్వు పులుముకునే ప్రయత్నం చేశారు.

రెండు నిమిషాలకి పిల్లలు వాళ్ళంతటవాళ్ళు అరువులు, నవ్వులు ఆపేశారు. హిస్టరీ మాస్టారు భీమన్నవైపు అదోలా చూస్తూ, భుజా లెగరేసుకుంటూ వెళ్ళిపోయాడు.

"ఆపేశారేం...అలుపొచ్చిందా?" పిల్లల వైపు చూస్తూ అడిగాడు భీమన్న.

ఎవరూ మాట్లాడలేదు.

"ఏమోయ్... ఏమిటీ? యూజ్‌లెస్‌ఫెలో అంటున్నావ్? నేనుగానీ నీకళ్ళకి అలా కనిపిస్తున్నానా?" ఇందాక ఆమాట అన్న కుర్రాణ్ణి భీమన్న నిలేశాడు.

"లేదునర్... మీరు ఇంగ్లీషు తిట్లన్నింటిని వరసగా గుర్తుచేసుకుంటున్నారనుకుని ఇదీ ఓ తిట్టేగదాని అందించాను సర్" అన్నాడతను వినయంగా.

భీమన్న ఓ క్షణం ఆలోచించాడు. ఆ కుర్రాణ్ణి తప్పుబట్టడంలో ఏమాత్రం అర్థం కనిపించలేదు. అందుకే సమయస్ఫూర్తితో వ్యవహరించాడు.

"వెరీగుడ్... కూర్చో..." అంటూ ఆ వ్యవహారాన్ని ఇక అంతటితో ముగించాడు.

నిజానికి భీమన్నకి, ఇంగ్లీషుకి మొదటి నుంచి చుక్కెదురే. అయితే తెలుగు లెక్చరర్ అయ్యాక అతని ఆలోచనలో కొంత మార్పువచ్చింది.

తెలుగువంతులు అనగానే ధోవతి, లాల్చీ, భుజాన ఉత్తరీయం, పిలక, వంగనామాలు, కిర్రుచెప్పులు, చేతిలో గొడుగుకర్ర వుంటాయని ఊహించుకోవడం సర్వసాధారణం. నిజమే... కానీ తను మాత్రం ఈ సంప్రదాయానికి బద్ధుడుకాదలచుకోలేదు. ప్యాంటు, షర్టులో దర్శనమిచ్చి 'హార్నీ... కుర్రతెలుగువంతులు' అనుకునేట్టు అందర్నీ ఆశ్చర్యంలో ముంచెత్తాడు. ఆ మాటకొస్తే తన పర్సనాలిటీయే తెలుగు లెక్చరర్ పోస్టుకి ఓ 'ఎస్సెట్' అని భీమన్న అభిప్రాయం. ఆ విషయం వాళ్ళబొమ్మ ముందు అవకాశం చిక్కినప్పుడల్లా ఊదరగొడుతుంటాడు కూడా.

తను క్లాసులో పిల్లల్ని ఆకట్టుకుని చక్కగా పాఠం చెప్పగలుగుతున్నాడు. పిల్లలంతా అరమోడ్పుకన్నులతో చూస్తూ... తను పాఠం ఎలా చెబుతున్నా శ్రద్ధగా వింటున్నారు. మగపిల్లల విషయం వదిలేద్దాం. అమ్మాయిలు తన క్లాసులో ఎంత నిశ్శబ్దంగా వుంటారని! ఆ మాటకొస్తే అదంతా నిజంగా పాఠం మీద శ్రద్ధా? కాదు... ఎంతమాత్రం కాదు. తనమీద ఆసక్తి అంతే. తనమీద శ్రద్ధ కొద్దీ వాళ్ళు పాఠాలు వింటున్నారు. వాళ్ళ ఆసక్తి కొద్దీ తనుకూడా ఒళ్ళుమరచి తన్మయత్వంతో పాఠం చెబుతాడు. చివరికాపాఠం సూపర్బ్‌గా వస్తుంది. కాబట్టి ఏకక్రియాద్వ్యర్థకరీ ... అన్నట్టు రెండింటికి రెండూ నెరవేరుతున్నాయ్.

క్లాసులో మళ్ళీ సన్నగా గొడవ మొదలైంది. దాంతో భీమన్న ఆలోచనలకి అంతరాయం కలిగింది. 'సైలెన్స్ ... సైలెన్స్' అంటూ టేబిల్ మీద చేతితో గట్టిగా చరుస్తూ క్లాసుని అదుపులోకి తెచ్చాడు.

తెలుగు పుస్తకం తెరచి పాఠం ప్రారంభించబోతుండగా...

"సార్... సార్... ఇవ్వాళ పద్యం పాడతానన్నారుసార్..." అంటూ నలుగురైదుగురు కుర్రాళ్ళు ముక్తకంఠంతో గుర్తుచేశారు.

వాళ్ళవైపు ఓ క్షణం తీక్షణంగా చూశాడు భీమన్న.

"అవునయ్యా - పాడతానన్నాను. పాడతాను సరేనా... కాని పాఠంలో ఆ పద్యం రావాలిగదా ... రానివ్వండి. అప్పుడు పాడతాను. సందర్భశుద్ధిలేకుండా ఏ పనిచేసినా రసాభాసే మిగులుతుంది. తెల్సా... ఈ కొటేషన్ గుర్తుంచుకోండి. ముందు పుస్తకాలు తెరిచి పాఠం చూడండి" అందరూ పుస్తకాలు తెరుస్తూండగానే అవతల గంట మోగింది.

"తెలుగుపాఠం సమాప్తమ్..." అంటూ వెనకనుంచి ఎవరో మంత్రోచ్చారణ చేసినట్టు పలికాడు.

మిగతావాళ్ళకి నవ్వొచ్చిందిగాని భీమన్న సీరియస్‌గా వున్నాడని గ్రహించి పెదాల చాటునే దాచేసుకున్నారు.

"ఏడుస్తూ వ్యవసాయం చేస్తే, కాడీ-మోకులు దొంగలు ఎత్తుకెళ్ళారట. మన బుద్ధులు





ఎలా వుంటే అలానే జరుగుతుంటుంది. ఇవ్వాళ్టికి ఈ విధంగా పుణ్యకాలం గడిచిపోయింది" అంటూ చటుక్కున పుస్తకం మూసేసి క్లాస్ రూం నుంచి బైటకి నడిచాడు భీమన్న. పద్యాన్ని మరింత బాగా ప్రిపేర్ కావడానికి రేపటిదాకా టైమ్ చిక్కినందుకు లోలోన సంబరపడకపోలేదు. పాఠం వినడం తప్పినందుకు మాత్రం కుర్రాళ్ళు ఆనందంతో కేరింతలు కొట్టారు. ఇంతకీ ఏడుస్తూ వ్యవసాయం చేస్తున్నది మనమా? తెలుగు మాస్టారా?- అన్న సందిగ్ధంలో పడింది ఫస్ట్ బెంచీ మేధావివర్గం. మిగతావాళ్ళంతా అరుస్తూ కేరింతలు కొడుతూ డెస్కులమీదనుంచి దూకుతూ క్లాస్ రూమ్ నుంచి నిష్క్రమించారు.



కాలేజీ అయిపోయాక ఇంటికి బయల్దేరాడు భీమన్న హుషారుగా.

కాలేజీకి వచ్చేటప్పుడు దిగులుగా రావడం; ఇంటికెళ్ళేటప్పుడు హుషారుగా పోవడం అలవాటైపోయింది. కాలేజీ లెక్చరర్ వుద్యోగమంటే ఆషామాషీకాదు. దినదినగండం-నూరేళ్ళ ఆయుష్షే. కత్తిమీద సాములాంటిదే. ఏ రోజున ఏ క్లాసులో ఏ క్షణాన ఏం జరుగుతుందోనన్న భయమే. ఏ చిన్న తప్పటడుగు వేసినా క్లాసులో అందరిముందూ అభాసుకావడం ఖాయం. మరో గంటకల్లా ఆ విషయం ఆ నోటా ఈ నోటా కాలేజీ మొత్తం పాకిపోతుంది. ఇదంతా పరువు ప్రతిష్ఠల సమస్య. దీన్ని అలా వుంచితే ఓమారు స్టూడెంట్స్‌ముందు అభాసుపాలైన లెక్చరర్ మళ్ళీ అదే స్టూడెంట్స్ ముందు మనుగడసాగించడం నరకప్రాయమే. ఇదంతా బాగా తెలుసు కాబట్టే భీమన్న చాలా జాగ్రత్తగా ఆచితూచి అడుగేస్తుంటాడు. అందులోనూ తాను తెలుగు లెక్చరర్ కావడం తన దురదృష్టం. ఏ రోజుకారోజు వెయ్యి దేవుళ్ళకి మనస్సులోనే మొక్కుకుని క్లాసులకి వెళుతుంటాడు. సాయంత్రానికి నవ్వంగా ఇంటిదారి పట్టినప్పుడు అతని మనసు ఆనందడోలికల్లో ఊగిసలాడుతుంటుంది. కాని అది ఎంతోసేపు నిలవదు. రాత్రిపూట పడుకున్న దగ్గర్నుంచీ మళ్ళీ రేపటి దిగులే... హైస్కూల్ స్థాయిలో విద్యార్థిగా తనకీ నెర్వస్‌నెస్ వుండేది. మాస్టారు తననేమన్నా ప్రశ్నవేస్తే... తనెక్కడ సమాధానం చెప్పలేకపోతానో... మాస్టారేమంటారోనని తెగభయపడిపోయేవాడు. తీరా లెక్చరర్ అయ్యాక కూడా అదే నెర్వస్‌నెస్... ఎటొచ్చీ విద్యార్థుల మనస్తత్వంలోనే మార్పు వచ్చిందనుకున్నాడు. లెక్చరర్ ఏమంటాడోనన్న నదురూబెదురూ ఈతరం స్టూడెంట్స్‌లో మచ్చుకైనా కానరావడంలేదు. ఎటొచ్చీ తానే... అటు విద్యార్థిగానూ, ఇటు లెక్చరర్‌గానూ ఇబ్బందుల్ని ఎదుర్కోవాల్సివచ్చింది.

రోడ్డుమీద నడుస్తున్న భీమన్నకి ఉదయం క్లాసులో జరిగిన సంఘటన గుర్తొచ్చింది. కళ్ళద్దాల కుర్రాడు గీసిన బొమ్మ కళ్ళముందు మెదలింది.

"నన్నెంతగా స్టడీచేసి వేశాడో పాపం..." అనుకున్నాడు. అంతలోనే మళ్ళీ తననితాను సంభాళించుకున్నాడు. చదువుకునే కుర్రాళ్ళు నిజం దాచిపెట్టొచ్చా? ఆ మాటకొస్తే చదువు రానివాళ్ళకే ఇది మంచిదిగాదు. ఇలా ఆలోచిస్తూ నడుస్తున్న భీమన్న దృష్టి ఎదురుగా వున్న బస్టాపు మీద పడింది.

అక్కడ ఓ పదిమందిదాకా నిలబడివున్నారు. ఆ పక్కనే వున్న కరెంట్ స్తంభాన్ని ఆనుకుని నిలబడిన ఓ మనిషిని చూడగానే భీమన్న కళ్ళు ఆశ్చర్యంతో మెరిశాయి. 'ఈ వెధవ ఇక్కడున్నాడేమిటి?' అని ఓ క్షణం ఆలోచించాడు.

భీమన్న చూసిన వ్యక్తి మరెవరోకాదు - అతని ఆప్తమిత్రుడే. పేరు జి.జి.రావ్. పూర్తిపేరు ఎవరికీ తెలీదు. అతనెప్పుడూ గొణుగు

తుంటాడు. కంటబడ్డ ఏ వ్యక్తిని వదలకుండా ఏదో ఒక కామెంట్ చేయడం అతని హాబీ. ఈ గొణుగుడు కళలో అతనిది అందెవేసిన చెయ్యి. భీమన్న అతనికి గొణుగుడురావ్ అనే పేరు ఖరారుచేశాడు. ముద్దుగా జి.జి.రావ్ అని పిలుస్తాడు. కాలేజీలో కూడా ఇదే పేరు రకరకాల అర్థాల్లో పాపులర్ అయింది.

భీమన్న అమాంతం జి.జి.రావ్‌ని వాటేసుకున్నాడు.

అసలే కరెంట్ స్తంభం పక్కనే నిలబడి వుండటంతో కరెంట్‌షాక్ తిన్నంతగా జి.జి.రావ్ దిమ్మెరపోయాడు. భీమన్న జి.జి.రావ్ ఊపుకు బొక్కబోర్లాపడబోయాడు గానీ కరెంట్ స్తంభాన్ని పట్టుకుని పడకుండా తప్పించుకోగలిగాడు. బస్‌షెల్టర్‌లో నిలబడ్డ వాళ్ళంతా వీరి వ్యవహారం వినోదం చూసినట్టు చూస్తున్నారు.

అదేమీ పట్టించుకునే స్థితిలో లేడు.

"ఏరా జి.జి. ... ఇక్కడున్నావేంటి?" రెట్టించిన ఉత్సాహంతో భీమన్న అడిగాడు. అప్పటిగ్గాని జి.జి.రావ్ తేరుకోలేదు. ఇంతక్రితం తననెవరూ చావబాదలేదని, తన ఆప్త మిత్రుడు మనసారా తనని వాటేసుకున్నాడనీ గ్రహించిన జి.జి.రావ్ ఇంకొక్క క్షణం వృధా చెయ్యకుండా భీమన్నని అమాంతం వాటేసుకున్నాడు.

జి.జి.రావ్ కళ్ళు చికిలిస్తూ భీమన్నని పరీక్షగా చూడసాగాడు. భీమన్న మూడ్‌లోకి వెళ్ళబోతున్నాడని గ్రహించాడు జి.జి.రావ్. సరిగ్గా అప్పుడే భీమన్న చేతులు మెల్లగా గాల్లోకి లేస్తున్నాయ్. జి.జి.రావ్ ఆ రెండు చేతుల్ని గట్టిగా పట్టుకుని- "అరేయ్... భీమన్న నీకు పుణ్యముంటుంది. నడిరోడ్డుమీద నువు మూడ్‌లోకి వెళ్ళకు. ప్లీజ్... నువ్విప్పుడు ఇక్కడ జుట్టు పీక్కున్నందువల్ల రెండు నష్టాలున్నాయి. ఒకటి: బస్‌షెల్టర్‌లో నిలబడ్డ జనం నిన్ను పిచ్చాడనుకుంటారు. పబ్లిక్‌ఫోన్ నుంచి ఏ పిచ్చాసుపత్రికన్నా ఫోన్ చేస్తారు. పోలీసులకన్నా ఫిర్యాదు చేస్తారు. ఇక రెండోది: చిందరవందరయ్యే నీ జుట్టు చూసి నేను నీ మీద ప్రతీకారం తీర్చుకున్నానని నలుగురూ అనుకునే ప్రమాదం వుంది. కలవక కలవక చాలా కాలానికి కలిసిన మనం అలాంటి విచిత్ర పరిస్థితిలో ఇరుక్కోవడం ఏం సబబు... చెప్పు... అందుకే నీ ప్రయత్నం విరమించు" అని ప్రాధేయపడ్డాడు.

మిత్రుడి కోరికను మన్నించి భీమన్న తన ప్రయత్నం మానుకున్నాడు. "చాలాకాలం తర్వాత నువు కనిపించేసరికి తమాయించుకోలేకపోతున్నాన్రా" అన్నాడు. ఇద్దరూ పిచ్చాపాటీలో పడ్డారు.

"అవున్రా... ఉన్నఫళంగా నువ్విక్కడికి ఎలా ఊడిపడ్డావ్?" భీమన్న తన సందేహం బైటపెట్టాడు.

"ఉన్నఫళంగా ఏముందిరా... మా బ్రాస్లు నన్ను ట్రాన్స్‌ఫర్ చేశారు. వచ్చి వారమైంది"

"ట్రాన్స్‌ఫరెందుకు?"

"నీకు తెలియనిదేముంది... అక్కడ నేను తిట్టడానికి ఎవ్వరూ మిగల్లేదు... ఇక్కడివాళ్ళని పావనంచెయ్యమని పంపించారు"

"అంటే ఏజజీవితం మొదలయ్యాక కూడా నీకా గొణుగుడు రోగం పోలేదా?"

"ఒరేయ్ భీమిగా... మనిద్దరం కర్ణుడిలాంటివాళ్ళంరా! అంత తేలిగ్గా ఎందుకు పోతాయో చెప్పు"

"ఇదేమి పోలికా...?"

"కర్ణుడు సహజ కవచకుండలధారి గదా! పుట్టడమే వాటితో పుట్టాడు. అలాగే నీకు జుట్టు పీక్కునే రోగం, నాకు గొణుగుడు రోగం స్వతహాగా వచ్చినవి. అంత తేలిగ్గా పోతాయా... చస్తే పోవు"

"అవున్రోయ్ నిజమే... అందుకే కాబోలు నేను ఇప్పటికీ జుట్టు పీక్కుంటూనే వున్నాను" భీమన్న ఆలోచనలో పడ్డాడు.

"మరి... ఏమిటనుకున్నావ్...!"

"అయితే ఈ లెక్కన నీకు మళ్ళీ త్వరలోనే ట్రాన్స్‌ఫర్ తప్పదా?" బెంబేలు పడుతూ అడిగాడు భీమన్న.

"ఏమో చూద్దాం... ఇక్కడ మా ఆఫీసువాళ్ళు నాచేత ఎంతకాలం ఓపికగా తిట్టించుకోగలుగుతారన్న దానిమీదనే నా ట్రాన్స్‌ఫర్ ఆధా





రవడి వుంది. ఇదివరకు పనిచేసివచ్చిన చోట యితే చివరికి విసుగెత్తి "నువు ఆఫీసుకి రాకుండానే జీతం తీసుకుపో" అన్నంతదాకా వచ్చారు"

"అదెలా?"

"మొదట్లో చాలా సిన్సియర్‌గా ఆఫీసు టైమ్‌కన్నా ముందే వెళ్ళి సీట్లో కూర్చునేవాణ్ణి. ఎవరివేళ ప్రకారం వాళ్ళు వచ్చి నా తిట్లు తింటుండేవాళ్ళు. అలా కొంతకాలమయ్యాక స్టాఫంతా మేనేజర్‌కి కంప్లెయింట్ ఇచ్చారు. మేనేజర్ పిలిపించాడు నన్ను... అలవాటు మీద ఆయన ముందే ఆయన మీద గొణిగాను... నువ్విహామీదట ఆఫీస్ టైమ్‌కన్నా ముందు రానక్కర్లేదు. టంచనుగా టైమ్‌కొస్తే చాలు" అని ఆయన హుకుం జారీచేశాడు. మర్నాడు నుంచి టైమ్‌కొచ్చి టైమ్ ప్రకారం అందర్నీ చూసి గొణిగేవాణ్ణి. మళ్ళీ కంప్లెయింట్... మళ్ళీ పిలుపు... అప్పట్నుంచి టైమ్‌కి రానక్కర్లేదు. ఓ గంట లేటుగా వస్తూండమని మేనేజర్ సలహా ఇచ్చాడు. గంటలేటుగా వస్తేనేం... నా వాక్స్వాతంత్ర్యాన్ని ఎవరూ అణచివేయలేకపోయారు. దాంతో ఒంటిపూట రమ్మన్నారు. ఆ పాచికా పారలేదు. నెల మొత్తం బయట బలాదూరు తిరిగి నెలచివర్లో వచ్చి జీతం తీసుకెళ్ళమన్నారు. అవకాశం చిక్కిందిగదాని వూరంతా తిరుగుతూ మేనేజర్ని తిట్టినతిట్టు తిట్టకుండా తిట్టేవాణ్ణి. ఆ విషయం మేనేజర్‌కి తెలిసింది. ఊళ్ళో పరువుపోతే బతక లేమనుకున్నాడో ఏమో నన్ను ఇక్కడికి ట్రాన్స్‌ఫర్ చేశాడు" అని గడగడ చెప్పేశాడు జి.జి.రావ్.

"హార్నీ ... ఇంత ఫ్లాష్‌బ్యాక్ వుందన్న మాట" భీమన్న అబ్బురపడుతూ అడిగాడు.

"ఈ ఫ్లాష్‌బ్యాక్‌లో ఏముంది... ఫ్రంట్ కథ కూడా చెబుతా విను"

"వీలైనంత తక్కువ వ్యవధిలో ఇలా వూళ్ళన్నీ ట్రాన్స్‌ఫర్ మీద తిరిగి 'ఛాంపియన్ ఆఫ్ ట్రాన్స్‌ఫర్స్'గా గిన్నిస్‌బుక్‌లోకి ఎక్కాలని నా ఆలోచన"

"అబ్బ... ఎంత మంచి అయిడియా? విష్ యూ బెస్టాఫ్ లక్'

ఇద్దరూ బిగ్గరగా మాట్లాడుకుంటున్నారు. బస్టాపులో చేరిన వాళ్ళంతా వీళ్ళనే చూస్తున్నారు. వాళ్ళకి ఇదో మంచి కాలక్షేపంగా వుంది.

"అది సరేగానీ... నీ వర్ఛనాలిటీ ఇంతగా అస్తవ్యస్తమైపోయిందేమిటి... కొంపదీసి పెళ్ళేమన్నా చేసుకున్నావా?" భృకుటి ముడుస్తూ అడిగాడు జి.జి.రావు.

ఆ మాటలకి భీమన్న భళ్ళున నవ్వాడు.

ఆ నవ్వు సాదాసీదా నవ్వు కాకపోవడంతో గాలితరంగాలతో కలిసి బస్టాపు జేరి అక్కడి జనం చెవుల తుప్పు వదలగొట్టినంతపనే సింది. ఆ నవ్వుకి కంపరమెత్తుతున్నదన్నట్టు అక్కడి వాళ్ళంతా వీళ్ళిద్దరి వైపు... కొంచెం చికాకు... ఇంకొంచెం అసహ్యం... కలగలిపి ఎగాదిగా చూడసాగారు.

"అప్రాచ్యపు వెధవల్లారా... ఏమిటా చూపు..." వాళ్ళకేసిచూస్తూ జి.జి.రావు గొణిగాడు. ఆ వెంటనే భీమన్న వైపు తిరిగి "స్నేహంలోవున్న మాధుర్యమేమిటో ఈ జనానికి తెలిసి చావదుగాని అలా ఏదన్నా హొటల్‌కెళ్ళి కూర్చుని మాట్లాడుకుందాం రారా" అంటూ భీమన్న చెయ్యి పట్టుకుని ముందుకి దారితీశాడు.

దగ్గర్లో ఓ హొటల్ కనిపించింది. ఇద్దరూ అందులో దూరారు.

సాయం సమయం కావడంతో హొటల్ కిటకిటలాడుతోంది. ఎక్కడా ఖాళీ సీటే లేదు. "కొంపల్లో తింటున్నది చాలక హొటళ్ళ మీద పడతారు పాడు జనం" చికాకుగా ముఖం పెట్టి గొణిగాడు జి.జి.రావ్.

"నోర్ముయ్యిరా! ఆ లెక్కకొస్తే... మనం మాత్రం...?"

"మనకి, మిగతా వాళ్ళకి పోలికా? మనమంటే... చాలా కాలం తర్వాత కలుసుకున్న ప్రియాతి ప్రియమైన మిత్రులం. మనం ఇక్కడికి తిండికోసం రాలేదు. రోడ్డుమీద నిలబడి ఎంతసేపు మాట్లాడుకుంటాం... చెప్పు? రోడ్డున వచ్చేపోయేవాళ్ళ దిష్టి తగలడం కాకపోతే! పైగా కాళ్ళు లాగుతాయి కదా! ఇక్కడైతే హొటల్‌వారి తృప్తికోసం... గంటకోసారి సింగిల్ కాఫీని ఇద్దరం పంచుకుంటూ గంటల తరబడి బాతాఖానీ కొట్టుకోవచ్చు.



అదిరా అసలు అయిడియా" అంటూ భీమన్న కళ్ళల్లోకి గర్వంగా చూశాడు జి.జి.రావ్.

సీట్లకోసం ఇద్దరూ హాలంతా కలియదిరుగుతున్నారు.

"చూశావురా భీమిగా... ఆ లంబుజెంబుని చూడు. అవసోపాలు పడుతూ ఎట్లా నోట్లో కుక్కుకుంటున్నారో... అందుక్కదూ వాళ్ళుఒళ్ళు వాళ్ళ మాటినకుండా అలా పెర్రేగిపోతున్నది?" దూరంగా ఓ లావుపాటి జంటని కళ్ళతోనే చూపిస్తూ జి.జి.రావ్ గొణిగాడు.

"ఇలా కనిపించిన ప్రతివాళ్ళనీ విమర్శించడం అనే నీ పాలసీ ఏం బాగులేదురా"

"ఇది విమర్శకాదు నగ్నసత్యం. మనదేశంలో ఆకలి మహమ్మారి విలయతాండవం చేస్తున్నదనడానికి ఈ హొటళ్లే సాక్ష్యం. ఆకలి-దరిద్రానికి హేతువంటారు. ఆ లెక్కన హొటళ్లలో ఈ రద్దీ మనదేశ దరిద్రానికి సంకేతమే... చూడు".

ఓ క్షణమాగి భీమన్న అడిగాడు- "అయితే నువ్వింకా కథలు రాస్తూనేవున్నావన్నమాట?"

"అదేం...కథలకీ, దీనికీ లంకె ఏమిటి?"

"మరేంలేదు. నీ కథలన్నీ ఇలాంటి ఆలోచనలకే పెట్టింది పేరుగదా! నీమాటల్నిబట్టి...నీ రచనా వ్యాసంగం నిరాఘాటంగా కొనసాగుతూందనిపించిందిలే"

"పోరాభడవా..." అంటూ భీమన్న నెత్తిన చిన్నగా మొట్టికాయ వేశాడు జి.జి.రావ్. మరుక్షణమే ఇద్దరూ హాయిగా నవ్వుకున్నారు.

అయిదు నిమిషాలుగా ఆ హాలులో వీళ్లిద్దరూ కాలుగాలిన పిల్లులు మాదిరిగా అటూఇటూ తిరగడం హొటల్ సూపర్‌వైజర్ కంటబడింది.

మరుక్షణంలోనే వాళ్ల దగ్గరికొచ్చాడతను. ఆరడుగుల విగ్రహం. భారీకాయం, పైజామా, లాల్చీ వేశాడు. బుర్రమీసాలు ఒళ్ళు గగుర్పొడిచేలావున్నాయి. దానికితోడు ముఖంలో సీరియస్‌నెస్.

"ఏంకావాలి సర్" గొంతు గంభీరంగానేవున్నా వృత్తిపరమైన ధర్మంతో గొంతులో వినయం, గౌరవం స్పష్టంగా వినిపించాయి.

"బీర్ కావాలి" జి.జి.రావ్ తలపక్కకితిప్పి గొణిగాడు.

భీమన్నకి ఆ మాటలు వినిపించాయి...నవ్వూ వచ్చింది. కోపం వచ్చింది. రెంటినీ నిగ్రహించుకున్నాడు.

"హొటల్‌కొస్తే ఏంకావాలంటాడేమిటి?" జి.జి.రావ్ మళ్ళీ గొణిగాడు. భీమన్నకి ఇది కూడా వినిపించింది. సూపర్‌వైజర్‌కి మాత్రం వినిపించడంలేదు. అయితే జి.జి.రావ్ ఏదో అంటున్నాడని మాత్రం అతనికి అర్థమైంది. అందుకే అడిగాడతను: "ఏంటిసర్ అంటున్నారు?" ఈసారి అతని గొంతులో కొంచెం కరకుదనం చోటుచేసుకుంది.

తనుతిట్టింది అతగాడికి వినిపించిందేమోనని జి.జి.రావ్‌కు డౌటేసింది. ఆ అనుమానం వస్తే చాలు కాళ్ల బేరానికి రావడం జి.జి.రావ్ టెక్నిక్. అందుకే వెంటనే మాటమార్చాడు.

"అబ్బే ఏంలేదు సర్...మేం ఎన్నిరకాల టిఫిన్లు చెయ్యడానికి వచ్చామో గుర్తుచేసుకుంటూ వరసబెట్టి లెక్కపెడుతున్నాను"

సూపర్‌వైజర్ అదోలాచూశాడు అతనివంక. ఆ పక్కనే ఉన్న భీమన్నని ముఖం చిట్లించి మరీచూశాడు. భీమన్న మాత్రం తనకేమీ తెలీదన్నట్టు అమాయకంగా ముఖంపెట్టి అలాగే నిల్చున్నాడు.

వీళ్లేదో 'న్యూసెన్సు' కేసులనిపించింది సూపర్‌వైజర్‌కి!

జి.జి.రావ్ కూడా సూపర్‌వైజర్ని అలాగే అనుకుంటున్నాడు.

వీళ్లతో తనకెందుకులే అనుకున్నాడో ఏమో సూపర్‌వైజర్ వెనక్కి తిరిగి వెళ్లబోతుంటే...

"వెళుతోంది పందికొక్కు" అంటూ గొణిగాడు జి.జి.రావ్.

సూపర్‌వైజర్ వెళ్ళేవాడల్లా ఆగి వెనక్కి తిరిగి చూశాడు.

జి.జి.రావ్ ఖంగుతిన్నాడు.

"మీ హొటల్‌లో పందికొక్కులున్నాయి సార్... అదుగో ఇప్పుడే ఒక పందికొక్కు అటువెళ్లింది" ఈ విషయం పెద్దగానే చెప్పాడు. పెద్దగా చెబితే అబద్ధమైనా నిజమవుతుందని అతని అభిప్రాయం- పైగా ఇప్పుడు అతన్ని





నమ్మించాలాయె.

"మా హొటల్‌లో పందికొక్కులుగాని ఎలుకలుగాని వుండవు సర్. కావాల్తంటే బెట్ పెడతాను" అన్నాడు సూపర్‌వైజర్ ఉక్రోషంగా. "కాకపోతే కొన్ని పందికొక్కులు అప్పుడప్పుడు బైటనుంచి వచ్చి మా హొటల్‌లో మెక్కి వెళుతుంటాయ్" అంటూ వెళ్లబోయాడతను.

"వార్నీ...కొట్టాడుగదరా దెబ్బ" గొణిగాడు జి.జి.రావ్.

"మామూలుగా కొట్టడమా ఇది. సెంటర్ చూసి మరీ కొట్టాడు" భీమన్న కూడా గొణిగాడు.

సూపర్‌వైజర్ తామిద్దర్నీ దృష్టిలోపెట్టుకునే ఆ మాట అన్నాడన్న విషయం అర్థమైపోయింది.

"మాకో రెండు సీట్లు చూపించండి సార్" అంటూ దీర్ఘం తీశాడు జి.జి.రావ్ పెద్దగానే.

వెళ్లేవాడల్లా సూపర్‌వైజర్ మళ్లీ ఆగాడు. ఒక్క క్షణం జి.జి.రావ్ కళ్లల్లోకి తీక్షణంగా చూసి, ఎదురుగా ఖాళీఅయిన టేబిల్‌వంక చెయ్యిచూపుతూ "అవి సీట్లే గదసార్" అని అంతే దీర్ఘంతో బదులిచ్చాడు.

జి.జి.రావ్ గతుక్కుమన్నాడు. తమ ఖర్మగాలి ఆ సీట్లు ఇప్పుడే ఖాళీగావాలా...అనవసరంగా ఈ సూపర్‌వైజర్‌గాడిముందు దెబ్బతిన్నామే అనుకున్నాడు లోలోన.

చేసేదిలేక సూపర్‌వైజర్‌కి 'థాంక్స్'చెప్పి, భీమన్నతోసహా ఆ టేబిల్‌ని ఆక్రమించాడు.

ఆ వెంటనే తామిద్దరూ చాలారోజుల తర్వాత కలిసిన అత్యంత ఆప్తమిత్రులన్న విషయం ఆ చుట్టుపక్కలవాళ్లందరికీ తెలిసిపోయేంతగా కబుర్లలోపడ్డారు.

జి.జి.రావ్ జోరుగా చేతులు తిప్పుతూ మాట్లాడేస్తుంటే గడ్డం కింద రెండుచేతులూ పోటీపెట్టి వింటూ కూర్చుండిపోవడం భీమన్న వంతయింది.

మాటలమధ్యలో టేబిల్‌మీదున్న నాలుగు మంచినీళ్ల గ్లాసులు ఖాళీచేశారు.

ఇంతలో సర్వర్‌వచ్చి వాళ్లపక్కన నిలబడ్డాడు.

అటూఇటూ చేతులుతిప్పుతూ అనర్గళంగా మాట్లాడేస్తున్న జి.జి.రావ్, ఇప్పుడేమీ వద్దు వెళ్లిపో అని సైగలద్వారానే చెప్పాడనుకుని సర్వర్ వెళ్లిపోయాడు. కొద్దిసేపటికి వాటర్‌బాయ్ వచ్చి ఖాళీగ్లాసులు తీసేసి మరో నాలుగు నిండు గ్లాసులు పెట్టి వెళ్లబోతుంటే జి.జి.రావ్ ఆ కుర్రాణ్ణి పిలిచి, రెండు గ్లాసులు గుటగుట తాగేసి వాటిని అతని చేతిలోపెట్టాడు.

కాలేజీ మిత్రుల గురించి ఇద్దరూ పేరుపేరునా చర్చించుకున్నారు. జి.జి.రావైతే పంకజ, శ్రీవల్లి, వాగ్దేవి...అంటూ అమ్మాయిల పేర్లన్నీ అక్షరం పొల్లుపోకుండా వల్లించాడు. వాస్తవానికి వాళ్లెవరూ భీమన్నకి గుర్తులేరు. జి.జి.రావ్ ఆ పేర్లన్నీ ప్రస్తావించేసరికి భీమన్నకి ఒక్కసారిగా పద్మజ గుర్తొచ్చింది.

"అన్నట్టు నీ డ్రీమ్‌గరల్ ఏంచేస్తున్నదో చెప్పావుగాదు?" అనడిగాడు భీమన్న జి.జి.రావ్ కొంచెం ఇబ్బందిపడ్డాడు.

"పోనీరా... అవన్నీ కుర్రతనంలో తెలిసీ తెలీకచేసే కుర్రచేష్టలు" అంటూ దాటెయ్యడానికి ప్రయత్నించాడు.

"ఓరి భడవా...ఇప్పుడు ముసలివెధవ్వి అయిపోయినట్టు ఏమిట్రా ఆ మెట్టవేదాంతం?"

జి.జి.రావ్ చదువుకునే రోజుల్లో పద్మజ మీద మక్కువచూపేవాడు. ఆ పిల్లే తన సర్వస్వం అనీ, జీవితంలో ఆమెని తప్ప మరింకెవర్నీ పెళ్లి చేసుకోననీ భీమన్న దగ్గర భీష్మప్రతిజ్ఞలు చేస్తుండేవాడు. కాని ఇప్పుడా ఊసెత్తడానికే ఇష్టపడటంలేదు. ఆ పిల్ల ఇతన్నికాదని వేరే వ్యక్తిని చేసుకుని హాయిగా ఫారెన్ చెక్కేసింది. ఆ కోపం కొద్దీ తానూ ఓ ఫారిన్ పిల్లని పెళ్లిచేసుకుని పద్మజ తిక్కకుదర్చాలని జి.జి.రావ్ అప్పుడప్పుడు అనుకుంటుండేవాడు కాని కుదర్లేదు.

భీమన్నకి ఇప్పటికి పాయింట్ దొరికింది. అరగంట నుంచి వాడిన పదాలు వాడకుండా తన నెత్తిబొప్పికట్టించిన జిజిరావ్‌కి క్లాస్ తీసుకోవాలనుకున్నాడు.

ప్రేమంటే ఏమిటి? పెళ్ళికి వున్న పవిత్రత

ఏమిటి? - ఇత్యాది విషయాలమీద పురాణ కావ్యాల ఫ్లాష్‌బ్యాక్‌తో లెక్చరర్ స్టయిల్‌లో ఉపన్యాసం మొదలు పెట్టాడు.

గడ్డం కింద చేతులానించి వింటూ కూర్చోవడం ఈసారి జి.జి.రావ్ వంతయింది.

మిగతా రెండు మంచినీళ్ళ గ్లాసులు ఖాళీ అయ్యాయి. పది నిముషాల్లో సర్వర్ వచ్చి మళ్ళీ వీళ్ళపక్కన నిలబడ్డాడు. వీళ్ళు త్వరగా సీట్లు ఖాళీచేసి వెళ్ళిపోతే టిప్పులు దొరికే పార్టీ వస్తుందన్న ఆశ అతనిది.

భీమన్న అనర్గళంగా మాట్లాడేస్తున్నాడు.

జి.జి.రావ్ కన్నార్పకుండా అతనివైపే చూస్తూ శ్రద్ధగా వింటున్నాడు.

భీమన్న చేతులు గాలిలో జోరుగా అటు ఇటు కదులుతున్నాయ్.

సర్వర్ మళ్ళీ ఆ మూవ్‌మెంట్స్‌ని తనకి అన్వయించుకున్నాడు.

మరుక్షణమే అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

భీమన్నకు అలుపొచ్చింది. అప్పటిగ్గాని నిదానించలేదతను. గొంతు నొప్పి కూడా మొదలైంది. "ఈ పోసుకోలు కబుర్లకేం గాని తెలుగు లెక్చరర్ వుద్యోగం ఎలావుంది... నీ అనుభవాలేమిటి... కొంచం చెప్పరా దిగ్రేట్ తెలుగు లెక్చరర్"

తనకి అనుభవాలేముంటాయ్ అన్నట్టు భీమన్న నిర్వికారంగా పెదవి విరిచాడు.

"అదేంట్రా... ఎంచక్కా అమ్మాయిలు, అబ్బాయిల మధ్య కాలక్షేపం చెయ్యొచ్చుగా!"

"లెక్చరర్ వుద్యోగం కాలక్షేపానికి కాదుగదరా"

"కబుర్లు చెప్పకురా. ఎంతకాదనుకున్నా మనిషి సహజంగా కళాపోషకుడు. అందులోనూ మగవాడి విషయం సరేసరి. పైగా అమ్మాయిల ముందు నిలబడి లెక్చరిచ్చే వుద్యోగ



మంటే వామ్మో వామ్మో... ఇక చెప్పేదేముంది. ఎంచక్కా నీకు నచ్చిన అమ్మాయివైపే చూస్తూ పాఠం చెప్పొచ్చు. నీ కళ్ళని కట్టిపడేసే అమ్మాయినే ప్రశ్నలు వేసి మాట్లాడించొచ్చు. సెలవురోజుల్లో ఆ అమ్మాయిని చూడలేకుండా వుండలేననుకుంటే ప్రయివేట్ క్లాసులు ఉండనేవున్నాయ్. అప్పటికీ మనసు ఊరుకోకపోతే నీకు పాఠం అర్థం కావడం లేదు. మా ఇంటికి రా - చెబుతానని జెంటిల్‌గా ఇన్వయిట్ చెయ్యొచ్చు. ఎన్ని అవకాశాలనుకుంటున్నావ్?"

భీమన్నకి ఈ సంభాషణ బొత్తిగా నచ్చలేదు. నిరాసక్తంగా మిన్నకుండిపోయాడు.

"ఏమిట్రా ఆలోచిస్తున్నావ్?" జిజిరావ్ అడిగాడు.

"ఏం లేదులే... ఇలాంటప్పుడే దేవుడున్నాడేమో అనిపిస్తుంటుంది"

"అదేం?"

"మరేంలేదు... ఆ భగవంతుడు నిన్ను కాలేజీ లెక్చరర్ని చెయ్యకుండా ఎన్ని వందల అమ్మాయిల నెత్తిన పాలుపోశాడో తెల్సా?"

జిజిరావ్ బిగ్గరగా నవ్వాడు.

ఎంతో ఉన్నతమైనదిగానూ, పవిత్రమైనదిగానూ భావించే తన ఉద్యోగానికి తోటి మిత్రుడే పెడార్థాలు తీస్తుంటే భీమన్న మనస్సు లోలోన ఘోషించింది. అందుకే ఆ చురక అంటించాడు.

"ఇంతకీ నీసంగతి చెప్పరా... పెళ్ళి చేసుకున్నావా?" అంటూ భీమన్న టాపిక్ మార్చాడు.

జిజిరావ్ ఆ ప్రశ్నకి భళ్ళున నవ్వుతూ "నీకెలా కనిపిస్తున్నాను? నాకు పెళ్ళికావడం, నేను తండ్రిని కావడం ఏకకాలంలో జరిగిపోయాయి" అన్నాడు.

భీమన్నకి ఆ జోక్ అర్థం కాలేదు.

బిగ్గరగా నవ్వుతున్నవాడల్లా ఒక్కసారిగా ఆపేసిన జిజిరావ్ ముఖంలోకి పరీక్షగా చూశాడు. జిజిరావ్ దృష్టి ఎవరిమీదనో వుంది. భీమన్నకూడా అటువైపే చూపు మరల్చాడు. ఎదురుగా హెూటల్ సూపర్‌వైజర్ నిలబడివున్నాడు.

"వీడి మొహంమండ... అల్లా సైతాన్‌లా నిలబడి ఎలా చూస్తున్నాడో!" జిజిరావ్ ఎటో చూస్తూ గొణిగాడు. అవెంటనే సూపర్‌వైజర్ వైపు చూస్తూ "సర్... వాట్‌సర్... ఇవతల మా కడుపులో ఎలుకలు ఇందాకట్నుంచి సంగీతం ఆలపిస్తుంటే కనీసం ఒక్క సర్వరన్నా మా ముఖం చూసిన పాపానపోలేదు" అన్నాడు.

అప్పుడే అక్కడకొచ్చిన సర్వర్ గయ్యిన తగులుకున్నాడు.

"ఏం మాట్లాడుతున్నార్ సర్ మీరు? మా కడుపులు కొట్టడానికి వచ్చారా మీరు? డబ్బులు ఖర్చుపెట్టి కడుపుకి తినడం చేతకాకపోతే వెళ్ళిపోవాలిగాని మా నోళ్ళు కొట్టాలనుకోవడం దారుణం సర్. మీ టేబిల్ దగ్గరికి నేను రెండుసార్లు వచ్చాను. వెళ్ళిపొమ్మని మీరిద్దరూ చెరొకసారి చేతులతో సైగలు చేసి పంపించేశారుగదా. నాలుగురెళ్ళు ఎనిమిది గ్లాసుల మంచినీళ్ళు మాత్రం లాగించారు. ఇది మంచినీళ్ళ కేసేమోననుకొని వదిలేశాను".

"అమ్మ వెధవాయ్...సర్వర్‌వైతే మాత్రం ఏరా? నిజాన్ని ఎంత నిక్కచ్చిగా పచ్చిగా చెప్పావురా" జిజిరావ్ గొణిగాడు. పైకి మాత్రం దర్పంగా "ఏయ్... ఏమిటా మాటలు... మంచినీళ్ళ కేసేమిటి?" అంటూ గుడ్లురిమాడు.

"ఆఁ... మంచినీళ్ళు కేసుగాక మురికినీళ్ళ కేసనుకోమంటారా చెప్పండి. నాకేమీ అభ్యంతరం లేదు." అన్నాడు సర్వర్.

"అమ్మ సర్వరయ్యా...ముందరి కాళ్ళకు బంధం వేయటంలో దిట్టలాగున్నావ్... నువ్వు దేశ రాజకీయరంగంలో ఉండాల్సినవాడివి" జిజిరావ్ మళ్ళీ గొణుక్కున్నాడు.

అవతల సూపర్‌వైజర్ వీళ్ళిద్దరివంకా నిప్పులు చెరుగుతున్నంత తీక్షణంగా చూస్తున్నాడు. జిజిరావ్ కొంచెం కలవర పడ్డాడు. సూపర్‌వైజర్ ఆగ్రహానికి కొంత మూల్యం చెల్లించకపోతే పరువుపోతుందనిపించింది. అందుకే ఒక్క క్షణమైనా ఆలస్యం చేయకుండా సర్వర్ వైపు తిరిగి "టిఫిన్ వేడిగా ఏముంది బాబూ" అంటూ సౌమ్యంగా అడిగాడు.

"ఇడ్లీ,వడ,ఉప్మా,దోసె,ఉతప్పం...ఎమ్మెల్యే దోసె..." అంటూ లిస్టుని ఏకబిగిన చదివేశాడు




నర్వర్. ఆవెంటనే సూపర్‌వైజర్ కళ్ళల్లోకి నగర్వంగా చూశాడు. జిజిరావ్ చిటికె వేసి నర్వర్‌ని తనవైపు తిప్పుకున్నాడు.

"ఎమ్మెల్యే దోసె వుందా?"

"ఉందనిచెప్పాగా సార్"

"మరి ఎమ్మెల్సీ దోసె?" అమాయకంగా ముఖం పెట్టి అడిగాడు జిజిరావ్.

చాచిచెంపదెబ్బ కొడదామన్నంత కోపమొచ్చింది నర్వర్‌కి.

నిజంగా న్యూలూజ్ కేసేమోనని ఈసారి నర్వర్‌కీ అనుమానం వచ్చింది.

"ఇందాక నువు చెప్పినవన్నీ వేడిగానే వుంటయ్యా?" జి జి రావ్ మళ్ళీ అడిగాడు.

"ఔనునర్... తాజాగా ఫ్రిజ్‌లోనుంచి తీసిస్తాం" అన్నాడు సూపర్‌వైజర్ చాలా శాంతంగా. జి జి రావ్‌కి కొరపోయినంతపనైంది. ఫ్రిజ్‌లో నుంచి వేడివస్తువులు తీసిస్తానంటాడేమిటి, అని ఆలోచన్లోపడ్డాడు. ఆ వెంటనే అర్థమైంది:

"హారి వెధవ... ఎంత సునిశితంగా నాచెవులకి చేటలుకట్టావురా? ఏమాత్రం కష్టపడకుండా ఒక్కముక్కలో నన్నొక వెధవకింద తేల్చిపారేశావే... ఇక నీతోపెట్టుకోవడం అనవసరం" అంటూ జిజి రావ్ గొణుక్కున్నాడు.

సూపర్‌వైజర్‌కి మాత్రం ఓపిక నశిస్తోంది. ఇవ్వాళ ఎలాగైనాసరే వీళ్ళ వ్యవహారం తేల్చేయ్యాలనుకున్నాడో ఏమో వక్కనేవున్న కుర్చీ ఒకటి లాక్కుని వీళ్ళకి దగ్గరగా బైఠాయించాడు.

"అమ్మ వెధవన్నరవెధవా... నీకింతటితెలివా" జి.జి.రావ్ మళ్ళీ గొణుక్కున్నాడు. నర్వర్‌వైపు చూస్తూ "రెండు ప్లేట్లు ఇడ్లీ" అంటూ ఆర్డర్ జారీచేశాడు.

రెండునిముషాల్లో రెండుప్లేట్లతో ఇడ్లీ తెచ్చి టేబుల్‌మీద వుంచాడు నర్వర్.

అయిదు నిముషాల్లో దాన్ని ఖాళీచేశారు. నర్వర్ మళ్ళీవచ్చాడు. రెండు దోసెలు చెప్పాడు జి జి రావ్. ఇక నావల్ల కాదన్నాడు భీమన్న.

"మనం వరసపెట్టి నాలుగు టిఫిన్లన్నా లాగించకపోతే ఆ కుక్కమూతి మొహంవాడు వూరుకోడు తెల్సా?" భీమన్నకి దగ్గరగా వంగి గొణిగినట్లు చెప్పాడు జి.జి.రావ్

దోసెలు వచ్చాయి. ఆదరాబాదరా తినసాగాడు జి.జి.రావ్.

ఎన్నడూ టిఫిన్లముఖం ఎరగనివాణ్ణి చూసినట్టు చూస్తున్నాడు సూపర్‌వైజర్.

భీమన్నకి ఈ పరిస్థితి ఇబ్బందిగావుంది. ఈసారి నర్వర్‌రాగానే తనే చొరవతీసుకుని రెండు కాఫీకి ఆర్డరిచ్చాడు.

కాఫీ తాగేసి బిల్లు చెల్లించి బైటకొస్తుంటే సూపర్‌వైజర్ వీళ్ళవైపు గర్వంగా చూశాడు.

రోడ్డుమీదకొచ్చాక భీమన్న ఓసారి గడియారంవంక చూశాడు– "అమ్మో... అప్పుడే అరయింది. అవతల బామ్మ నాకోసం అదుర్దాపడుతుంటుంది. చుట్టువక్కల పిల్లల్ని నాకోసం ఈపాటికే వూరిమీదికి తరిమివుంటుంది" అన్నాడు అదుర్దాగా.!

"మీ బామ్మని చూసి చాలారోజులైందిరా... రేపెప్పుడన్నా తప్పకుండా మీ ఇంటికొస్తాను" అని భీమన్నదగ్గర ఇంటిఅడ్రస్ అడిగి తీసుకున్నాడు జిజిరావ్.

తన అడ్రస్‌కూడా రాసిచ్చి వీలైతే ఓసారి రమ్మనమని భీమన్నని ఆహ్వానించాడు. సరేనని చెప్పి జిజిరావ్ దగ్గర సెలవుతీసుకుని ఇంటిదారిపట్టాడు భీమన్న ఆదరాబాదరా. ఇంటిదగ్గర బామ్మ ఏంగొడవచేస్తున్నదోనన్న బెంగతో ఆఘమేఘాలమీద ఇంటికి చేరాడు.



"అ అంకుల్ వచ్చేశాడోచ్" అంటూ ఓ ముగ్గురు పిల్లనన్నాసులు రోడ్డుమీదనుంచి ఎగురుకుంటూ ఇంట్లోకి వెళ్ళడం భీమన్న కంటబడింది.

బామ్మ అప్పుడే సిఐడిలని తరిమిందన్న మాట రోడ్డుమీదికి. బామ్మకి రోజురోజుకీ ఛాదస్తం ఎక్కువవుతోంది. వయస్సు పెరిగేకొద్దీ బుద్ధి వికసిస్తుందంటారే! బామ్మ ఇలా తయారవుతోందేమిటి? ముసలివాళ్ళు పిల్లలతో సమానులని తానెక్కడో చదివినట్టు గుర్తు. ఆలెక్కన బామ్మ ఇప్పుడు పసికందుకింద లెక్క. ముందుముందు పొత్తిళ్లలో పాప అవుతుందన్నమాట! ఇలా ఆలోచిస్తూ గుమ్మందాటి హాల్లో అడుగుపెట్టాడు.

పిల్లసన్నానులు అతన్ని చుట్టుముట్టారు.

"వెళ్ళండ్రా...అవతలికి వెధవల్లారా..." అంటూ విసుక్కున్నాడు. ఇంతలోనే అతనికి పసిపిల్లలు దైవసమానులన్న విషయం గుర్తుకొచ్చింది. దైవంమీద కసురుకున్నందుకు లెంపలు వేసుకుని, వాళ్ళని దగ్గరికి పిలిచి 'వెళ్ళండి స్వాములూ' అన్నాడు ప్రాధేయపడుతున్నట్టుగా కానీ, ఓసారి వెధవలని తిట్టినందుకు పిల్లలు అప్పటికే అలిగారు.

"వెధవలం మేమెందుకు అవుతాం. నువ్వే పెద్దఅంట్లవెధవ్వి - అలాగని బామ్మ ఇప్పటిదాకా మాకు చెప్పిందిలే. ముమ్మాటికీ నువ్వే...నువ్వే...నువ్వే...అంట్లవెధవ్వి" కసిదీరా అని అక్కడినుంచి దౌడుతీశారు పిల్లకాయలు.

వేలెడులేరు వెధవాయిలు. వీళ్ళకి నేను లోకువైపోయాను. రేపు వీళ్ళే కాలేజీకొస్తే నన్నొక చవటకింద జమకడతారు. నేటి పసికూనలే రేపటి విద్యార్థులుగదా! వీళ్ళని ఇప్పటినుంచే కట్టడిచెయ్యాలి. మొక్కై వంగనిది మానయ్యాక వంగదన్న సామెత వుండనే వుంది. లేకపోతే వీళ్ళు నాక్లాసుకొచ్చే సరికి ఏకుమేకై కూర్చుంటారు - అనుకుంటూ లోపలిగదిలోకి అడుగుపెట్టాడు.

అక్కడ దేవుడి పటాలముందు బామ్మగారు పట్టుబట్టల్తో సాష్టాంగపడి దేవుణ్ణి ప్రార్థిస్తోంది.

"స్వామీ...ఆపద్బాంధవా... నా మనవడు క్షేమంగా ఇల్లుచేరేట్టు చూడుస్వామీ... వాడసలే అర్భకుడు...అమాయకుడు... అప్రయోజకుడు... ఉత్త వాజమ్మ - వాడింతవరకు ఇంటికి రాలేదు. కారణం ఏమైవుంటుంది స్వామీ?" అంటూ దీనంగా వేడుకుంటోంది దేవుణ్ణి.

"నేనొచ్చేశాను బామ్మా" అన్నాడు భీమన్న.

బామ్మగారు ఒక్కసారి తలతిప్పి చూసింది. అమాంతంలేచి నిలబడింది. చటుక్కున ఏంగుర్తుకొచ్చిందో మళ్ళీ సాష్టాంగపడింది.

"ఇంక చాల్లే లే బామ్మా" అన్నాడు.

"ఇప్పటిదాకా నీరాకకోసం దేవుణ్ణి ప్రాధేయపడ్డాను. నువ్వురాగానే దేవుణ్ణి మర్చిపోవడమే...నువ్వు వచ్చినవిషయం చెప్పి కృతజ్ఞతలు తెలపొద్దూ..."

"ఓహో....థాంక్స్ చెబుతున్నావా...చెప్పు...మంచి ఫార్మాలిటీయేగదా" అన్నాడు. అయిదునిముషాల తర్వాత ఇద్దరూ ఇవతలగదిలోకొచ్చారు.

"ఎక్కడికి వెళ్ళావురా ఇప్పటిదాకా? ఇవతల నీకోసం ఓ ముసల్ది కళ్ళల్లో వత్తులేసుకుని ఎదురుచూస్తూ కూర్చుంటుందన్న ఇంగితజ్ఞానం కూడా లేదురా నీకు" కాసేపు మనవడి మీద రుసరుసలాడింది.

బామ్మ దేనికి లంకె పెట్టబోతోందో అర్థమైపోయింది భీమన్నకి. ఆ ప్రస్తావనని రానివ్వకూడదనుకుని మధ్యలోనే ఆమె మాటలకి అడ్డుతగిలాడు.

"నేనేం చిన్నపిల్లాణ్ణేటే... తప్పిపోవడానికి? నాకు సవాలక్ష పనులుండొచ్చు. నిత్యం ఠంచనుగా గంట కొట్టినట్టు వేళకి ఇంటికి రావాలనడం ఏమిటే బామ్మా..."

"ఒరేయ్... భీమన్నా... నిన్నే నమ్ముకుని బతుకున్నదాన్నిరా... ఈ ముసలి ప్రాణం ఆరాటం నీకు తెలీదు. రోడ్లన్నీ నాకు మృత్యుగుహలుగానే అనిపిస్తాయిరా... మీతాతయ్య, మీనాన్న కూడా రోడ్డు ప్రమాదాల్లోనే చనిపోయిననంగతి నీకు తెలీనిదేమీ కాదు. అందుకే నిన్ను బజారుకి పంపాలంటే నాకు ససేమిరా మనసొప్పదు. కాని తప్పదయే. నిన్ను ఒకింటివాణ్ణిచేసి గుటుక్కుమనాలని నా కోరికరా. నాకోరిక తీర్చి నీచేతులమీదుగా నన్ను కడతేరుస్తావని గంపెడాశతో వున్నాను. కాని నీ వరసచూస్తుంటే నా ఆశ తీరేట్టులేదు." మనవణ్ణి బుజ్జగింపుతో మొదలుపెట్టి చివరికి బరువైన డైలాగులతో ముగించింది.

ఏ సబ్జక్టునైతే చర్చకిరాకుండా తప్పించా





లని భీమన్న అనుకున్నాడో ఆ టాపిక్ బామ్మ నోటిమీదగా రానేవచ్చింది. మొత్తానికి బామ్మ బహునేర్పరి ఏ టాపిక్ లేవదీసినా చివరికది తన పెళ్ళి ప్రస్తావనతోగాని ముగించదామె! ఈ మధ్యకాలంలో ఇది మరీ ఎక్కువైంది. ఇలా ఆలోచిస్తున్న భీమన్నకి బామ్మ ఇప్పుడు చిన్న పిల్లలతో సమానమన్న విషయం చప్పున గుర్తొచ్చింది. వెంటనే ఆమె దగ్గరగా వెళ్ళి కూచున్నాడు.

"బామ్మా... మా మంచి బామ్మవికదూ... వెనకెప్పుడో రోడ్డుప్రమాదాల్లో అయినవాళ్ళు అసువులు బాశారని అందరికీ అలాగే జరుగుతుందని అనుకోవడంతప్పమ్మా... దీన్నే మూఢ నమ్మకం అంటారు తెల్సా?" అన్నాడు బామ్మ కాళ్ళు నొక్కుతూ.

"నువ్వేమీ నాకు నీతిబోధలుచెయ్యక్కర్లేదు లేరా" అంటూ మనవడి చేతిని విదిలించబోయిందామె.

"మామంచి బామ్మవికదూ... నీకేమీ తెలీదు. నేచెప్పిన మాట వినాలి తెల్సా?" అని బుజ్జగిస్తుండగా పక్కింట్లోనుంచి పన్నెండేళ్ళ పాప వచ్చి వాళ్ళముందు నిలబడింది.

"బామ్మగారూ అంకుల్‌వచ్చేశారుగా... నేను కాలేజీదాక వెళ్ళొచ్చాను. అక్కడ పిట్టపురుగు లేరు" అని చెప్పిందా పాప రొప్పుతూ. చెప్పీచెప్పగానే తుర్రుమంది.

భీమన్నకి విషయం అర్థమైంది.

"ఏమిటే బామ్మా ఈ పని...?" అన్నాడు అయోమయంగా మరేంఅనాలో తెలీక.

"మరేంచెయ్యనురా! నువ్వెంత లెక్చరర్‌అయినా నా మనవడివేగదా... చిన్నప్పుడు నిక్కరుకూడా లేకుండా చీమిడి ముక్కుతో నోట్లో వేలేసుకుని, మరో చేత్తో నా వేలుపట్టుకుని నడిచే బాల భీముడిలాగానే నాకిప్పుడూ కనిపిస్తుంటావురా..."

"బామ్మా... ఇది మరీ డ్యామేజింగ్‌గా వుందే. నన్నిప్పుడు ఈ వయస్సులో కూడా ఆ చిన్నప్పటిలాగా ఊహించుకుని ఇబ్బందిపెట్టకే. ఇంకా ఎంతమందిని తరిమావ్ నాకోసం?" భీమన్నకి ఏడుపొక్కటే తక్కువగా వుంది.

"ఈ ఒక్క పాపనే పంపాన్లేరా"

"మరిందాక ఆ పిల్ల సన్నానులో...?"

"ఇంటిముందూ వీధిచివర్నా నిలబడి నువ్వు కనిపించగానే కబురందించడానికి పెట్టానన్నమాట"

"బామ్మా... పాతికేళ్ళు నిండిన నీ మనవణ్ణి వెతకడానికి పన్నెండేళ్ళపాపని రోడ్డుమీదికి పంపడం... ఇంతపెద్ద దానివి నీకేమన్నా భావ్యమా చెప్పు? వాళ్ళ పెద్దవాళ్ళకి తెలిస్తే ఏమనుకుంటారు? నీ మనవడి ప్రాణం తీపి— పరాయిపిల్ల ప్రాణం చేదా?"

"అదికాదురా భడవా. నువ్వేమో వర్థి అమాయకుడవాయే... ఆ పిల్లలపాటి తెలివితేటలున్నాయా నీకు? ఈ రోజుల్లో పిల్లలు చూసిరమ్మంటే కాల్చివస్తున్నారు"

"ఊరుకోవే బామ్మా... ఎవరన్నావింటే నవ్వి పోతారు"

"నవ్వుకోనీ... వాళ్ళవళ్ళే బైటపడతాయ్"

"రోడ్డుమీద వచ్చేపోయే కాలేజీ అమ్మాయిల్నిగూడా ఆరాతీయకపోయావా నీమనవడి గురించి... కరెక్ట్ ఇన్ఫర్మేషన్ దొరికేది" అసహనంతో అరిచినట్టే అన్నాడు.

"అదీ చేశాన్రా. పుస్తకాలు చంకనపెట్టుకుని వెళుతూ కనిపించిన ప్రతి అమ్మాయినీ నీగురించి వాకబుచేశాను. అబ్బాయిలెవరూ కనపడనే కనపడరు... నీ కాలేజీలో మగపిల్లకాయలు ఉండరా ఏమిట్రా?"

భీమన్న దాదాపు జుట్టు పీక్కున్నంతపనిచేశాడు.

"బామ్మా... ఎందుకే నన్నిలా భ్రష్టుపట్టిస్తావ్? కాలేజీలో నాపరువేం కావాలి?"

"నోర్ముయ్యరా...నీ పరువుకేం నిక్షేపంలా వుంటుంది. పైగా మా తెలుగుమాస్టారంటే వాళ్ళబామ్మకి ఎంతప్రేమోనని పిల్లకాయలంతా కథలుకథలుగా చెప్పుకుంటే అది నాకు మాత్రం గర్వకారణం కాదుట్రా"

"ఇదన్నమాట నీ ఆలోచన... నీ బుర్రలో ఇంతటి దురాలోచన వుందటే. నీ గొప్పకోసం నా పరువుతీస్తున్నావన్నమాట!"

"ఏమిట్రా? ఆ కూతలు... ఇందాకట్నుంచి చూస్తున్నాను. తెగపెట్రేగుతున్నావ్?" గదమా

యించింది.

"నీవరసేమీ నాకు నచ్చలేదు. ఇందాకే మిటి? నేనుత్తవాజమ్మనని, అర్భకుణ్ణని దేవుడి కి కూడా చెబుతున్నావ్? నా ప్రతాపం భూలో కంలోనేకాకుండా పైలోకంలోకూడా టాంటాం చేస్తున్నావన్నమాట?"

"చేస్తాన్రా... ఏం నీకు బామ్మనైన నేరానికి నాకు నోరారా మాట్లాడుకునే స్వేచ్ఛకూడా లేదా?"

అమ్మో... బామ్మలోకూడా రివల్యూషన్ వచ్చే ట్టుంది. ఇక ఇంతటితో ఊరుకోవడం మంచిద నుకున్నాడు భీమన్న.

"ఇప్పటిదాకా వాగింది చాలుగాని వెళ్లు... వెళ్ళి బట్టలు మార్చుకురా... తిండితిందువు గాని" అన్నది.

బామ్మచెప్పిన ప్రకారం కిమ్మనకుండా వెళ్ళి బట్టలు మార్చుకొచ్చాడు. దొడ్లోకెళ్ళి కాళ్ళు కడు క్కొచ్చాడు. కుర్చీలో కూర్చునిపేపరు తిరగేస్తు న్న భీమన్నని చూసి-

"మళ్ళీ అక్కడ చతికిలవడ్డావేంరా నాయనా... భోజనానికి రావా?" అంది.

"నాకు ఆకలిగాలేదు. నువు చేసెయ్" అన్నాడు ముభావంగా.

"ఆకలి లేకపోవడమేమిట్రా? రాళ్ళు రప్ప ల్నికూడా హరాయించుకోవాల్సిన వయస్సులో ఆకలిలేదంటావ్ ఇదెక్కడి ప్రారబ్ధంరా..."

"అబ్బ నువ్వు... అనవసరంగా రాద్ధాంతంచెయ్యకే. ఇందాక కాలేజీనుంచి వస్తుంటే దారిలో గోపాలరావు కనిపించాడు."

"గోపాలరావా... ఎవరు... ఆ గొణుగుడు రోగంవున్న గోపాలరావేనా?" ఆరాతీసింది.

"అబ్బ... బామ్మా... కొంచెం నవ్యంగా మాట్లా డవే. వాడిది వింటే ఉరేసుకోనక్కర్లేకుండానే చస్తాడు".

"వాడిముందు అంటానా ఏమిట్రా... మరీ ను... నా చెవులకి చేటలు కడతావ్" నిష్ఠూరం ఆడింది.

"వాడు కనిపిస్తే ఇద్దరం హొటల్‌కెళ్ళాం. బలవంతాన డబుల్ టిఫిన్ తినిపించాడు."

"సరే... అయితే కాసేపాగి తిందువుగానిలే. సరేగాని మంచినీళ్ళు అడుగంటాయిరా. కొంచెం పట్టుబట్ట కట్టుకుని వీధి కుళాయిదగ్గ రికెళ్లి ఓ బిందెడు మడినీళ్లు కొట్టుకురా నాన్నా..." మనవడికి పని పురమాయించింది.

బామ్మచెప్పే సవాలక్ష పనుల్లో భీమన్నకి నచ్చనిది ఇదొకటి. పొద్దున, సాయంత్రం మడి పేరుతో పట్టుబట్ట కట్టించి రోడ్డు ఆచివరి నుంచి ఈ చివరికి మంచినీళ్ళు మోయి స్తుంది. భీమన్నకేమో ఇది చాలా ఇన్‌సల్ట్ అనిపిస్తుంది. అయినా తప్పదు. బామ్మకోసం రాజీపడి... చేస్తున్నాడు.

"బామ్మా... రేపు తెల్లవారుజామునే తల మీద చన్నీళ్ళస్నానంచేసి... పట్టుబట్టేం ఖర్మ... తడి బట్టే చుట్టుకుని నాలుగు కడవల మడినీ ళ్లు తెచ్చిపెడతాగాని... ఈ పూటకిమాత్రం నన్ను వదిలెయ్యవే... నీకు పుణ్యా ముంటుంది."

"వదిలెయ్యక ఛస్తానా... అయినా చెప్పగానే సంతోషంగా ఏ పనిచేశావుగనక ఇది చేస్తావని అనుకోడానికి" బామ్మకి లైట్‌గా కోపమొచ్చింది.

"అదికాదే... ఇది ట్యూషన్లు వదిలే టైము. నాస్టూడెంట్లు రోడ్డుమీద కనిపిస్తారు. వాళ్ళ ముందు మడి... దడి... అంటూ మంచినీళ్ళ బిందెలు మోయాలంటే నాకు మా చెడ్డ చిరా కే"

"ఆ.. మరే.. ఆ వెధవలెవ్వరికీ అసలు మంచినీళ్ళతో పనే ఉండదాయే... ఎక్కడెక్కడ లేని విడ్డూరాలన్నీ నీ దగ్గరే వింటున్నారా నాయనా... తప్పేదేముంది... చేసుకున్నవాళ్ళకి చేసుకున్నంత మహదేవ అని నాకు తప్పు తుందా... నిన్ను నమ్ముకోవడం... మాట వింటా వని ఆశపెట్టుకోవడం నాదేబుద్ధితక్కువ. ఏంచేస్తాను. నేనేవెళ్ళి తెచ్చుకుంటాను. చూస్తూ చూస్తూ గొంతుని ఎండబెట్టుకోలేను గదా" అంటూ లోపలికెళ్ళింది.

భీమన్నని చిరాకు, కోపం, జాలి, బాధ అన్నీ ఒక్కసారిగా చుట్టుముట్టాయి. బామ్మ తను పట్టిన కుందేటికి మూడే కాళ్ళంటుంది. పట్టిన పట్టు విడవదు. వయస్సు తెచ్చే ఛాదస్తం మరికొంత.

ఏమాత్రం రాజీపడే మనస్తత్వం కాదని పించినప్పుడు చిరాకేసింది.





తన సమస్యని అర్థంచేసుకోకుండా తనని ఇరకాటంలో పెడుతున్నందుకు కోపమొచ్చింది. అల్లంతదూరం నుంచి ఆమెచేత మంచినీళ్ళు మోయించాలంటే మనసొప్పక బాధేసింది.

బామ్మని కష్టపెడుతున్నానేమోనన్న ఆలోచన రావడంతో ఆ ముసలామె మీద జాలి పొంగుకువచ్చింది.

వెంటనే లేచెళ్ళి, పట్టుబట్ట కట్టుకుని ఇత్తడి బిందె చేతబుచ్చుకుని బెరుకు బెరుగ్గా రోడ్డున పడ్డాడు!!!

★ ★ ★

ఇంటర్ సెకండ్ ఇయర్ క్లాసది!

"సైలెన్స్... సైలెన్స్..." అంటూ డస్టర్‌తో బల్లగుద్దుతూ గట్టిగా అరిచాడు భీమన్న.

ఆ కేకలకి ముందువరసల్లోని అమ్మాయిలంతా రెండుచేతులతో చెవులు మూసుకున్నారు.

అది చూసిన భీమన్నకి చిర్రెత్తుకొచ్చింది.

మొదటివరస బెంచీలో అయిదుగురు అమ్మాయిలు కూర్చుని వున్నారు. వాళ్ల ముందుకెళ్లాడు సీరియస్‌గా.

"ఏం తల్లీ... కాకిగోలకైతే చెవులు చిల్లులు పడవు. అరవకండి బాబుల్లారా అని నేను వేడుకుంటుంటే అది మీకు భరించలేని గోలగా వుందన్నమాట" అన్నాడు వత్తి వత్తి పలుకుతూ.

మరుక్షణమే వాళ్లంతా చెవులమీద చేతులు తీసేసుకున్నారు.

"వేడుకోవడమంటే ఇంత పెద్దగా అరవడం కాబోలుగా!" ఎక్కడో వెనకబెంచీలో నుంచి ఓ కుర్రాడిగొంతు నూతిలోపడ్డట్టు వినిపించింది. భీమన్న ఆవైపు చూశాడు. ఎవడై వుంటాడబ్బా అనుకుంటూ ఆ బెంచీలో అందరిముఖాలు నిశితంగా పరిశీలిస్తూ ఆలోచించాడు. వాళ్ల గొంతులన్నీ తనకి పరిచయమే. అయినా అంట్ల వెధవలు ఇలాంటి చిల్లరపనులకి ఒరిజినల్ గొంతులు వాడిచావరు...తెలివిమీరిపోయారు. మిమిక్రీ రాని కుర్రకుంక ఏ కాలేజీలో వెదికినా కనిపించనిరోజులైపోయాయి అనుకున్నాడు మనసులోనే. ఇక ఈ విషయాన్ని ఇంతటితో వదిలెయ్యడం మంచిదనిపించింది. అది తనకే గౌరవం కూడా.

"ఎవరా కారుకూత కూసిం"దంటూ గొప్పగా ఫోజుపెట్టి, సీరియస్‌గా ముఖంపెట్టి కనుబొమలు రెంటినీ పీటముడేసి క్వెశ్చన్ చెయ్యొచ్చు. చెయ్యడానికేముంది! కాని దానికి సమాధానం రావాలిగదా!

"నేనే సర్. ఆమాట అన్నది. పొరపాటైంది క్షమించండి. ఇంకెప్పుడూ అనను" అని ఆ గడుగ్గాయి ఎవరో నిలబడి చెప్పాలిగదా! అప్పుడేగదా తనువేసిన క్వెశ్చెన్‌కి, తనుచేసే ఉద్యోగానికి పరువు దక్కేది!

కాని సమాధానం వస్తుందా...?

ఇక ఆవిషయాన్ని అంతటితో వదిలేసి టేబిల్ దగ్గరకొచ్చాడు.

తెలుగు టెక్స్ట్‌బుక్ తెరిచాడు.

"ఇవ్వాళ మనం శ్రీనాథుని విరచిత 'వ్యాసునికోపం' పద్యభాగంలోని మిగతా భాగాన్ని చూద్దాం" అంటూ పాఠం ప్రారంభించబోతుండగా...

వెనక బెంచీలో కుర్రాడొకడు

"హాచ్..." అంటూ గట్టిగా తుమ్మాడు.

"చూడబ్బాయ్... తుమ్మితే పాఠం మొదలుపెట్టననుకుంటున్నావేమో... నాకు అలాంటి సెంటిమెంట్లేవీ లేవు" అన్నాడు భీమన్న!

"హిస్టరీ మాస్టారైతే ఎవరన్నా తుమ్మితే... అసలు పాఠమే చెప్పరుసార్" ఓ కుర్రాడు అన్నాడు.

"హిస్టరీ మాస్టారా... ఆయన సంగతి నాముందు ఎందుకయ్యా... ఆయన.... తుమ్మినా పాఠం చెప్పరు తుమ్మకపోయిన్నా చెప్పరు. అది ఆయన స్పెషాలిటీ. కానీ నా సంగతి తెల్సా...

"తుమ్మినా చెబుతాను తుమ్మకపోయినా చెబుతాను."

"ఇది మీ స్పెషాలిటీ" అమ్మాయిల బెంచీల్లోంచి వచ్చిందీ కామెంట్!

దాంతో మగపిల్లలంతా ఘొల్లున నవ్వారు.

"ఆహాఁ ఫర్వాలేదు... మీరూ రాణిస్తున్నారు" అన్నాడు భీమన్న అమ్మాయిలనుద్దే



శించి!

కొంచెంసేపటికి క్లాసులో గొడవ సద్దుమణి గింది!

పుస్తకాలు తెరవండి అంటూ భీమన్న తన చేతిలో పుస్తకం తెరిచాడు.

అమ్మాయిలంతా బుద్ధిగా పుస్తకాలు తెరిచారు. అబ్బాయిలుమాత్రం అదేమీ పట్టనట్టు భీమన్న మొహంలోకి చూస్తూ కూర్చున్నారు.

"ఏమిటలా... మాట్లాడకుండా,స్తంభాల్లాకదలకుండా వుండిపోయారు. పుస్తకాలు తెరవమని చెప్పా. వినపళ్ళేదా?" గద్దించాడు భీమన్న.

అయినా వాళ్లలో చలనం లేదు.

ఒక్కొక్కళ్లనే నిలబెట్టి అడిగాడు.

అసలుసంగతి ఓ నలుగురైదుగురి దగ్గర తప్పిస్తే మిగతా వాళ్ళెవరిదగ్గరా పుస్తకాల్లేవు. కొంతమంది కొనలేదని చెప్పారు. మరికొందరు మర్చిపోయి వచ్చామన్నారు.

తాను ఉద్యోగంలో చేరిన కొత్తలో ఈ బాపతు కుర్రాళ్ళు చాలా తక్కువమంది వుండేవాళ్ళు. రానురాను వీళ్లసంఖ్య ఎక్కువైపోయింది. దీనికి కారణమేమిటన్నది భీమన్న చాలా ఆలస్యంగా తెలుసుకున్నాడు. మొదట్లో పుస్తకాలు తీసుకురానివాళ్లని పనిష్మెంట్‌గా తను క్లాసులో నుంచి బైటికి పంపేవాడు. కుర్రోళ్లకది వరప్రసాదంలా తయారైంది.

కొత్త సినిమా రిలీజ్ అయితేచాలు ముందే టిక్కెట్లు రిజర్వు చేయించుకుని మరీ వచ్చేవాళ్ళు. తెలుగు టెక్స్టుబుక్ లేకుండా క్లాసుకి వెళితే... ముందు అటెండెన్స్ పడుతుంది. ఆ తర్వాత క్లాస్‌నుంచి బైటపడి మార్నింగ్ షోకి చెక్కెయ్యొచ్చు... కుర్రాళ్ల ఈ టెక్నిక్ చాలా రోజులకిగాని భీమన్నదృష్టికి రాలేదు. అప్పటి నుంచి తనపంథా మార్చుకున్నాడు. ఏదైతే కుర్రాళ్లకి పనిష్మెంట్ అని తాను అనుకున్నాడో అదే వాళ్లపాలిట వరప్రసాదం అయిందన్న విషయం తెలిశాక పుస్తకాలు తెచ్చినా, తెచ్చుకోకపోయినా క్లాసురూము నుంచి బైటికి పంపడంమాత్రం మానేశాడు. ఆ విధంగా వాళ్లకి క్లాసులోనే శిక్ష విధించడం మొదలుపెట్టాడు.





అయితే కుర్రాళ్ళు మాత్రం ఇంకా దింపుడుకళ్ళం ఆశతోనే వున్నారు.

"చదువుమీద ఇంట్రస్ట్ అంటూ ఒకటేడిస్తే మీరిలా తయారుకారు" అంటూ భీమకవి వాళ్లందర్నీ ఉమ్మడిగా శాపనార్థాలు పెట్టాడు.

అమ్మాయిలవైపు చూస్తూ "మీరన్నా జాగ్రత్తగా పుస్తకాలు చూడండి. ఇందులో పద్యాలన్నీ పరీక్షల్లో ప్రతిపదార్థాలుగా రాదగ్గవే. శ్రద్ధగా విని, ఎక్కడన్నా అర్థంకాకపోతే లేచిఅడగండి. చదువుదగ్గర సిగ్గూ, బిడియం పనికిరావు." అని ఓ చిన్నసైజు లెక్చరిచ్చాడు.

ఇక పాఠం మొదలుపెట్టాడు.

వేదవ్యాసుడు తన శిష్యుల్ని వెంటేసుకుని కాశీనగరవీధుల్లో భిక్షాటన ప్రారంభించాడు అని భీమన్న అనగానే క్లాసులో మగపిల్లల బెంచీలవైపు నుంచి "అమ్మా... కాశీ అన్నపూర్ణా... భిక్షాందేహీ!" అంటూ పిల్లికూతలు వినిపించసాగాయి.

దాంతో ఆడపిల్లలంతా నోటికి చేతులడ్డం పెట్టుకుని కిసుక్కున నవ్వారు.

భీమన్నకి అరికాలిమంట నెత్తికెక్కింది!

మొగుడు కొట్టినందుకు కాదు తోడికోడలు నవ్వినందుకన్నట్టు-

అమ్మాయిల నవ్వు- నువ్వెంత అసమర్థపు చక్రవర్తివా?- అని తనని నిలదీస్తున్నట్లనిపించింది.

వెంటనే అబ్బాయిలవైపు తిరిగి మెడ అదోలా క్రాస్‌గా పెట్టి కోపాన్ని ఏమాత్రం పైకి పొంగనివ్వకుండా "వెరీగుడ్... చక్కగా అన్నారు. నాకిప్పుడు చాలా తృప్తిగా వుంది. మీ జీవితాలకిక ఢోకా లేనట్లే. చదువబ్బకపోయినా ఫర్వాలేదు. ఓ కమ్మని వృత్తికి కావలసిన స్లోగను మీదగ్గర వున్నట్టే. మీరు బాగా పనికొస్తారు ఆ వృత్తికి" అన్నాడు అతి శాంతంగా!

అప్పటిదాకా విరగబడి నవ్వుతున్న అబ్బాయిలకి చెంపమీద ఛెళ్ళున కొట్టినట్టనిపించింది. టక్కున నోరు మూసేశారు.

ఓ క్షణం ఆగాక భీమన్న మళ్ళీ పాఠంలోకి వెళ్ళాడు.

"కాశీనగర వీధుల్లో ఎంతగా తిరిగినా వ్యాస మహర్షికి పట్టెడన్నం దొరకలేదు. వరుసగా రెండురోజులూ ఇలాగే జరిగింది. పార్వతీపర

మేశ్వరులు అతని మనోస్థైర్యానికి పెట్టిన సహనపరీక్ష ఇది. ఈ విషయం వ్యాసుడికి తెలీదు. ఆకలిమంటకొద్దీ భిక్షా పాత్రను నడిరోడ్డుమీద విసిరికొట్టాడు. అతనిలో ఆవేశం కట్టలు తెంచుకుంది. కాశీనగరాన్నే శపించాలనుకున్నాడు. అదే సమయంలో ఒక బ్రాహ్మణ గృహం ముందు పార్వతీదేవి సహజసిద్ధమైన స్త్రీ వేషంలో దర్శనమిచ్చింది. నిన్న ఇక్కడిదాకా చెప్పుకున్నాం. అవునా?''

అవునన్నట్టు అమ్మాయిలంతా తలలూపారు.

"ఇక తర్వాత ఏం జరిగిందో ఇప్పుడు చూద్దాం" అంటూ పాఠం మొదలెట్టాడు భీమన్న.

"వేనవి పాట పాట నరవెంట్రుకతో దిల తండులాన్వయ
శ్రీ నటియింప గైనడలి వ్రేకుని చన్నులు పాలవంకలై
కొనసి యార్ప వాలుదెలి కన్నులు గల్కిత నంబు వీడ్కొనన్
మానిని హస్తమూది యొక మంజుల భాషిణివచ్చె వీధికిన్"

అంటూ పుస్తకం చూస్తూనే పద్యాన్ని తనకు చేతనైనంతవరకు రాగయుక్తంగా పాడాడు.

పద్యం అయ్యేసరికి క్లాసులో కలకలం మొదలైంది.

"మళ్ళీ ఇంకోసారి సార్... చాలా బాగా పాడారు" నలుగురైదుగురు కుర్రాళ్ళు కోరస్‌గా అడిగారు.

వాళ్ళెందుకు అడిగారో భీమన్నకి అర్థం కాకపోలేదు. అయినా అదేమీ పట్టించుకోకుండా ఇంకోసారి చదివాడు.

భీమన్న పైకి ఈ పద్యం గంభీరంగా రెండు సార్లు చదివాడేగాని లోలోన ఇబ్బంది పడ్డాడనేది మాత్రం వాస్తవం. ఇప్పుడీ పద్యానికి విడమరిచి అర్థం చెప్పాలి. ఈ పోకిరీ కుర్రాళ్ళు విజృంభించకపోరు అనుకుంటుండగానే ఓ కుర్రాడు లేచి నిలబడి అతి వినయంగా "ఈ పద్యం సరిగా అర్థం కాలేదు. విడమరిచి చెప్పరూ" అన్నాడు రెండు చేతులూ కట్టుకుని.

"అందుకే వస్తున్నానయ్యా ఆ మాత్రం ఓపిక పట్టలేవా... కూర్చో"అన్నాడు భీమన్న.

పద్యానికి ప్రతిపదార్థం చెప్పసాగాడు.

'వేనవి' అంటే కేశపాశం. అంటే జుట్టన్న మాట.

"పాటపాట నరవెంట్రుకలో" అంటే అక్కడక్కడ నెరిసిన వెంట్రుకలతో"

"ఎక్కడెక్కడనర్" -ఎవరిదో ఓ సందేహం!

నెరిసిన వెంట్రుకలు ఎవరివి సర్?-మరో ఆకతాయి ప్రశ్న!

"నీవి నావి కాదయ్యా...పార్వతివి" అని బదులిచ్చాడు భీమన్న.

"పార్వతి రూపురేఖా విలాసాన్ని వర్ణించి చెబుతున్న పద్యమిది. సరేనా...మధ్యలో మళ్ళీ ధర్మసందేహం లేవనెత్తొద్దు...ఆఁ.. తర్వాత చూడండి..''

"తిలతండులాన్వయశ్రీన్" -తిలతండుల ప్లస్ అన్వయశ్రీన్- అంటే నువ్వులు, బియ్యము కలిసిన శోభను-

'నటియింపన్', అంటే అభినయించగా-

ఇంతవరకు మొత్తం అర్థం ఏమిటంటే-

అక్కడక్కడా నెరిసిన వెంట్రుకలతో, నువ్వులు బియ్యం కలగలిసిన శోభని అభినయిస్తూ..."

ఇక ఆ తర్వాత చూడండి.

"కైనడలి వ్రేకని చన్నులు పాలవంకలై" అని ఆపాడు భీమన్న.

ఆ సమయంలో క్లాసంతా పిన్‌డ్రాప్ సైలెన్స్ అయిపోయింది.

"అబ్బ...పాఠంమీద ఎంత శ్రద్ధ" మనసులోనే కుర్రాళ్ళని దెప్పిపొడవకుండా వుండలేకపోయాడు భీమన్న.

పాఠంమీద బుట్టెడుశ్రద్ధ, మాస్టారిమీద తట్టెడు గౌరవం, భక్తి వున్నట్టుగా ప్రతిఒక్కడూ భీమన్నవైపే మోరలెత్తి చూస్తున్నారు.

అమ్మాయిలేమో సిగ్గుతో తలవంచుకున్నారు.

భీమన్నకి ఈ పరిస్థితి ఇబ్బందిగా వుంది. స్వతహాగా బిడియస్తుడు, అందులోనూ

ఇలాంటి శృంగార వాక్యాన్ని ఇంతమంది లో-పైగా ఆడపిల్లలముందు ఉచ్చరించాలంటే గొంతులో పచ్చివెలక్కాయపడ్డట్టే వుందతనికి!

కుర్రాళ్ళంతా ఎంతో ఉత్సుకతతో భీమన్న నోటినుంచి టీకా తాత్పర్యం వినాలని ఉబలాట పడుతున్నట్టు వారి మౌనమే తెలుపుతోంది!

"ఇలాంటప్పుడు అస్సలు గొడవచేసి ఛావరు. సందట్లో సడేమియా మాదిరిగా పైపైన లాగించేవాణ్ణి" అని మనస్సులోనే గొణుక్కున్నాడు భీమన్న. క్లాసంతా నిశ్శబ్దంగా వుండటంతో భీమన్నకి మరీ ఇబ్బందిగా వుంది. అందుకే ఆ పాదం వదిలి మూడో పాదానికి వెళ్ళాడు. మూడో పాదం చదువుతుండగానే కుర్రాళ్ళంతా మూకుమ్మడిగా అరవసాగారు.

"సార్...సార్..రెండోపాదం అర్థం చెప్పలేదు" అని కొందరంటే -

"మర్చిపోయినట్టున్నారు...ఇప్పుడు చెబుతార్లే" అని కొందరు -

"బిడియమేలనోయి...పద్యం వివరించవోయి" అని ఇంకొందరు కూనిరాగాలు తీశారు. ఇలా రకరకాల వ్యాఖ్యలతో, అరుపులతో క్లాస్‌రూమ్ ఓ అయిదు నిమిషాలపాటు దద్దరిల్లిపోయింది. ఆ అరుపులు పక్క క్లాస్‌లో కూడా ధ్వనించాయి. ఆ క్లాసులో పాఠం చెబుతున్న ఇంగ్లీషు లెక్చరర్ బైటికొచ్చి-ముఖం చిట్లిస్తూ కిటికీ గుండా తొంగిచూస్తున్నాడు.

తానీ సమయంలో ఎంత అరిచి మొత్తుకున్నా వీళ్ళని ఆపడం అసాధ్యమన్న సంగతి భీమన్నకి ఇట్టే అర్థమైపోయింది. అవతల ఇంగ్లీషు లెక్చరర్ అలాగే నిలబడి చాలా అసహనంగా చూడటం భీమన్నకి మరింత కంపరం పుట్టిస్తోంది.

ఈ కుర్రాళ్ళ నోళ్ళు మూయించాలంటే రెండో పాదానికి అర్థం చెప్పడమే మంచిది అని తీర్మానించుకుని -

"రెండో పాదానికి అర్థం చెబుతున్నాను. సైలెన్స్" అంటూ అరిచాడు.

మరుక్షణమే క్లాసంతా నిశ్శబ్దమైపోయింది.

భీమన్న మనస్సు ఇప్పుడుగాని కుదుటపళ్ళేదు.

చిరుదరహాసంతో ఇంగ్లీషు లెక్చరర్‌వైపు చూశాడు.

"చూశావా...పరభాషా బోధకా...నా క్లాసు మీద నాకెంతటి కంట్రోల్ వుందో" అన్నట్టున్నాయి ఆ చూపులు!

అప్పటిదాకా ముఖం చిట్లించి నిలబడ్డ ఇంగ్లీషు లెక్చరర్ భీమన్న చూపులతో చూపు కలిసేసరికి మూడ్ మార్చేసుకుని- అబ్బే ఏంలేదు అన్నట్టు భుజాలెగరేస్తూ, ఇకిలిస్తూ వెళ్ళిపోయాడు. భీమన్న మళ్ళీ పాఠంలోకెళ్ళిపోయాడు.

'క్రొనవి' అంటే వ్రాలి-

'వ్రేకని' అంటే బరువైన-

చన్నులు-

'పాలవంకలై'- అంటే 'పాలసముద్రములై' అని చెప్పుకుంటూ పోతున్న భీమన్నకి ఓ గడుగ్గాయి స్పీడ్‌బ్రేకర్ వెయ్యనే వేశాడు.

"సర్... పాలసముద్రాలుగా మారినవి ఏమిటి సర్?" అన్నాడా కుర్రాడు అమాయకంగా ముఖంపెట్టి. "నీ బొంద సర్" అని భీమన్న మనస్సులోనే వాణ్ణి కసిదీరా తిట్టుకున్నాడు.

ఆ కుర్రాడు వేసిన ప్రశ్నకి మగపిల్లలంతా పకపకా నవ్వుతుంటే అమ్మాయిలేమో తలలన్నీ ఓచోటికి చేర్చి ముసిముసినవ్వులు నవ్వుకుంటున్నారు. మధ్యమధ్యలో 'ఛీపాడు' 'ఛీపాడు' అని గొణుక్కుంటున్నారు.

ఆ మాటలు భీమన్నకి వినిపించాయి.

"ఏం... తల్లీ చేసిందంతా చేసి ఇప్పుడు ఛీపాడు అనుకుంటే ఏంలాభం. ఇదంతా మీ వల్లే వచ్చింది" అని లోలోనే గొణుక్కున్నాడు భీమన్న.

మొత్తంమీద అతనికి ఈ పద్యం ఓ అగ్నిపరీక్షే. ఆవేశకావేశాలకు పోకుండా వీలైనంత త్వరలో పద్యాన్ని ముగించడమే తన తక్షణ కర్తవ్యం అనుకున్నాడు.

"పాలసముద్రాలైంది మరేవోకాదు బాబూ... పార్వతీదేవి స్తనాలు" అని చెప్పాడు చాలా తాపీగా.

"స్తనాలంటే ఏమిటిసర్" మరో కుర్రాడు

లేచి ఎంతో వినయంగా, మరెంతో అమాయకంగా అడిగాడు.

"చన్నులురా" టక్కున బదులిచ్చాడు మరో కుర్రాడు.

తెలిసిందిగా... ఇంక కూర్చో అన్నట్టు చూశాడు భీమన్న మొదటి కుర్రాడివైపు. "చన్నులు బరువెక్కడం అంటే ఏమిటండీ?" పట్టువదలని విక్రమార్కుడిలా ఆ కుర్రాడు మరో ప్రశ్న వేశాడు.

"నీ మొహమండీ... నీ శ్రార్థమండీ... నీ పిండాకూడండీ..." అని భీమన్న పెదవులు విప్పకుండానే మనసారా తిట్టాడు. పదాలు విప్పి మరోలా చెప్పాడు.

"బాబూ... ఇవతల అమ్మాయిలున్నారు. మనది కో-ఎడ్యుకేషన్. డీసెన్సీ మెయిన్‌టెయిన్ చెయ్యకపోతే కో-ఎడ్యుకేషన్ లక్ష్యమే దెబ్బతింటుంది. నువ్వడిగిన ప్రశ్నలకి సూటిగా సమాధానం చెప్పగల్ను. కాని మనపక్కనే అమ్మాయిలున్నారు. వాళ్ళని ఇబ్బంది పెట్టడం భావ్యంకాదు. అందుకే వెనకాడుతున్నాను. అలాగని పాఠంలో భాగంగా వచ్చిన ఆ పదానికి అర్థం చెప్పకుండా అయోమయంలో పడేసి నీకు అన్యాయం చెయ్యలేను. నా పరిధిలో నేను చేయగలిగిందీ, నాకు తోచిందీ ఓ పని చేస్తాను. నీకు సలహా ఇస్తాను. ఇవ్వనా..." అన్నాడు ఆ కుర్రాడి ముఖంలోకి చూస్తూ.

ఆ కుర్రాడికి ఇదంతా సస్పెన్స్‌గా వుంది. మరోవంక క్లాసులో తనే 'హీరో'లా తనని తాను ఊహించుకుంటున్నాడు. అందుకని, "సరే ఇవ్వండి" అన్నట్టు తలూపాడు చిర్నవ్వులు చిందిస్తూ!

"సాయంత్రం ఇంటికెళ్ళాక మీ అమ్మగారినిగాని, లేకపోతే సిస్టర్స్ ఎవరన్నావుంటే వాళ్ళనిగాని ఈ విషయం అడుగు. వాళ్ళయితే చక్కగా అర్థమయ్యేలా బాగా చెబుతారు. సరేనా" అన్నాడు భీమన్న అతి సాదాసీదాగా!

అంతే! ఆ క్షణమే ఆ కుర్రాడి ముఖంలో నవ్వు మాయమైంది. మొహంలో నెత్తురు చుక్కలేదు. టక్కున కూర్చుండిపోయాడు.

"కీలెరిగి వాతపెట్టడమంటే ఇదేరాబాబూ" అనుకున్నాడు భీమన్న లోలోన.

"మాస్టారు భలే చెప్పారబ్బా..." అంటూ అమ్మాయిలు గుసగుస లాడుకున్నారు.

భీమన్న మళ్ళీ పద్యంలోకి వెళ్ళిపోయాడు.

"కౌనసియార్చన్"-

కౌనుఫ్లస్ అసియార్చన్-

కౌను అంటే నడుమును-

'అసియార్చన్' అంటే అల్లలార్చగా అంటే అల్లల్లాడించగా అని అర్థం.

వాలుదెలికన్నులు - అందమైన తెల్లని కన్నులు...

ఆ విధంగా ఏ పదానికి ఆ పదం విడమరిచి చెబుతూ చివరికి పద్యం మొత్తాన్ని పూర్తి చేశాడు. అంతా అయ్యాక అమ్మయ్య అనుకున్నాడు మనస్సులోనే.

ఈ వయస్సు కుర్రాళ్ళకి ఇలాంటి శృంగార పూరిత పద్యాల్ని సిలబస్‌లో చేర్చినందుకు భీమన్న అధికారుల్ని లోలోనే నిందించాడు. కాని ఆ వెంటనే తానలా నిందించడంలో అర్థం లేదేమోనన్న ఆలోచనలో పడ్డాడు.

ఒక్కసారి తన కాలేజీ రోజులు గుర్తొచ్చాయి.

ఇలాంటి పద్యాలు... ఇంతకన్నా పచ్చి శృంగారాన్ని ప్రబోధించే పద్యాలు తాను ఇంటర్‌లో చదివాడు. కాని అప్పుడు విద్యార్థిగా తానూ వాటిని ఎంజాయ్ చేశాడు. ఏళ్ళతరబడి ఇలాంటి పద్యాలు పాఠ్యపుస్తకాల్లో వస్తూనే వున్నాయి. తెలుగు లెక్చరర్లకి ప్రతి ఏడాది అగ్నిపరీక్షగా నిలుస్తూనే వున్నాయి.

సెక్స్ ఎడ్యుకేషన్‌ని రెగ్యులర్ పాఠ్యాంశంగా చేయాలన్న బృహత్‌పథకానికి ఇలాంటి పద్యాలను నాందీ ప్రస్తావనగా భావించవచ్చు. ఓ విధంగా ఇది హర్షించదగిందే! కాని కుర్రాళ్ళకిది సరదా అయిపోయింది. పంతుళ్ళకేమో తలనొప్పిలా తయారైంది. పాఠాన్ని పాఠంగా స్వీకరించలేని కుర్రాళ్ళ బలహీనతతో... చివరికి పరిస్థితి పిల్లికి చెలగాటం, ఎలుక్కి ప్రాణ సంకటం మాదిరిగా తయారైంది.

తెలుగు లెక్చరర్‌నైనందుకు ప్రతి ఏడాది ఓ పావుగంటసేపు ఓపికతో ఈ శిక్షననుభవించక తప్పదనుకున్నాడు.




ఇంతలో పిల్లలంతా తనవైపే వింతగా చూస్తున్నారని గుర్తొచ్చి భీమన్న తన ఆలోచ న్లని కట్టేశాడు.

అంతలోనే వెనక బెంచీలోనుంచి ఓ మాటల తూటా పేలింది.

"స్తనాలు ఎలా వుంటాయోనని మాస్టారు ఆలోచనలో పడ్డట్టున్నారా..."

ఈ తూటా పేలీపేలడంతోటే గది పైకప్పు ఎగిరిపోయేంతగా ఆ ప్రాంతమంతా నవ్వులతో మార్మోగింది.

రెండు మూడు నిముషాలపాటు నవ్వులు ఆగనేలేదు.

పక్కక్లాసులో నుంచి ఇంగ్లీషు మాస్టారు మళ్ళీ బైటికొచ్చి కిటికీ దగ్గర నిలబడ్డారు.

"వీడు తన క్లాసు సంగతి చూసుకోక అర గంటకోసారిలా వచ్చి నా మీద, నా క్లాసు మీద సూపర్‌విజన్ ఏమిట్ట" ఆయన్ని కసిగా తిట్టు కున్నాడు.

అంతలోనే అతనికి హిస్టరీ మాస్టరు గుర్తొ చ్చాడు. ఆ మధ్య ఓ రోజు ఇంటర్ ఫస్టియర్ క్లాస్‌లో తను పాఠం చెబుతుంటే అతనూ ఇలాగే చీటికీమాటికీ అసహనంగా చూసెళ్ళా డు. చూసినవాడు అంతటితో ఆగాడా... లేదే... క్లాసయ్యాక నేరుగా వెళ్ళి ప్రిన్సిపాల్‌కి రిపోర్ట్ ఇచ్చాడు. ప్రిన్సిపాల్ తనని పిలిచి అక్షింతలు వేశాడు. ఇది గుర్తు రాగానే భీమన్న ఒళ్ళు గగుర్పొడిచింది. మనసెందుకో కీడు శంకించింది. కాని ఇదేమీ బైటకి తెలీనివ్వ కుండా ఇంగ్లీషు లెక్చరర్ వైపు చూస్తూ 'ఫ్రెండ్లీ'గా నవ్వాడు. అప్పటికి క్లాసు కొంచెం సద్దుమణిగింది.

ఇంగ్లీషు లెక్చరర్ కూడా తేలికపాటి న వ్వుతో శృతికలిపి, చేసేదేమీలేక భుజాలు ఓమారు ఎగరేసి తన క్లాసులోకి వెళ్ళిపోయా డు.

"ఇందాకటి పద్యానికి ప్రతిపదార్థం చెబుతా ను నోట్స్ రాసుకోండి" అన్నాడు భీమన్న పిల్లలవైపు చూస్తూ!

అందరూ నోట్సులు తీశారు.

భీమన్న చెబుతుంటే వాళ్ళు రాసుకోసాగా రు.

దాదాపు సగం పూర్తయింది. అందరూ తల లు వంచి శ్రద్ధగా రాసుకుంటున్నారు. భీమన్న ఓమారు పుస్తకంలోనుంచి తలపైకెత్తి అమ్మా యిలవైపు చూశాడు. మొదటి బెంచీలో రెండో అమ్మాయి రాసుకోకుండా ఊరికే కూర్చుంది దిక్కులు చూస్తూ.

"ఏమ్మా... ఏమిటి కథ? ఈ పద్యానికి ప్రతిప దార్థం రాసుకోవడం నామోషీ అని పించిందా?" వ్యంగ్యంగా అడిగాడు.

ఆ అమ్మాయి మెల్లగా లేచి నిలబడింది.

భీమన్న ప్రశ్నకి సమాధానమన్నట్టు పెదా లు కదిలించిందిగాని ఏం చెప్పిందో అతనికి అంతుబట్టలేదు.

"తల్లీ... నీ నోటి ఫాల్టో... నా చెవుల ఫాల్టోగాని నువ్వు చెబుతున్నదేమిటో నాకు తలకెక్కిచావ డంలేదు. కొంచెం గట్టిగా చెప్పు తల్లీ..." అన్నాడు కొంచెం అసహనంగా!

ఎంతో క్రమశిక్షణగల ఆదర్శ విద్యార్థినిలా ముఖంలో బోలెడంత వినయం వుట్టి కట్టినట్టు వుట్టిపడుతుంటే- చేతులు కట్టుకుని ఆ అమ్మాయి అలాగే నిలబడి మళ్ళీ గొణిగింది మరెంతో వినయంగా!

భీమన్నకి బి.పి పెరిగినంతపనైంది. కసిదీరా ఇంగ్లీషులో తిడదామన్నంత కోపం వచ్చింది. కాని అమ్మాయిని చూస్తుంటే చాలా మంచిపిల్లలాగుంది. వినయం కొద్దీ నోరు విప్ప లేకపోతుందేతప్ప మరేమీ కాదనిపించింది. ఈ పరిస్థితి అతనికి చాలా ముద్దేసింది. అందుకే తిట్టదలుచుకోలేదు. ఎలాగైనా సరే సమాధానం తెల్సుకొని చేతనైతే సాయం చేద్దా మనుకున్నాడు.

"చూడమ్మా... నా చెవులు వున్నట్టుండి రిపేరుకొచ్చినట్టున్నాయ్. నాకు పూర్తిగా చెవుడు అనుకుని నువ్వు బిగ్గరగా చెప్పు... అన్నాడు ఎంతో తెలివిగా!

ఆ పిల్ల మళ్ళీ గొణిగింది. ఆ వెంటనే పక్కనున్న మరో అమ్మాయి "పెన్నులో ఇంకు అయిపోయిందండీ" అంటూ శంఖం వూది నంత గట్టిగా అరిచింది.

ఆ శబ్దానికి హాలంతా దద్దరిల్లింది. భీమన్న

కూడా అదిరిపడ్డాడు. క్లాసంతా ఘొల్లుమంది.

"ఏమిటీ అరవడం? నాకేమన్నా చెవుడా?" భీమన్న గద్దించాడు.

"మీరే అన్నారుగా సర్- అందుకని..." అంటూ గొణిగింది గట్టిగా అరిచిన రెండో పిల్ల.

అవును. ఇందులో ఆ అమ్మాయి తప్పేమీలే దనిపించింది భీమన్నకి.

ఏం తల్లీ... కాలేజీకి వచ్చేటప్పుడు అన్నీ నవ్యంగా వున్నాయో లేవో ఓసారి చూసుకురావా లని తెలీదా?" అన్నాడు భీమన్న.

క్లాసులో మళ్ళీ నవ్వులు!

"ఎందుకయ్యా నవ్వుతారు చీటికీ మాటికీ? నవ్వు మీ నోళ్ళమీద ఒంటికాలిమీద నిలబడి వుంటుందా ఏం?" విసుక్కున్నాడు.

ఇంతలోనే మళ్ళీ ఇంగ్లీషు లెక్చరర్ వచ్చి కిటికీ గుండా తొంగిచూడటం భీమన్న దృష్టిలో పడింది. భీమన్నకి మరింత చిర్రెత్తింది. ఒక్క సారి ఆయన వైపు గుర్రుగా చూసి ఆ వెంటనే కుర్రాళ్ళ వైపు తిరిగి "నవ్వండయ్యా... పెద్దగా ఈ గది కప్పు ఎగిరిపోయేలా నవ్వండోసారి" అన్నాడు.

పిల్లలకీవిషయం అర్థమైపోయింది. ఇంగ్లీషు లెక్చరర్‌వైపు చూస్తూ అందరూ బిగ్గ రగా పొర్లిపొర్లి నవ్వసాగారు. ఆయన వీళ్ళ క్లాసుకి రాడు. అది వాళ్ళ ధీమా! తన వైపు చూస్తూ వాళ్ళలా నవ్వుతుంటే ఆ అవమానం భరించలేక ఇంగ్లీషు లెక్చరర్ కిటికీ తలుపులు దభీలుమని వేసేసి విసురుగా తన క్లాస్‌లోకి వెళ్ళిపోయాడు.

"ఇంక ఆపండి మీ నవ్వులు" అన్నాడు భీమన్న.

నిదానంగా నవ్వులు ఆగిపోయాయి.

"నోట్స్ రాసుకోండి" అని మొదలుపెట్టబో యేంతలో అసలు విషయం గుర్తొచ్చి అమ్మా యిలవైపు చూశాడు. పెన్నులో ఇంక్ అయిపో యిన పిల్ల ఇంకా అలానే నిలబడి వుంది ఎంతో వినయంగా!

భీమన్నకి జాలేసింది! ఇంకెంతో ముచ్చటే సింది!

తనకింతటి గౌరవం ఇచ్చే స్టూడెంట్ ఈ కాలేజీ కాంపౌండ్‌లో గస్తీ వేసి వెతికినా కని పించరనిపించింది. అందుకే జేబులో కలం తీసిస్తూ- "ఇదిగో నా కలంతో రాసుకో వెళ్ళేట ప్పుడు ఇచ్చేసి వెళ్ళు" అన్నాడు.

"అలాగే" అన్నట్టు తలూపి కలం తీసుకుని నవ్వుతూ కూర్చుందా పిల్ల.

ఆ పిల్ల పేరు వకుళ. మహాగడుగ్గాయి. భీమన్న ముందు ప్రదర్శించిందంతా నూటికి నూరుపాళ్లూ నికార్సయిన దొంగ వినయం. పైకి అలా బుద్ధిమంతురాలిలా కనిపిస్తుంది గాని చాలా చిలిపి. ఎదుటి వాళ్ళని ఆట పట్టించడం, టోకరా వెయ్యడం, చీటికీ మాటికీ ఫ్రెండ్స్‌తో పందాలు వేయడం ఆమెకి సరదా. అందులో భాగంగానే ఇప్పుడు భీమన్నని బురి డీ కొట్టించింది. ఇవేమీ భీమన్నకి తెలీక పాపం పెన్ను ఇచ్చి పప్పులో కాలేశాడు!

వకుళ దగ్గర పెన్ను వున్న మాట నిజమే గానీ అందులో సిరా అయిపోయిందన్నమాట మాత్రం నిజంకాదు.

తెలుగు క్లాసుకి రాబోయేముందు వకుళకి, ఆమె స్నేహితురాళ్ళకి ఏదో పిచ్చాపాటీతో మాటా మాటా పెరిగి, చివరకది పంతానికి దారి తీసింది. పంతానికి పరాకాష్ఠ పందెమేన న్నట్లు వకుళ వాళ్ళతో పందెం కాసింది. భీమన్న మాస్టారి దగ్గర్నుంచి కలం తీసుకుని దానితో నోట్సు రాసి తీరతానని శపథం చే సింది.

"చచ్చి గీపెట్టినా ఆయనమాత్రం కలం ఇవ్వడు. ఆయనెవరనుకుంటున్నావ్? భీమన్న. తెల్సా... మన పాలిటిక్స్ మాస్టారు కాదు" స్నేహితురాళ్ళు ఆమెని మరింత ఎగదోశారు.

వకుళలో పంతం పెరిగింది.

భీమన్న మాస్టారి దగ్గర్నుంచి కలం తీసు కుని రాయడమేగాదు. ఆయన క్లాసులో నుంచి వెళ్లేటప్పుడు తిరిగి ఇవ్వకుండా ఎగనామం పెడతానని కూడా ఛాలెంజ్ చేసింది. ఆ ప్రకారమే కలం రాబట్టగలిగింది.

పద్యానికి భీమన్న ప్రతిపదార్థం చెప్పడం పూర్తయింది. ఆయనలా ముగించడం... అవ తల గంటమోగడం ఏకకాలంలో జరిగిపో యాయి. అప్పటికే బెల్ ఎప్పుడెప్పుడవు తుందా అని ఎదురుచూస్తున్న భీమన్న గంట





వినబడీ వినబడగానే బతుకుజీవుడా అను కుంటూ పుస్తకం మూసేసి క్లాస్‌రూం నుంచి పరుగులాంటి నడకతో బైటపడ్డాడు. ఆ హడా వుడిలో కలం సంగతే మరచిపోయాడు.

ఆయన వెళ్లిపోయాక వకుళ హుషారుగా నిలబడి 'చూశావుటే నా తడాఖా' అంటూ పక్కనేవున్న స్నేహితురాలి భుజం మీద రెండు దెబ్బలేసింది.

"మీరు ఓడిపోయారు. మనవందెం ప్ర కారం ఓడిపోయినందుకు మీరు నన్ను వచ్చే ఆదివారం సిన్మాకి తీసుకెళ్ళాలి. సరేనా!" అంటు వాళ్ళని మరింత ఉడికించింది.

భీమన్నకి ఇవ్వాల్టి క్లాసుతో సగం భారం తగ్గినట్టనిపించింది. మళ్ళీ ఏడాదిదాకా ఆ పద్యం జోలికి వెళ్ళక్కర్లేదు. ఆ పద్యం పిల్లలకి సరదాగానే వుంటుందిగాని తనకిమాత్రం నెర్వెస్‌నెస్ తెప్పించింది. రాత్రి చాలాసేపు ఆ పద్యం మీదనే ఇంటిదగ్గర ప్రిపేరు అయ్యా డు. మగపిల్లలు అసలే ఏకొంచెం సందుచి క్కినా సరే క్లాసులోనే కోతికొమ్మచ్చి ఆడేరకం! పైగా అవతల అమ్మాయిలుంటారు. కో ఎడ్యు కేషన్‌తో ఇదే చావు.

ఏ కొంచెం శృతిమించినా వ్యవహారం రసా భాస అవుతుంది.

మొత్తంమీద ఇవ్వాల్టి క్లాసులో తాను అను కున్నంత గందరగోళమేదీ జరగలేదనే అని పించింది భీమన్నకి. అందుకే మనస్సు బాగా తేలికపడింది. ఇవ్వాల్టి క్లాసుని ఆమాత్రం లాక్కొచ్చానంటే మాటలా... పద్మవ్యూహాన్ని ఛే దించినట్టే! ఈ విధంగా తనని తాను సమాధా నపరుచుకున్నాడు నుదటపట్టిన చెమటని కర్చీఫ్‌తో తుడుచుకుంటూ. ఓ మోస్తరు విజ యగర్వంతో వడివడిగా అంగలేస్తూ స్టాఫ్ రూంవైపు నడుస్తున్న భీమన్నకి గురవయ్య పిలుపుతో బ్రేక్‌పడింది.

"సార్...సార్..." అంటూ గురవయ్య పరుగె త్తుకు వచ్చాడు.

"ఏమయ్యా... ఏమిటి సంగతి?" అనడిగా డు భీమన్న

"పెద్దసారు మిమ్ముల్ని పిలుస్తున్నాడు సార్" పరుగెత్తుకురావడంతో అలుపునపడ్డ గు రవయ్య వగరుస్తూ చెప్పాడు.

పెద్దసార్ అంటే ప్రిన్సిపాల్. గురవయ్య ప్రిన్సిపాల్ దగ్గర అటెండరు.

ప్రిన్సిపాల్‌తో తనకేమిటబ్బాపని అను కుంటూనే-

"ఏమిటోయ్...ఆయనకి నాతోపని?" అని గురవయ్యని ఆరాతీశాడు.

తనకేమీ తెలీదని గురవయ్య చేతులతోనే సమాధానమిచ్చాడు.

భీమన్న ఎన్నోరకాలుగా వూహాగానాలు చేశా డు.

ఒకవేళ క్లాసులో పాఠం సరిగ్గా చెప్పలే దంటాడా? ఆ సంగతి ఆయనకేం తెల్సు...!

"ఇవ్వాళ రోజుటికన్నా చక్కగా పిల్లలకి క్లాసు తీసుకున్నాగదోయ్" గురవయ్యతో అన్నా డు.

"మరైతే ఆ చేత్తోనే అయ్యగారిక్కూడా తీసు కోండి సర్. తొందరగా కదలండి సర్. లేట యితే ఆయన నాకు క్లాసు తీసుకుంటాడు" అన్నాడు గురవయ్య బతిమిలాడుతున్నట్లుగా!

పెద్దాయన... ప్రిన్సిపాల్ అంతటివాడు పిలిస్తే వెళ్ళకపోవడం ఏం బావుంటుంది అనిపించింది భీమన్నకి. ఏ మాత్రం బావుండ దని కూడా మళ్ళీ అనిపించింది...

ఆ మాటకొస్తే ప్రిన్సిపాల్ గదిలోకి వెళ్ళడం తనకేమన్నా కొత్తా... నాలుగురోజులకొకసారైనా ఆయన దగ్గర్నుంచి పిలుపురావడం ఆనవా యితీగా మారిందిగదా... అనుకొంటూ 'సరే పదవోయ్' అని గురవయ్య వెనకాలే దారితీశా డు భీమన్న.

ప్రిన్సిపాల్ గది దగ్గరికెళ్ళాక స్ప్రింగ్‌డోర్ తెరచిపట్టుకున్నాడు గురవయ్య.

చొక్కాకాలర్, గుండీలు ఓమారు సరిచేసు కుని లోనికినడిచాడు భీమన్న.

గురవయ్య ఆ వెంటనే స్ప్రింగుడోర్ మూసే శాడు! అతని ముఖంలో చెప్పలేనంత సంతోషం కనిపిస్తోంది.

భీమన్నని తలుచుకుంటూ- ముప్పైపాతిక రూపాయలు దసరామామూలు ఇవ్వడానికి ఎంత ఏడ్చాడు... తిక్కబాగా కుదరాల్లే... అను



కున్నాడు కసిదీరా.

మాటవరసకన్నా రేపోమాపో ఇస్తానని చెప్పొచ్చు గదా!

అసలు ఇస్తారో లేదో అదన్నా చెప్పండని బలవంతంచేసినా లొంగలేదు గురుడు.

వాళ్ళబామ్మని కనుక్కుని చెబుతానంటాడు. ఈ మాట తప్పిస్తే ఆ నోటంట రెండోమాట వస్తే ఒట్టు! లోపల ప్రిన్సిపాల్ బాగా తలంటిపోస్తే గాని చమ్మగా వుండదు అనుకొంటూ మధ్యమధ్యలో స్ప్రింగుడోర్‌పైనుంచి కాళ్ళెత్తి లోనికిచూస్తున్నాడు గురవయ్య.

భీమన్న లోనికెళ్ళగానే రెండుచేతులూ జోడించి 'నమస్కారమండీ' అన్నాడు వినయంగా!

ప్రిన్సిపాల్ తలెత్తి- "ఆఁ... నమస్కారం. ఏమయ్యా... నాకు నమస్కారం కొట్టడమొక్కటే ముఖ్యం కాదయ్యా. మిగతావన్నీ కూడా నవ్యంగా చెయ్యాలి" అన్నాడు.

"ఇవ్వాళ పాఠం సరిగ్గానే చెప్పానుసార్" అన్నాడు భీమన్న నీళ్ళు నములుతూ.

"క్లాసురూముల్ని నువు చేపల మార్కెట్ల మాదిరిగా చేస్తున్నావని సాటి లెక్చరర్లే నీ మీద కంప్లెయింట్లు ఇస్తున్నారు. దీన్నిబట్టి అర్థంచేసుకో పరిస్థితి ఎంత విషమించిందో!"

"అదేంలేదు సర్. నేను వెళ్ళే సరికే అవి కోళ్ళఫారాల మాదిరిగా వుంటున్నాయ్ సర్. వాటిని చేపలమార్కెట్లుగా మార్చడానికి ఎలావీలవుతుంది సర్... ఫిర్యాదు చేసేవాళ్ళకి ఆ మాత్రం కామన్‌సెన్స్ కూడా లేదని దీన్నిబట్టే అర్థమవుతోంది సార్".

"నువు క్లాసుకి వెళ్ళడానికి ముందే అవి కోళ్ళఫారాల మాదిరిగా వుంటున్నాయని నువ్వే ఒప్పుకొంటున్నావ్ గదా! అంటే నువు క్లాసులకి వెళ్ళకుండానే చెడగొడుతున్నావన్నమాట!"

'అమ్మ ముసలాడా... నువ్వీ అడ్డదిడ్డమైన క్రాస్ క్వొశ్చెనింగ్‌లో దిట్టవని నాకు తెలుసు. ఇంతకీ ఇదంతా ఆ ఇంగ్లీషు లెక్చరర్‌గాడి నిర్వాకమన్నమాట!' ఇలా ఆలోచిస్తూ భీమన్న అప్రయత్నంగా తలెత్తి స్ప్రింగ్‌డోర్‌వైపు చూశాడు. అదే సమయంలో ఇంగ్లీషు లెక్చరర్ స్ప్రింగుడోర్ మీదుగా ముఖంపెట్టి లోనికి తొంగిచూసి మళ్ళీ వెంటనే వెనక్కి తప్పుకోవడం భీమన్న కంటపడింది.

"త్రాష్టుడు! తోటి లెక్చరర్ మీదనే కంప్లెయింట్ ఇవ్వడానికి ఎలా మనసొప్పిందో వీడికి! పేడముఖం వీడూనూ... ఎంత ఇంగ్లీషు లెక్చరర్ అయితేమాత్రం అంతా ఇంగ్లీష్ స్టయిల్‌లో వుండాలని చూస్తాడు. ఇంగ్లీషు మీసం వీడూను...!" భీమన్న లోలోనే తిట్టాడు. ప్రిన్సిపాల్ గొంతు విప్పడంతో భీమన్న దృష్టి అటు మళ్ళింది.

"ఇంటర్ క్లాసులు లెక్చరర్ల సామర్థ్యానికి అగ్నిపరీక్షలయ్యా. ఎందుకో తెల్సా? ఆ క్లాసులో చేరే కుర్రాళ్ళ వయస్సు అలాంటిది. ఎన్ని అడ్డుకట్టలేసినా ఆగని జలపాతపు హోరులాంటి వయస్సు అది!

అలాంటివారిని ముందుగా మనవాక్చాతుర్యంతో ఆకట్టుకోవాల్సి వుంటుంది. సబ్జెక్టు మీద మనకి వుండే 'కమాండ్' మనకి శ్రీరామ రక్ష. అప్పుడే ఎంతటి అల్లరి పిడుగైనా దాసోహమంటాడు. దీనికి తోడు కొంత లౌక్యం, మరికొంత 'టెక్నిక్... ఇవన్నీ వుంటేనే లెక్చరర్ అన్నవాడు రాణిస్తాడు" ప్రిన్సిపాల్ చిన్నసైజు లెక్చరిచ్చాడు.

భీమన్నక్కూడా అదే ధైపులో అంతకన్నా ఇంకొంచెం పెద్ద లెక్చరివ్వాలని వుంది కాని ఇది సమయంకాదని సరిపెట్టుకున్నాడు. ప్రస్తుతానికి తాను చిక్కిపోయాడు. అంచేత ఆ ముసలాడు ఏది చెబితే అది వినడం మినహా తాను చేయగలిగిందేమీ లేదనుకున్నాడు.

ఇంగ్లీషు లెక్చరర్ తన మీద ఫిర్యాదు చేసి పైగా తలుపుచాటునుండి తమాషా చూస్తున్నాడని గుర్తొచ్చి భీమన్న మనస్సంతా చెరచెరలాడింది. చిత్రికతో వాడి ఒళ్ళంతా బరకాలన్నంత కోపం వచ్చింది. ఇంగ్లీషు లెక్చరర్ మళ్ళీ స్ప్రింగ్‌డోర్ మీది నుంచి లోనికి తొంగి చూడటం, అనవసరంగా ముఖం పెట్టి వెనక్కి తప్పుకోవడం మళ్ళీ భీమన్న దృష్టిలో పడింది.

నామీద కంప్లయింట్ ఇవ్వడం ఇది రెండవసారి. అదేమీ నాకు గుర్తు లేదనుకోకు. అన్నీ గుర్తే నాకు. నువు రెండుసార్లు ఫిర్యాదు చేశావ్. హిస్టరీవాడు ఇప్పటికి ఒక్కసారి చేశాడు.




అంతా లిస్టు రాస్తూనే వున్నా. సమయంరాకపోదు. అప్పుడు ఇంతకి ఇంతా తీర్చుకుంటాను. భీమన్న తనలోతానే కసిగా ప్రతినబూనాడు.

ప్రిన్సిపాల్ ఓ నిముషంపాటు అలుపు తీర్చుకుని, మళ్ళీ గొంతు సవరించి మొదలు పెట్టాడు–

“పిల్లల మూడ్ కనిపెట్టి పాఠాలు చెప్పడం అన్నిటికీ మించిన ఉత్తమమైన ట్రిక్కయ్యా భీమన్నా”

“అంటే పాఠాలకిబదులు పోసుకోలు కబుర్లు చెప్పాలనా మీ ఉద్దేశం?” భీమన్న మనసులో మాట పెదాలు దాటి మాత్రం బైటికి రాలేదు. “పెద్దలను గౌరవించవలెను” అన్న సూక్తి ఆనకట్ట లాగా అడ్డుపడింది.

“పిల్లలు గొడవ చేసేట్టున్నారని పించినప్పుడు పాఠం ఆపేసి కబుర్లలోకి దించడం ఆదోకళయ్యా”

“అంటే...ఎలాంటి కబుర్లంటారు?” అయోమయంగా అడిగాడు భీమన్న.

“నా పిండాకూడు. ఆమాత్రం గ్రహించలేకపోతే ఎలాగయ్యా....”

“గ్రహించలేకపోవడం తప్పుకాదు సర్.... తెలీనప్పుడు అడిగి తెలుసుకోకపోతేనే తప్పు”.

“అవును ... గుడ్ కొటేషన్!” అని ప్రిన్సిపాల్ కాసేపు ఆలోచించి–

“ఆఁ... ఎలాంటి కబుర్లని అడిగావ్ గదా! గారెకి మధ్యలో చిల్లి వుంటుంది. బూరెకి వుండదు ఎందుకని? ఇలాంటి ఆసక్తి గొలిపే ప్రశ్నలతో వాళ్ళని హుషారెత్తించి, మధ్యమధ్యలో పాఠం చెబుతూ, పిల్లల్ని ఉడికిస్తూ పిరియడ్ పూర్తిచేయడం నిజంగా అదోవరమయ్యా భీమన్నా”

“కో-ఎడ్యుకేషన్ సిస్టమ్‌లో.... పక్కనే అమ్మాయిల్ని పెట్టుకుని ఇలాంటి కొశ్చన్స్ వేయడం ఎంత వరకు సబబంటారు?”

“రెచ్చిపోయిన పిల్లల్ని అదుపులో పెట్టలేక పక్క క్లాసుల్ని డిస్టర్బ్ చేయడం సబబా” ప్రిన్సిపాల్ అసహనంగా కుర్చీలో కదులుతూ ప్రశ్నించారు.

“ఆ మాటకొస్తే ఇవ్వాళ నేను చెప్పిన పాఠంలోనూ మీరు కోరుకున్న శృంగారమే వుంది సర్”

“ఆఁ..... ఆఁ..... ఏమన్నావ్..... ఏదీ ఒక్కసారి వినిపించు విందాం” అంటూ కళ్ళజోడు సవరించుకుంటూ ఆసక్తిగా ముందుకి వంగి మరీ అడిగాడు ప్రిన్సిపాల్.

ఇంతవయస్సులోనూ చింత చచ్చినా పులుపు చావలేదనుకున్నాడు భీమన్న.

ఒకటికి రెండుసార్లు భీమన్న చేత ఆ పద్యం చదివించుకుని, అర్థం చెప్పించుకుని మరీ మురిసిపోయాడు ప్రిన్సిపాల్.

“చూశారా... ఈ పద్యానికి మీలోనే ఇంత స్పందన వస్తే మరి ఆ కుర్రాళ్ళలో ఇంకెంత రావాలి? అసలు ఇలాంటి పాఠాలవల్లే అనర్థం వస్తోందండీ! అసలామాటకొస్తే మన భాషలోనే ఎక్కడో ఏదో లోపముందేమోననిపిస్తుంది. ఏరాష్ట్రం వెళ్ళి చూసినా మాతృభాషని ఇలా కించపరచుకునే వాళ్ళెవరూకనిపించరు మనకి! తెలుగు భాషంటేనే అందరికీ చిన్నచూపు. పిల్లాడికి వూహ తెల్సినదగ్గర్నుంచే తల్లిదండ్రులు ఇంగ్లీషు మీడియం మీద చూపే మోజు దీనికి అంకురార్పణ” అంటూ భీమన్న ఓ అయిదు నిముషాలపాటు ఆవేశంగా అనర్గళంగా మాట్లాడి ప్రిన్సిపాల్‌చేత ఇక చాలు అనిపించుకుని స్ప్రింగ్‌డోర్ తెరుచుకొని బైటికి వచ్చాడు.

భీమన్న వెనకాలే గురవయ్య పరుగెత్తుకుంటూ వెళ్ళి– “సార్....సార్.... క్లాస్ తీసుకున్నారా సార్?” అంటూ కూపీలాగబోయాడు.

“ఆహాఁ... ఇద్దరికిద్దరం బ్రహ్మాండంగా తీసుకున్నామయ్యా. ఆయన నాకు అభ్యంగన స్నానం చేయిస్తే నేనాయనకి అర్థనగ్న స్నానం చేయించాననుకో- సరేనా...” అంటూ ముందుకి నడిచాడు.

“నాకు తెలుసు సర్. మీరు వూరుకోరని” గురవయ్య పొగిడేశాడు.

ఓ క్షణం ఆగి, చేతులు నలుపుకుంటూ, “సార్.... నా దసరామాములేం చేశారు సర్....” గొణిగినట్టే అడిగాడు.

“దసరానా! అదెప్పుడో పోయిందిగదా. ఇప్పుడు ఇక అడగడానికి నీకైనా సిగ్గుండాలి. అడిగించుకోవడానికి నాకైనా వుండాలి”

"కరెక్ట్ సర్- నేనూ అదే అనుకుంటున్నా ను"

"వచ్చే ఏడాది చూద్దాంలే"

"నేనడిగేది దాని సంగతే సర్... ఇప్పటి నుంచే మీరు మీ బామ్మగారిని అడగడానికి ట్రయ్ చేస్తే వచ్చే దసరాకన్నా సెటిల్ అవు తుందని నా వుద్దేశం సర్"

"వార్నీ అసాధ్యంకూల... నీకెంత ముందు చూపోయ్.... సరే.... అలాగే. నీ విలువైన సలహాని మనస్సులో పెట్టుకుంటాలే" నవ్వా డు భీమన్న. ఆ నవ్వు గురవయ్యకి కంపరం పుట్టించింది.

"నవ్వు చూడు నవ్వు, సిగ్గూ శరం లేకుండా, ఇన్నేళ్ళొచ్చాయి, చేసేది లెక్చరర్ వుద్యోగం! ముష్టి నాలుగు రూపాయలకి కూడా బామ్మ పర్మిషన్ అంటాడు" అని లోలోన ఉడుక్కున్నా డు గురవయ్య. పైకిమాత్రం నవ్వు పులుము కుంటూ 'ఎస్ సర్' అన్నాడు ఎంతో విన యంగా!

ఈ కాలేజీలో హేమాహేమీలైన మొండివా ళ్ళున్నారు. దసరామామూళ్ళ వ్యవహారంలో వాళ్ళు గురవయ్యని ముప్పతిప్పలు పెడతా రు. అంతమాత్రాన గురవయ్య నీరుగారిపోడు. వాళ్ళు మొండి అయితే ఇతను వీరమొండి! చెవులు పిండి మరీ వసూలు చేస్తాడు. మొద టిసారిగా గురవయ్య భీమన్న దగ్గరే దెబ్బతి న్నాడు.



కాలేజీ కుర్రాళ్ళతో క్యాంటీన్ కోలాహలంగా వుంది.

అమ్మాయిలు ఒకవైపు, అబ్బాయిలు ఒక వైపు గుంపులు గుంపులుగా చేరి కబుర్లలో ఉన్నారు.

వకుళ తన స్నేహితురాళ్ళతో కలిసి ఓ పక్కగా కూర్చుని కాఫీ తాగుతోంది. కాఫీ తాగు తూనే భీమన్న దగ్గర తన విజయం గురించి అనర్గళంగా ఓ అయిదునిముషాలపాటు ఉప న్యాసం దంచింది. కాఫీ తాగుతున్నంతసేపు మిత్రబృందానికి ఆమె ఉపన్యాసం వినసొంపు గానే అనిపించిందిగాని కాఫీ కప్పులు ఖాళీ అయ్యాక కూడా వకుళ తన వాగ్ధాటికి అడ్డుక ట్టవేయకపోవడం వాళ్ళకి నచ్చలేదు. పైపెచ్చు చిరాకేసింది. బోలెడు కోపమొచ్చింది. ఆ కోపా న్నంతా అలాగే వెళ్ళగక్కితే వకుళ ఎక్కడ నొచ్చుకుంటుందోనన్న భయం.

కొందరేమో కిమ్మనకుండా కూర్చుండిపోతే, మరికొందరేమో కోపాన్ని మరో రూపంలో వెళ్ళక క్కేందుకు మార్గాన్వేషణలో పడ్డారు. మరోవంక వకుళ లెక్చర్ కొనసాగుతూనేవుంది.

ఎలాగైతేనేం చివరికి ఓ ఫ్రెండ్ బుర్రలో అయిడియాల ఫ్యూజ్ వెలిగింది. "వకుళా... ఆపవే నీ కూతలు. బోడిపెన్ను అడిగి తీసుకో గానే సరికాదే. దమ్ముంటే ఈసారి పందెం గెలువు. అప్పుడు ఒప్పుకుంటాం"

అసలే విజయోత్సాహంతో వున్న వకుళకి ఈ మాటలు నవ్వు తెప్పించాయి. ఆ నవ్వులోనే గర్వమూ లేకపోలేదు.

"ఏమిటే ఆ నవ్వు... అంటే ఈసారి పందెం నీవల్ల కాదనా?" రెట్టించింది మరో ఫ్రెండ్. వకుళ ఆ పిల్ల నెత్తిన ఓ మొట్టికాయవేసి "అనవసరంగా నన్ను రెట్టించక ఆ పందెమే మిటో త్వరగా చెప్పిచావండి" అన్నది- మరో భారాన్ని తలకెత్తుకోవాల్సి వచ్చినందుకు కలి గిన చిరాకుతో.

"ఏమీలేదు... సింపుల్... భీమన్న మాస్టార్ని ఎలాగైనా ఒప్పించి వచ్చే ఆదివారం సినిమాకి తీసుకురాగలవా?" బాంబు పేల్చింది వకుళ ఫ్రెండ్.

తనమీద నిజంగానే బాంబు పేలినంతగా ఉలిక్కిపడింది వకుళ. ఈసారి మాస్టారినడిగి ఏ నోట్‌బుక్కో, టెక్స్ట్ బుక్కో తీసుకుర మ్మంటారనుకున్నదిగాని ఈ విధంగా ఏకంగా సినిమా అస్త్రం సంధిస్తారని మాటవరసకి





కూడా వూహించలేదు. అయినా తనలోని ఆందోళనని ఏమాత్రం బైటకి కనబడనివ్వకుండా తమాయించుకుంది. వెనక్కి తగ్గితే ఫ్రెండ్స్ ముందు పరువుతక్కువ అవుతుంది. పైగా రోజూ ఈ విషయమే లేవదీస్తూ కాకులు పొడిచినట్లు పొడుచుకు తింటారు. ఆ పరిస్థితిని తనెంతమాత్రమూ భరించనూలేదు; సహించనూలేదు.

అందుకే ఏదయితే అదవుతుందని వెంటనే పందానికి ఒప్పేసుకుంది.

పందెం షరతుల మీద రెండు వక్షాలు అంగీకారానికి రాగలిగాయి. వచ్చే ఆదివారం తెలుగుమాస్టారు భీమన్నని వకుళ మార్నింగ్ షోకి తీసుకురావాలి. మార్నింగ్‌షోకి మాత్రమే ఛాన్స్. ఆ తర్వాత మ్యాట్నీకి తెచ్చినా పందెం పోయినట్టే. వకుళ గనుక భీమన్నని ఆదివారంనాడు మార్నింగ్‌షోకి తీసుకురాగలిగితే వకుళ గెలిచినట్టు. లేకపోతే ఓడిపోయినట్టు! ఓడిపోయినవాళ్ళు గెలిచినవాళ్ళని ఏడాదిపాటు ప్రతి ఆదివారం వాళ్ళు కోరిన సినిమాకి తీసుకెళ్ళాలి. వకుళ మీద పందెం కాసిన మిత్రబృందంలో అయిదుగురున్నారు. అంటే వకుళ ఈ పందెం గెలిస్తే వాళ్ళయిదుగురూ తలోకాస్త ఖర్చు భరించి వకుళని ఏడాదిపాటు సినిమాలకి తిప్పుతారు. వకుళ ఓడిపోతే తన ఖర్చుతో వాళ్ళందర్నీ సినిమాలకి తిప్పాలి. ఒప్పందంలో సమతుల్యం లోపించిందని అనిపించిందిగాని అప్పటికే సమయం మించిపోయింది. వచ్చే ఆదివారం ఏ మార్నింగ్‌షోకి వెళ్ళాలన్నది శనివారం ఇదే టైముకి ఇక్కడే ఫిక్స్ చేస్తాం అంటూ లేచింది మిత్రబృందం.

అన్యమనస్కంగా వకుళ కూడా లేచి క్లాసుకి బయల్దేరింది.

★ ★ ★

భీమన్న ఇంటికొచ్చాడు. చొక్కా విప్పుతుంటే సడెన్‌గా గుర్తొచ్చి జేబు తడిమి చూసుకున్నాడు.

జేబులో పెన్నులేదు.

ఏమైంది... ఎక్కడ పోయింది... అప్పటికే అతనిలో ఆదుర్దా, కంగారు మొదలయ్యాయి. ఆ కంగారులోనే ఆలోచించసాగాడు... వకుళకి పెన్ ఇచ్చానన్న సంగతి చాలాసేపటిగ్గాని గుర్తుకురాలేదు. వెంటనే చటుక్కున నాలిక్కరుచుకున్నాడు. "అరెరె... అడిగి తీసుకోవడం మర్చిపోయానే" అనుకుంటూ- ఇప్పుడేమిటి చెయ్యడం ఈ క్షణాన్న బయల్దేరి కాలేజీకి వెళ్ళినా ఆ పిల్ల దొరక్కపోవచ్చు. రేపు అడిగి తీసుకోవచ్చులే అనుకున్నాడు.

రేపెళ్ళి అడిగితే మీరసలు నాకెప్పుడు పెన్ను ఇచ్చారని ప్లేట్ ఫిరాయిస్తుందేమోనన్న అనుమానమొచ్చింది. "ప్చ్... ఒరేయ్ భీమన్నా... ప్రతిదానికి ఎదుటివాళ్ళని అనుమానించడం సంకుచితమనస్తత్వానికి నిదర్శనంరా" తనని తాను సమర్థించుకున్నాడు.

చూడబోతే ఆ అమ్మాయి అలాంటి గడుసు పిండంలా ఏమాత్రం లేదు.

పెన్నులో ఇంకు అయిపోయిందని ఎంత వినయంగా చెప్పిందో గుర్తొచ్చింది. ఆ వినయశీలినుంచి సమాధానం రాబట్టేందుకు తానెంత కష్టపడిందీ కళ్ళముందు మెదిలింది. అలాంటి అమాయకపిల్లని అనుమానించడమా? ఒరేయ్... పిల్ల పంతులూ... కళ్ళుపోతాయ్‌రా అని మనసులోనే అనుకున్నాడు.

నామాదిరిగానే పాపం ఆ అమ్మాయి కూడా చివర్లో మర్చిపోయి వుంటుంది. రేపు కాలేజీ కాంపౌండ్‌లో ఎక్కడ కనిపిస్తే అక్కడ టక్కున తీసివ్వదూ... సారీ కూడా చెబుతుంది. మంచి వినయవిధేయతలున్న స్టూడెంట్‌గదా...

భీమన్న ఇలా ఆలోచిస్తూ ప్యాంటు షర్టు విప్పుతుంటే బామ్మ పాలగ్లాసుతో ఆ గదిలో కొచ్చింది.

"ఏమిట్రా... అలా వున్నావ్?" పాలగ్లాసు మనవడికి అందిస్తూనే కూపీలాగింది.

"ఏమీలేదే... ఇవ్వాళ క్లాసులో ఓ అమ్మాయి నోట్స్ రాసుకోవడానికి కలం అడిగితే ఇచ్చాను. తీరా మళ్ళా తీసుకోవడం మర్చేపోయాను" చాలా తాపీగా చెప్పాడు.

"హార్నీ... ఎవరో ముక్కూ మొహం తెలీని పిల్ల నిన్ను పెన్ను అడగడమేమిటి, వెనకా ముందూ చూడకుండా నువ్వు ఇచ్చెయ్యడమేమిటి? ఇదెక్కడి కలికాలంరా బాబూ... పోనీ ఇచ్చావే అనుకో... మళ్ళీ తీసుకోవడం మరిచిపోవడమేమిటి? అంటే నీ వస్తువులమీద

నీకింతటి అజాగ్రత్తన్నమాట...!'' రెండు చేతులూ నడుంమీద ఆనించి భీమన్న వైపు చూస్తూ దీర్ఘం తీసింది.

''ఇందులో ఏమీ లేదులేవే బామ్మా... కాలేజీల్లో ఇలాంటివి సహజం. అవసరాలన్నవి ప్రతి ఒక్కళ్ళకి వస్తుంటాయి గదా! ఇచ్చి పుచ్చుకోవడాలు, అవసరానికి ఆదుకోవడాలు లేకపోతే సంఘజీవనానికి ఇక పరమార్ధమేముంది చెప్పు...''

''ఆపెయ్... ఆపెయ్‌రా!వెధవపని చేసింది గాక పైగా బోడి సమర్ధనొకటా? నువ్వు మరచిపోయావే అనుకో... ఆ గడుగ్గాయి మాత్రం గుర్తు పెట్టుకుని తిరిగి ఇవ్వక్కర్లా... అవసరానికి అడగ్గానే ఇచ్చాడన్న కృతజ్ఞత వుండక్కర్లా''

''అబ్బబ్బ... బామ్మా... ఎందుకే... గ్లాసెడు పాలిచ్చి నన్నిలా వేపుకుతింటావ్? ఇందులో ఏముందని? రేపు తీసేసుకుంటాను గదా''

''తీసేసుకుంటావురా... తీసేసుకుంటావ్... ఆహా... ఎంత తేలిగ్గా చెప్పేశావురా... నువ్వు తీసేసుకోవడానికి ఆ పిల్ల ఇవ్వొద్దూ''

''ఇవ్వదని నువ్వు జ్యోతిష్యం చెబుతున్నావటే?''

''అవున్రా... నీ అమాయకత్వం మీద జ్యోతిష్యం చెబుతాను''

''ప్చ్... అసలీవిషయం నీ దగ్గర నోరుజారడం నాది బుద్ధితక్కువే. ఎప్పటికప్పుడు అనుకుంటూనే వుంటాను. మళ్ళా పొరపాటు చేస్తూనే వుంటాను'' పాలు తాగేసి ఖాళీ గ్లాసు టేబిల్ మీద పెట్టాడు.

ఆ గ్లాసు తీసుకుని బామ్మ వంటింట్లోకి వెళ్ళబోతూ మళ్ళా ఆగి ''ఆ పిల్ల కనిపిస్తుందేమో ఓసారి అలా కాలేజీదాకా వెళ్ళి రాకూడదూ'' అంది.

''ఇప్పుడువెళ్ళినా కనబడదులే'' అన్నాడు ముక్తసరిగా

''వస్తువుల విలువ తెలుసుకోమని నెత్తినోరూ మొత్తుకునేది ఇందుకేరా...'' మనవడివైపు కొరకొరా చూసింది. భీమన్న ఏమీ మాట్లాడలేదు. ఆమె లోనికెళ్ళిపోయింది.

'అమ్మయ్య' అనుకున్నాడు.

లుంగీ కట్టుకువచ్చి పడక కుర్చీలో మేను వాల్చాడు.

మళ్ళా వంటింట్లో నుంచి మాటలు వినిపిస్తున్నాయ్.'

'ప్చ్... బంగారంలాంటి కలం... కళ్ళ ముందు మెదులుతున్నది... రూళ్ళ కర్రలా... ఎంత హుందాగా వుండేదో...' బామ్మ తనకి తానే చెప్పుకుంటోంది.

భీమన్నకి ఇదంతా వింటుంటే తెగ చిరాగ్గా వుంది. బామ్మకి గట్టిగా చెప్పకపోతే ఈ రాత్రికి పడుకోబోయేదాకా ఆ కలం దండకం అలా ఏకధాటిన వినిపిస్తూనే వుంటుంది. మళ్ళా తెల్లవారు జామున లేచీ లేవగానే కలం స్తోత్రంతో సుప్రభాతం పాడుతుంది. ఆ కలం కొంపకి చేరేదాకా చెవుల్లో రొదచెయ్యడం ఖాయమని తేలిపోయింది. అందులో బామ్మది ఉడుంపట్టు. ఆ సంగతి భీమన్నకి బాగా తెల్సు. అందుకే విసురుగా వంటింట్లోకి వెళ్ళి గుమ్మం మీద చతికిలబడ్డాడు.

బామ్మ కందిపచ్చడి రుబ్బుతోంది. కందిపప్పు అప్పటికే బాగా మెదగడంతో కమ్మని వాసనలు ముక్కుపుటాలకి సోకుతున్నాయ్.

''పచ్చిపులుసు కూడా పెట్టవే బామ్మ...'' అన్నాడు కోపాన్ని అణుచుకుంటూ. ఈ విధంగానన్నా టాపిక్ మారుతుందేమోనని అతని ఆశ.

''నువ్వు కలం తెచ్చేదాకా పచ్చిపులుసు లేదు ఎండుపులుసూ లేదు. ఆ మాటకొస్తే అసలు ఏ పులుసూ పెట్టన్రా'' అని ఖచ్చితంగా చెప్పింది.

బామ్మ ఆ పెన్ను గురించి ఇంతగా బాధపడుతుందని తెలిస్తే ఇవ్వకనేపోదును అనుకున్నాడు. ఇచ్చినా ఆ సంగతి ఈ బామ్మకి చెప్పకనేపోదును అని కూడా అనుకున్నాడు.

''మీ తాతగారి జీవితాన్ని కడదాకా సేవించుకున్న కలంరా అది. మీ నాన్న కూడా దానితోనే పైకొచ్చాడు. మీ తాతగారు తన జీవితకాలంలో ఆ కలం తప్ప మరో కలం తాకి ఎరగరు. ఆయన పోయాక దాన్ని మీ నాన్న వాడాడు. వాళ్ళ గుర్తుగా దాన్ని ఎంతో భద్రంగా కాపాడుతూ వచ్చాను. నువ్వు ఆ కలం




సాయంతో వాళ్ళంతటివాడివి కావాలన్నది నా కోరికరా'' అని బామ్మ సెంటిమెంట్ లేవదీ సింది. దాంతో భీమన్న మూడ్ మారిపోయింది. కూల్ అయిపోయాడు.

''నిజమేనే బామ్మ... ఈసారి ఆ కలాన్ని ఇంట్లోనే వాడతాను. కాలేజీకి చచ్చినా తీసుకెళ్ళ ను - సరేనా... నీకు దానిమీద అంతగా భక్తి ప్రపత్తులు వుంటే చెప్పు. దాన్ని చక్కగా దేవుడి గదిలో గోడకి వేలాడదీసి పూలదండ వేస్తాను. నువ్వు చెయ్యమంటే దానికి రోజూ పూజలు కూడా చేస్తాను'' అన్నాడు.

'వీడు నన్ను దెప్పుతున్నాడా' అన్న అను మానవేసింది ఆమెకి. ఏదీ తేల్చుకోలేక- ఏమ నాలో అర్థంగాక మనవడి కళ్ళల్లోకి చూస్తూ వుండిపోయింది.

''నిజం బామ్మా... నేను నిజమే చెబుతు న్నా. ఆ కలం మీద నీకున్న గౌరవాన్ని కాదనడంలేదు. తాతగారి ఆస్తిగా దానిమీద నీకున్న ఆసక్తిని నేను తప్పు బట్టడంలేదు. నీ మాదిరిగానే నేనూ ఆ కలాన్ని గౌరవిస్తాను. నీ నమ్మకాన్ని వమ్ముచెయ్యడం నాకిష్టం వుండ దు'' అన్నాడు చాలా శాంతంగా. మొత్తానికి బామ్మ చల్లబడింది. భీమన్న మాటలు ఆమె మీద బాగానే పనిచేశాయి.

ఏమాటకామాటే చెప్పుకోవాలి - భీమన్నకి బామ్మంటే పిచ్చి అభిమానం. ఆమె నమ్మకా లు, ఛాదస్తాలు ఒక్కోసారి అతనికి విసుగని పిస్తాయి. ఆ క్షణంలో కొంచెం ముఖం చిట్లిస్తా డేగాని ఆ తర్వాత ఆమెకి లొంగిపోవడం అతని అలవాటు. ఇందుకు కారణం లేకపోలే దు.

తనకున్న ఏకైక పెద్దదిక్కు ఈ బామ్మేనన్న సంగతి అతని మనసులో ప్రతిక్షణం మెదులు తూనే వుంటుంది. పొత్తిళ్ళలోనే తల్లీదండ్రీ చనిపోతే ఈ బామ్మే తనని పెంచి ఇంతవాణ్ణి చేసింది. పెద్దలు సంపాదించి ఇచ్చిన కొద్దోగొ ప్పో ఆస్తిని ఇష్టమొచ్చినట్టు ఖర్చుచెయ్యకుండా మనవడి కోసమని ప్రతి పైసా పొదుపు చేస్తూ, దాన్నేమాత్రం కదిలించకుండా రాత్రింబవళ్ళు విస్తళ్ళు కుట్టి తనని చదివించి ఇంతటివాణ్ణి చేసిన బామ్మంటే భీమన్నకి ఎంతో ఆపేక్ష... ప్రేమ... అభిమానం... గౌ

రవం...

అందుకే తానేం చేయదలచుకున్నా ముందుగా బామ్మకి చెప్పి ఆమె అభిప్రాయం, ఆశీర్వాదం తీసుకోవడం అతనికి అలవాటైంది. ఒకవేళ చెప్పకుండా చేస్తే ఆ తరవాత నయినా చెప్పనిదే అతనికి నిద్రపట్టదు.

బామ్మలో నచ్చని విషయాలు చాలానే వున్నాయికానీ వాటిని అతను అంతగా పట్టించుకోక సమయానుకూలంగా రాజీపడిపోతుంటాడు.

అయితే తాను ఇంతటివాడై కాలేజీ లెక్చరర్‌గా వుద్యోగం చేస్తున్నా బామ్మ మాత్రం తన్నింకా చిన్నపిల్లాడి మాదిరిగా చూడటమే అతనికి మింగుడుపడదు. ససేమిరా నచ్చదు.

కాలేజీ నుండి రావడం పదినిముషాలు లేటయితే వెయ్యి దేవుళ్ళకి కనీసం కోటి నమస్కారాలైనా చేస్తుంది. చుట్టుపక్కల పిల్లల్ని గాలింపుకి ఉసిగొల్పుతుంది. బయటివాళ్ళకిది నవ్వు తెప్పించే తంతుగానే వుంటుంది. భీమన్నకేమో ఛాదస్తం అనిపిస్తుంది.

అయితే మనవడిమీద వున్న అంతులేని ప్రేమానురాగాలే తనచేత ఇలా చేయిస్తున్నాయన్న విషయం తన అంతరంగానికి తప్ప మరెవ్వరికీ తెలీదంటుంది బామ్మ.

ఆమెకి బోలెడు సెంటిమెంట్లున్నాయి. అవంటే భీమన్నకి చిరాకు. అయితే అప్పటికేదో చిర్రుబుర్రులాడటం మినహా మరేమీ చెయ్యడు. అతనికి నచ్చకపోయినా బామ్మ ఆదేశాల ప్రకారం ఆ సెంటిమెంట్స్‌కి అనుగుణంగా నడుచుకోవడం మినహా మరో మార్గంలేదు. ఆమె నమ్మకాలకి ఎదురుతిరిగి, ఇంత పెద్దవయస్సులో బామ్మ మనస్సు కష్టపెట్టడం అతనికి సుతారామూ ఇష్టం వుండదు.

భీమన్న లుంగీలు కట్టుకోవడం గురించి ఇద్దరి మధ్యా తరచూ గొడవ జరుగుతూ వుంటుంది. నిన్నమొన్న కాలేజీ చదువు అయిపోయేదాకా భీమన్న ఇంట్లో నిక్కర్లే వేసుకుతిరిగేవాడు. తోటి స్నేహితులంతా ఇళ్ళ దగ్గర గళ్ళ గళ్ళ లుంగీలు కట్టుకుతిరగటం చూసి అతని మనస్సు క్షోభించేది. కాని ఏం చేస్తాడు?... బామ్మ ఆదేశం...

లుంగీలు కట్టుకుంటానని భీమన్న ఎప్పుడన్నా మొరాయిస్తే శాపనార్థాలు ప్రారంభించేది.

"లుంగీలేమిటీ నీమొహం...నువ్వేమన్నా చెన్నపట్నంలో పుట్టాననుకుంటున్నావా? అడవాళ్ల చీరెకట్టుకీ మగాడి లుంగీకట్టుకీ ఏమన్నా తేడా వుందిరా అడంగి వెధవా... నిక్కర్ల వంశంరా మనది. మీ తాతయ్యని నిక్కర్లు తప్పితే మరోటి ముట్టుకోనివ్వలేదు తెల్సా. మీ నాన్న... బంగారు కొండ... మనకి లుంగీలు అచ్చిరావని ఒక్కసారి చెప్పానంతే... బతికున్నంత వరకు లుంగీల వూసెత్తి ఎరగడు. అదిరా బుద్ధిమంతుల లక్షణం" ఈ విధంగా క్లాసు తీసుకునేది బామ్మ. అందుకనుగుణంగానే పదో తరగతి. పాసయ్యాకకూడా ప్యాంట్లు కుట్టించలేదు. దాంతో ఇక గత్యంతరంలేక నిక్కర్లతోనే కాలేజీకి వెళ్లాల్సివచ్చింది. ఆ వేషంలో భీమన్నని చూసి అందరూ గేలిచేసేవారు. బామ్మకి ఎన్నో విధాలా చెప్పిచూశాడు. అయినా వినలేదామె. తాతగారి, నాన్నగారి అడుగుజాడలు తప్పితే వూరుకోనంది.

"అప్పటికీ ఇప్పటికీ కాలంమారింది. మనుమల్లోనూ వాళ్లమనస్తత్వాల్లోనూ మార్పులొస్తున్నాయ్. తాతగారు, నాన్నగారు జీవితాంతం నిక్కర్లే వేసుకున్నారూ అంటే ఇప్పటి మాదిరిగా నా మాదిరిగా వాళ్ళు కాలేజీలో చేరి ఇంతపెద్ద చదువులు చదవలేదు. కాబట్టి నడిచింది..." ఇలా బామ్మని కన్విన్స్ చేసిచేసి చివరికెలాగైతేనేం డిగ్రీకొచ్చాక అమెని ఒప్పించగలిగాడు. అవిధంగా భీమన్న ప్యాంట్ల జీవితం ప్రారంభమైంది డిగ్రీ చదువు తోబాటు!

అయితే కాలేజీకి గొట్టంప్యాంట్లతో వెళ్ళినా ఇంటిదగ్గర మాత్రం నిక్కర్ల జీవితమే మిగిలింది. ఎటొచ్చీ వుద్యోగం వచ్చాక మరికొంత మార్పు తేగలిగాడు. కాలేజీకి ప్యాంట్లు, ఇంట్లో లుంగీలవరకూ బామ్మని ఒప్పించగలిగాడు.

లుంగీలమీద బామ్మ బ్యాన్ విధించడానికి మరో కారణం కూడా ఉంది. తాతగారి పూర్వీకులెవరో మొదటిసారి లుంగీ కట్టుకోగానే గుండె ఆగి చనిపోయార్ట! అప్పటినుంచి మన వంశానికి లుంగీలు అచ్చిరావని తీర్మానించి పెద్దలు అసలీ లుంగీలనే నిషేధించారట! కానీ ఈ




మూఢనమ్మకాన్ని భీమన్న గట్టిగా ప్రతిఘటించడంతో బామ్మ ఇక లాభంలేదనుకుని వేరే కథలల్లి చెప్పసాగింది.

బామ్మ కందివచ్చడి రుబ్బడం పూర్తిచేసి రోలు కడగడం మొదలుపెట్టింది. ఆమె నోరు మూతపడిందని నిర్ధారించుకున్నాక భీమన్న వంటింటి గుమ్మంమీద నుంచి లేచి వెళ్లబోతుండగా "ఒరేయ్ నాన్నా... రెండు రోజుల నుంచి ఆ పాచిపోగు బుట్ట నీకోసం చూస్తోందిరా. చీకటిపడిందిగా. ఇంకెళ్లి ఆ వీధిచివర చెత్తకుండీలో పారబోసిరా" పని పురమాయించింది.

భీమన్న అదోలా ముఖం పెట్టాడు. బామ్మ తనకి వేసే నవాలక్ష డ్యూటీల్లో ఇదొకటి. అలాగే తనకేమాత్రం నచ్చని పనుల్లో ఇది చాలా ముఖ్యమైనది. దీనిమీదనే చాలాసార్లు ఇద్దరి మధ్యా గొడవలయ్యాయి.

"బామ్మా... చిన్నప్పటినుంచి నన్నిలా చెండుకు తింటున్నావ్‌గదే. ఇప్పుడన్నా నన్నిక ఒదలవే" అంటూ ఉద్యోగం వచ్చాక చాలాసార్లు ప్రాథేయపడ్డాడు.

"ఏరా... ఇప్పుడేమైంది నీకు... కొమ్ములేమన్నా మొలిచాయా?" అంటూ కొరకొరా చూసేది.

"కాదూ మరి. లెక్చరర్నిగదా. నన్ను ఇప్పుడు కూడా అలాగే చూస్తే ఎలాగే?" అనేవాడు దీనంగా.

"నీకిప్పుడు ఏమైనట్టు? నువ్వేమన్నా కలెక్టర్‌వి, గవర్నరువి అయ్యావనుకుంటున్నావా?"

"అంతటివాణ్ణి కాకపోవచ్చు. అంతటి గౌరవప్రదమైన వుద్యోగంలోనే వున్నానే"

"నువ్వెంత వుద్యోగంలో వుంటే ఏమిట్రా? ఈ ఆండాళ్లమ్మకి నువ్వు మనవడివే. భీమన్నవే. అంతే. ఉద్యోగాలు మనుషుల నడతని మార్చాలిగాని మనసుల్ని మార్చకూడదురా"

"అదికాదే బామ్మా. నా బాధ కొంచెం అర్థంచేసుకో. కాలేజీకెళ్లి నిత్యం కుర్రాళ్ల ముందు తలెత్తుకు తిరగాల్సినవాణ్ణి. నువ్విలా నాచేత పాచిపోగులు ఎత్తిపోయించడం, పిడకలు చేయించడంవంటి అమాంబాపతు పన్లు చేయిస్తే అవతల నా పరువేంగాను చెప్పు"

"మన పన్లు మనం చేసుకోవడం పరువుతక్కువ అన్న సన్నాసి ఎవడో నాముందుకి తీసుకురా. ఆ దవడా ఈ దవడా వాయించిపారేస్తాను."

ఇలా భీమన్న నిరసన తెలియజేయడానికి ప్రయత్నించినప్పుడల్లా బామ్మ ఎదురుదాడికి దిగేది. దాంతో భీమన్న జుట్టు పీక్కోవాల్సివచ్చేది.

"బామ్మా... నీ బాధ నేను పడలేనుగాని పనిమనిషిని పెట్టుకోవే" అని ఓసారి గట్టిగానే చెప్పాడు.

"ఎందుకురా పనిమనిషి?" అన్నది కళ్ళింత చేసి!

"ఎందుకేమిటే... ఇంట్లో కసువు చిమ్మడానికి, అంట్లు తోమడానికి... ముఖ్యంగా పాచిపోగు పారబోసిరావడానికి" అని టక్కున సమాధానమిచ్చాడు.

"ఏరా... నువ్వేమన్నా కోటీశ్వరుడివనుకుంటున్నావా? మీ తాతగారుగాని, నాన్నగారుగాని ఏనాడన్నా ఇలా అని ఎరుగుదురా?" అన్నది బుగ్గమీద వేలేసుకుని గంపెడు ఆశ్చర్యంతో.

"బామ్మా... చీటికీ మాటికీ మనిద్దరి మధ్యకీ గతాన్నెందుకే ఈడ్చుకొస్తావ్?"

"గతమన్నా నీ కళ్ళు తెరిపిస్తుందన్న భ్రమతోరా."

"గతం వద్దే- అదొక గతుకుల రోడ్డు."

"నాకైతే అది సిమెంట్ రోడ్డు."

"బామ్మా... నీకెప్పుడూ భూతకాలం తప్ప వర్తమానం గురించి పట్టదా?"

ఇలా సాగేది ఇద్దరిమధ్యా సంభాషణ.

అదనంగా పైసా ఖర్చు కావడం బామ్మకి గిట్టదు.

"రేపు నువ్వు ఒకింటివాడివయ్యాక మీరిద్దరూ అప్పుడు సుఖపడుదురుగాని... ఇప్పట్నుంచే పనిమనుషుల ఖర్చెందుకు... అప్పటిదాకా కొంచెం ఓపికపట్టు" అని మనవణ్ణి సముదాయించేది. దాంతో భీమన్న కూల్ అయిపోతాడు. అప్పటిదాకా పీక్కున్న జుట్టుని

మళ్ళీ సరిచేసుకుని పాచిపోగుబుట్ట నెత్తికెత్తుకుని [illegible]డిలా బజార్న పడేవాడు.

అలా[illegible] [illegible]న్నను చూసి 'పిచ్చి సన్నాసి' అం[illegible] [illegible] తన[illegible]నే మురిసిపోయే[illegible]

అంతగా [illegible] [illegible]మానెయ్యాలా కన్న [illegible] ఓపిక [illegible] [illegible]ందు వగా బుగా [illegible] [illegible]టికి కాళ్ళు [illegible] [illegible] గత్రా [illegible]

అ[illegible] [illegible] లు [illegible] [illegible]

[illegible] బామ్మ [illegible] [illegible] ఏమనుకుంటుందో [illegible] [illegible] అడిగాక... తన కోసం ఇన్నాళ్ళు రెక్కలు ముక్కలు చేసుకున్న బామ్మని తాను ఇప్పుడుగాక మరెప్పుడు సుఖపెడతాడు? సుఖపెట్టడమంటే ఏమిటి? బంగారు ఊయలలూగించడం... పట్టుపరుపుల మీద పడుకోబెట్టడం... వజ్ర వైఢూర్యాలు ఒంటినిండా దిగెయ్యడమేనా సుఖపెట్టడమంటే... కానేకాదు... ఎంతమాత్రం కాదు... ఇంట్లో పనిలో ఆమెకేమాత్రం సాయపడ్డా ఆమెని సుఖపెట్టినట్లే... ఇదీ భీమన్న మనస్తత్వం.

అందుకే... వాదించడానికి ఏదో వాదిస్తాడు గాని చివరికి పనిమాత్రం చేస్తాడు. ఇద్దరికీ ఇది అలవాటైపోయింది.

[illegible]మాదిరిగానే ఈసారి కూడా బామ్మతో [illegible] చివరికి పాచిపోగు పారబోసే రావడా[illegible] [illegible] బుట్ట నెత్తికెత్తుకుని బితికుబితుకు[illegible] [illegible]వచ్చాడు.



బాగా చీకటిపడిన మాట నిజమేగాని వీధికి రెండువైపులా మున్సిపాలిటీవాళ్ల ట్యూబ్‌లైట్లు వెలుగుతున్నాయి.

'ఇలాంటప్పుడే ఇవికూడా పనిచేస్తుంటాయ్' అంటూ లైట్లమీద విసుక్కున్నాడు భీమన్న.

రోడ్డంతా నిర్మానుష్యంగా వుంది. అందుకు భీమన్న మనసు కొంచెం కుదుటపడింది. ఎవరన్నా తెల్సినవాళ్లు ఎదురుపడితే కొంచెం ఇబ్బందిపడాల్సివస్తుందన్నదే అతని భయమంతా.

అయిదారు గజాలు నడిచాడో లేదో... దూరంగా ఓ అమ్మాయి వస్తున్నట్లు భీమన్న కళ్ళు పసిగట్టాయి.

కళ్ళు చికిలించి చూశాడుగాని ఆకారాన్ని స్పష్టంగా పోల్చుకోలేకపోయాడు. మరో నాలుగు గజాలు ముందుకెళ్లాడు. ఆ అమ్మాయి మరింత దగ్గరైంది.

అప్పుడు పోల్చుకోగలిగాడు.

నెత్తిన పిడుగుపడినంత పనైంది- రెండు కాళ్ళు అక్కడే ఆగిపోయాయి.

'చంపావుగదే బామ్మా' మనసులో విసుక్కున్నాడు. ఏం చేయాలో పాలుపోలేదు.

పాచిపోగుబుట్ట అక్కడికక్కడే నేలకేసి కొట్టి, మనసారా జుట్టు పీక్కుందామనిపించింది. పాచిపోగు నడిరోడ్డుమీద చిందరవందరగా పడేస్తే మున్సిపాలిటీవాళ్ళు మర్నాడు పిలిపించి గొడవచేస్తారేమోననిపించి ఆ ప్రయత్నం మానుకున్నాడు. ఆ బుట్ట నెత్తిమీదుండగా జుట్టు పీక్కోవడం అసాధ్యం. ఛీఛీ... మనిషిజన్మ ఎత్తినందుకు... అందునా ఈ బామ్మకి మనవణ్ణి అయి పుట్టినందుకు... అదీగాక తెలుగు లెక్చరర్‌గా జీవనం సాగించాల్సి వచ్చినందుకు స్వేచ్ఛే కరువైంది.

ఇలా ఆలోచిస్తూనే ఎదురుగా వస్తున్న అమ్మాయిని గుర్తుపట్టాడు.

ఆ పిల్ల మరెవరో కాదు... వకుళ.

ఆ పిల్లకంట కనబడకుండా తప్పించుకునే మార్గంకోసం భీమన్న మనస్సు జెట్ స్పీడ్‌తో పరిపరివిధాలా అన్వేషణ జరిపింది.

ఆనాడు నిండుసభలో వస్త్రాపహరణం సంఘటనలో చిక్కుకున్న ద్రౌపదికి, తనకి పెద్దగా తేడా లేదనిపించింది. అయితే ఆమె అదృష్టవంతురాలు- కృష్ణుడు ఆదుకున్నాడామె ని. అలాగే ఏ దేవుడన్నా ఏదో రూపంలో వచ్చి తనని ఇప్పుడు ఆదుకుంటే ఎంతబావుణ్ణు అనిపించింది భీమన్నకి.

ముఖం చాటుచేద్దామన్న ఆలోచనతో తలమీదనుంచి బుట్టని కుడివైపు భుజంమీదికి మార్చాడు. భుజం ఆ భారం భరించలేకపోతోంది. అయినా తప్పదు. ఆ అమ్మాయి తనని దాటి వెళ్ళేదాకా ఇలా ముఖం చాటుచేయడం మినహా మరోమార్గం లేదు. ఇప్పటికీ గండం గట్టెక్కితే ఇక జన్మలో పాచిపోగు బుట్ట జోలికి వెళ్లకూడదు. అసలు ఇంట్లో ఈ బుట్టే వుండనివ్వను. పాచిపోగుతోబాటు ఈ బుట్టని కూడా పారేయాలి- అని నిర్ణయించుకున్నాడు.

ఒక్కో అడుగువేస్తూ భీమన్న మెల్లగా నడుస్తున్నాడు. భుజంమీద బుట్ట చాటుగా క్రీగంట వకుళని గమనిస్తూనే వున్నాడు.

రోడ్డు కుడివైపు నడుచుకుంటూ వస్తున్న వకుళ వున్నట్టుండి ఎడమవైపు వచ్చింది. అది గమనించి భీమన్న గతుక్కుమన్నాడు. ఈ లెక్కన ఇద్దరూ ఎడమవైపునే క్రాస్ అవుతారు. అంటే భీమన్నని ఆమె స్పష్టంగా చూడగలుగుతుంది.

ఇది గమనించి భీమన్న వెంటనే బుట్టని ఎడమభుజంమీదికి మార్చుకుని రోడ్డుకి కుడివైపు నడిచాడు.

మరికొంత దూరం వెళ్లాక ముందుకి చూసిన భీమన్న మరోసారి గతుక్కుమన్నాడు- వకుళ కూడా రోడ్డు క్రాస్ చేసింది.

'అంటే నన్ను పసిగట్టేసిందన్నమాట' అన్న ఆలోచన రాగానే ఒళ్లంతా ఒక్కసారి ఫ్రిజ్‌లో పెట్టినట్లు చల్లగా అయిపోయింది.

వకుళ బాగా దగ్గరైంది. ఇంకా నాలుగడుగులు వేస్తే చాలు... ఒకర్నొకరు దాటిపోతారు. భీమన్న తలొంచుకుని గబగబా అంగలు వేస్తున్నాడు.

అంతలోనే 'మాస్టారూ' అన్న కేకతో భీమన్న నిలువునా జావగారిపోయాడు!





ఏదైతే జరగకూడదని భీమన్న అనుకున్నా డో అదే జరిగింది.

ఎవరైతే తనని ఫలానా అని గుర్తుపట్టకూడ దని ఆశించాడో ఆ పిల్లే తన నోటి ముత్యాలన్నీ రాలుస్తున్నంత అందంగా పిలిచి భీమన్నని ఇరకాటంలో పడేసింది.

భీమన్నకి ఇక అడుగు ముందుకుపడలేదు.

బామ్మమీద కసికొద్దీ జుట్టు పీక్కోవాలనుకు న్నాడు. అయితే రెండు చేతులూ పాచిపోగు బుట్టని గట్టిగా పట్టుకునే పనిలో కమిట్ అయి వున్నాయి. ఇక జుట్టెలా పీక్కోవాలో అర్థంకాలే దు.

ఎటూ గుట్టు రట్టయిందిగాబట్టి తట్ట కింద పెట్టి తన జుట్టు పీక్కోవడమే ఉత్తమమని పించింది. దీనివల్ల రెండు లాభాలు. జుట్టు భద్రంగా వుంటుంది. పైగా తనపని తనే చేసుకున్నట్టూ వుంటుంది... ఈ నిర్ణయానికి వచ్చీరావడంతోనే తట్ట కిందికి దింపబోయా డు. అది మరీ బరువుగా వుండటంతో వకుళ వైపు చూస్తూ ఇబ్బందిగా ముఖంపెట్టాడు.

విషయం అర్థంచేసుకున్న ఆమె సాయంప ట్టింది.

తట్ట నేలమీద పెట్టి, జుట్టు పీక్కోబోయాడు గాని ఇందాకటి ఆవేశం ఇప్పుడు తగ్గిపో యింది. ఓ అమ్మాయి తను అడిగిందే తడ వుగా తట్ట దించడానికి అందులోనూ వెధవది పాచిపోగుబుట్ట దించడానికి ఏ అభ్యంతరం చెప్పకుండా సాయపడినందుకు అతని మన స్సు అప్పటికప్పుడే ఆ వీధిలో తేలిపోయింది. ఆమెపట్ల కృతజ్ఞతాభావంతో చూశాడు.

తట్ట దించడానికి సాయమైతే చేసిందికాని ఆ మరుక్షణమే వకుళ అల్లంత దూరం జరుగుతూ ముక్కు మూసుకుంది.

"ఛీ... ఏమిటిది?" అంటూ ఛీదరించు కుంది. ఆమెకి వాంతి వచ్చినంత పనైంది.

భీమన్న ఆమెవైపు అయోమయంగా చూశా డు.

"ఇదీ... ఇదీ... మా ఇంటి పాచిపోగు" అన్నాడు అమాయకంగా.

"ముందే తెలిస్తే చెయ్యి వెయ్యకపోదును" అన్నది అసహ్యంగా చూస్తూ.

"పాచిపోగు కాకపోతే తట్టతో మరేం తీసుకె ళతాననుకున్నావ్?" మరింత అమాయకంగా అడిగాడు.

దీనికి ఆమె సమాధానమివ్వలేదు. నాలుగై దు క్షణాలు వకుళ భీమన్నవైపే వింతగా చూసింది. ఆమె తననెందుకలా గుడ్లు మిటక రించి చూస్తోందో అర్థంకాలేదు భీమన్నకి. అది తెలుసుకొనే ప్రయత్నంలో అతనుకూడా గుడ్లు మిటకరించి ఆమెనే చూస్తుండిపోయాడు. కొంచెంసేపయ్యాక ఆమె ఫక్కున నవ్వింది-

తన పరిస్థితికి జాలిపడాల్సిందిపోయి ఇలా నవ్వుతుందేమిటి ఈ పాడుపిల్ల అని గొణుక్కు న్నాడు.

"మాస్టారూ... మీరు ఈ అవతారంలో ఎంత ముద్దొస్తున్నారో..." అంది విరగబడి నవ్వుతూ.

వకుళ మాటలకి భీమన్న ముఖం కాంతితో నిండిపోయినది. "నిజంగానా...?" అన్నాడు అప్రయత్నంగా.

"అవునండీ... నెత్తిమీద ఈ తట్ట మరీ అందమిచ్చింది" అన్నది నవ్వాపకుండానే.

ఈసారి భీమన్న అయోమయంలోపడ్డాడు. ఇది పొగడ్తా... తెగడ్తా అన్న సందిగ్ధంలో అతను కొట్టుమిట్టాడుతుంటే...

"నోట్లో పూప్పీ పెట్టుకుంటే... పూప్పీ అంటే ఏమిటో తెల్సా... పాలపీకండి... అది పెట్టుకున్నారనుకోండి- ఇక మీ అందానికి ఏ లోటూ వుండదు" అన్నది.

దీంతో గ్రహించేశాడు భీమన్న- ఆ అమ్మాయి తనని ఆటపట్టిస్తోందని.

అంతలోనే అతని ముఖం చిన్నపోయింది.

ఈ పిల్లవాలకం చూస్తుంటే రేపు కాలేజీలో ఈ వ్యవహారం టాంటాం చేస్తుందేమోనన్న భయం పట్టుకుంది.

తానిలా పాచిపోగు పారవేసిరావడం ఇది మొదటిసారేమీకాదు. కాని ఎప్పుడూ ఇలా జర గలేదు. ఇది కాలేజీలో పొక్కితే ఇంకేమన్నా వుందా? అసలే తన క్లాసులో పిల్లల గొడవకి అంతేలేదు. పైగా ఈ వ్యవహారం నలుగురి చెవినాపడితే...?

భీమన్నకి ముచ్చెమటలు పోశాయి.

వకుళని కాకాపట్టడం మినహా ఈ పరిస్థితు ల్లో తాను చేయగలిగిందేమీలేదని నిర్ధారించు కున్నాక ఆమెతో మాటలు సాగించాడు.

"అవునూ... మీరిప్పుడు ఈ రోడ్డుమీద..." మీకేం పని అన్నట్టు గొణిగాడు.

"మా హాస్టల్ ఇటేనండీ. ఫ్రెండ్ ఇంటికి వెళ్ళి కొంచెం నోట్ వర్క్ మిగిలిపోతే పూర్తిచేసు కుని వస్తున్నా... రోజుకన్నా ఈ వేళ కొంచెం లేటయింది. పైగా మీ ఇల్లు ఇటేనని తెల్సి... మీ కలం కూడా ఇచ్చినట్టుంటుందని ఇల్లు వెతుక్కొంటూ వస్తున్నా. ఇంతలోనే మీరు కని పించారు"

భీమన్నకి కలం సంగతి ఇప్పుడు గుర్తొ చ్చింది... ఆ క్షణమే అతనికో ఆలోచన తట్టింది. ఆ కలాన్ని ఎరగా వేసైనాసరే ఈ పిల్ల ముందు పరువు నిలుపుకోవాలనుకున్నా డు.

"వకుళగారూ... దయచేసి ఈ విషయం మరెక్కడా పొక్కనివ్వకండి. నా పరువు గంగలో కలుస్తుంది" ప్రాధేయపడుతున్నట్టుగా అన్నా డు.

వకుళ చాలా సరదాగా, మెరిసే కళ్ళని మరింత పెద్దవిగా చేసి అతనివైపు చూస్తూ నిలబడింది.

"కావాలంటే ఆ కలం మీరే వుంచుకోండి"

"ఏమిటి... లంచమా?" అన్నది తమాషాగా నవ్వుతూ.

కాదన్నట్లు తల అడ్డంగా తిప్పాడు.

"బిచ్చమా...?"

మళ్ళీ తల అడ్డంగా వూపాడు.

"పోనీ... కానుకా...?"

అదీ కాదనట్టు తల తిప్పాడు.

"ఏదీ కాకపోతే మరెందుకు?" అంటూ బ్యాగ్‌లోనుంచి పెన్ను తీసి నేలకేసి కొట్టబోయి నంత పనిచేసింది.

భీమన్న గుండె గుభిల్లుమంది.

ఆ కలం గనక పగిలిపోతే బామ్మ తనకి కూడు పెట్టదు. కలానికి నూరేళ్ళు నిండాయని తెలిసిన మరుక్షణం బామ్మ తనని ఇంట్లోనే వుండనివ్వదు... ఖాయం. అందుకే వకుళని వారించాడు.

"పోనీ... కానుకే అనుకోండి" అంటూ గొణి గాడు.

"అనుకోవడమేమిటి మళ్ళీ మధ్యలో?"

"అబ్బే... అదేంలేదు. నిజంగా ఇది కానుకే... నూటికి నూరుపాళ్ళు కానుకే" అన్నాడు గబ గబా.

వకుళ ముఖం నవ్వుతో విప్పారింది.

భీమన్న కొంచెం కుదుటపడ్డాడు.

ఇంతలోనే అతనికి బామ్మ గుర్తొచ్చింది.

బామ్మ గడువు ప్రకారం మరి రేపు ఆవిడకి కలం చూపించాలి గదా? ఎలా... కలంలేక పోతే ఆవిడ ఏం చిందులు తొక్కుతుందో. రేపు అన్న ఆలోచన అతని మెదడుని తినసాగింది. బామ్మ సమస్య ఇంటికి పరిమితం. ఎలాగోలా భరించవచ్చు. కాని వకుళ సమస్య కాలేజీకి సంబంధించింది. తన ఉద్యోగానికి సంబంధించింది. తన పరువు ప్రతిష్ఠల సమ స్య. ఒకరకంగా ఇది తన భవిష్యత్ సమస్య. కాబట్టి ఏకోణంలో నుంచి చూసినా వకుళ సమస్యే పెద్దదనడంలో సందేహం లేదు. ఆ సమస్య పరిష్కారం కోసం ఆఫ్టరాల్ ఓ పాతకా లపు మొరటు కలాన్ని త్యాగం చెయ్యడంలో ఏమాత్రం తప్పులేదని తీర్మానించుకున్నాడు.

బ్యాగ్‌జిప్ తెరిచి వకుళ పెన్ను అందులో పెట్టుకుంది. తన స్నేహితురాళ్ళతో వేసుకున్న తాజా పందెం ఆమెకి ఆ సమయంలో గుర్తొ చ్చింది. వెంటనే ఓ ఆలోచన తట్టింది. దాన్నే ఆలోచిస్తూ భీమన్న వైపు నిశితంగా చూస్తూ నుంచుంది.

తనవైపే తదేకంగా చూస్తున్న వకుళని ఇంకా కన్విన్స్ చేసే వుద్దేశంతో మళ్ళీ ప్రాధేయ పడ్డాడు- "ప్లీజ్... ఈ విషయం ఎవ్వరికీ చెప్పరుకదూ...?" ఆ గొంతులో జాలి జాలువా రింది.

"ఎవ్వరికీ చెప్పనుగానీ మీరు అందుకు నాకు కొంత సాయంచేయాలి" అంది.

"ఏమిటో చెప్పండి" అన్నాడు అప్పటికప్పు డు చేసేస్తాను అన్నట్టుగా.

"చెబుతాను... నా కోరిక కాదనరనే నమ్మకం నాకుంది. తర్వాత చెబుతాను. ఇంకా పై





ముందిలే కాని మీరు ఇదే మాటమీద వుండాలి"

"మీ మీద ఒట్టు" అని ఆ వెంటనే నాలిక్క రుచుకుని "అహఁ... కాదు... మా బామ్మ మీద ఒట్టు..." అన్నాడు భీమన్న.

వకుళ నవ్వింది.

"వాళ్ళ మీద వీళ్ళ మీద ఒట్లు వేయడమే గాని మీమీద మాత్రం వేసుకోరన్నమాట"

"అయితే నా మీదొట్టు సరేనా...?" అన్నాడు నెత్తిన చెయ్యి బెట్టుకుంటూ-

"అన్నట్టు... మీకు బామ్మగారున్నారా?" అని అడిగింది.

"అవును. ఉంది- చూస్తారా... రండి పరిచయం చేస్తాను" అని ముందుకి సాగబోయాడు.

"మరి ఈ తట్ట?" వకుళ గుర్తుచేసింది.

ఏంచేయాలోభీమన్నకుపాలుపోలేదు.అయోమయంలో జుట్టుపీక్కోబోయాడు. అంతలోనే వకుళ వారించింది.

"ఈ మాత్రానికే జుట్టు పీక్కోవడమెందుకండీ? ఎటూ ఇక్కడిదాకా వచ్చారు గాబట్టి ఆ పాచిపోగు పారబోశాకే వెళదాం... పట్టండి... మీతోబాటూ నేనూ వస్తాను అక్కడిదాకా" అంటూ వుండగానే భీమన్న ఆ తట్టని నెత్తికెత్తుకున్నాడు. వకుళ కూడా ఓ చెయ్యేసింది. రోడ్డుమీద ఇద్దరూ వక్కవక్కనే నడుస్తున్నారు.

వకుళతో ఒప్పందం కుదుర్చుకున్న కారణంగా భీమన్న మనసిప్పుడు ప్రశాంతంగా వుంది. పైపెచ్చు ఆమె దగ్గర మొదటవున్నంత బెరుకు ఇప్పుడు అతనిలో లేదు. అందుకే మనసులో ఏ ఆలోచన లేకుండా అడుగులేస్తున్నాడు.

వకుళ మనస్సు మాత్రం చాలా సంతోషంగా వుంది. ఫ్రెండ్స్‌తో తను కాసినపందెం గుర్తొచ్చి... వచ్చే ఆదివారం తను గెలిచేసినట్లేనన్న నమ్మకంతో వుందామె. అందుకే ఆ సంతోషం! మధ్యాహ్నం వీరావేశంతో పందానికి దిగిందన్నమాటే గాని ఆ తర్వాతనుంచి మనసుమనసులో లేదు.

భీమన్నని సినిమాకి ఒప్పించడమెలాగో ఎంతగా బుర్రబద్దలు కొట్టుకున్నా ఓపట్టాన అంతుచిక్కిచావలేదు. అంతగా ఏదారీలేకుంటే పందెం విషయం చెప్పి, ప్రాధేయపడి ఆయన కాళ్ళూ, గడ్డం పట్టుకోనయినా సరే ఒప్పించి తనవెంట సినిమాకి తీసుకెళ్ళాలని తీర్మానించుకుంది.

అనుకోనివిధంగా భీమన్న ఈ వేషంలో ఈ వేళప్పుడు తన చేతికి చిక్కాడు. భీమన్న జుట్టు ఇప్పుడు తన చేతులో వుందన్నమాట!

ఆడబోయే తీర్థం ఎదురుకావడమంటే ఇదేనేమో!

దీన్ని ఎక్స్‌ప్లాయ్‌టేషన్ అనొచ్చు! బ్లాక్‌మెయిలింగ్ అనొచ్చు! ఇంకెన్ని పేర్లయినా పెట్టుకోవచ్చు. అయినా తనకేమిటి? పదిమందిలో పందెం గెలవడమే తనక్కావాలి! ఇలా ఆలోచిస్తూ నడుస్తోంది వకుళ.

రోడ్డు చివరవున్న మున్సిపాలిటీ కుండీలో పాచిపోగుపారబోసి ఇద్దరూ వెనుదిరిగారు.

మొహమాటానికిపోయి బామ్మని పరిచయం చేస్తానన్నాడేగాని భీమన్నకి ఇప్పుడు ఇదొక చిక్కుముడి అయికూర్చుంది. తీరా ఇంటికెళ్ళాక బామ్మకి ఏమని చెప్పాలా అన్న సందిగ్ధావస్థలో వడ్డాడు.

ఇంతలో ఇల్లురానే వచ్చింది. ఆమాటే అన్నాడు భీమన్న వకుళతో.

"ఇల్లు రావడమేమిటండీ... తెలుగు మాస్టారైవుండి మీ స్టూడెంట్ దగ్గర ఇలా తప్పుడు ప్రయోగాలు పలుకవచ్చునా?" అంది నవ్వుతూ.

భీమన్నకి ఆ జోకేమిటో అర్థంగాక వెర్రిగా చూశాడు.

"మీ ఇంటికి మనమే వచ్చాం. మన దగ్గరికి మీ ఇల్లు రాలేదు అవునా?" అంది వకుళ నవ్వుతూ.

"వెయ్యివరహాల విలువచేసే జోకేశావుగదే శెమ్మురాలా" అని లోలోన అనుకుని పైకి మాత్రం ఓ వెర్రినవ్వునవ్వాడు. ఆ నవ్వులో అర్థమేమిటో అంతుచిక్కక వకుళ ఆశ్చర్యంగా ముఖం పెట్టింది.

ఇద్దరూ లోనికినడిచారు.

ఆ హాల్లో ఓ మూలవున్న స్టూలు మధ్యలోకి

లాగుతూ- "కూర్చోండి... బామ్మని పిలుస్తాను" అన్నాడు.

వకుళ కూర్చుంది.

గోడలకి వేళ్లాడుతున్న రకరకాల ఫొటోల మీదికి ఆమె దృష్టి మళ్ళింది.

ఆ ఫొటోలన్నీ భీమన్నవే. చిన్నప్పటి నుంచి వయస్సులవారిగా దిగిన ఫొటోలవి. ఆరేడేళ్ళు వచ్చేవరకు ఏడాదికొకటి చొప్పున తీయించిన ఫొటోలు వరసగా వున్నాయి.

వాటిల్లో దిగంబరంగావున్న బాలభీమన్న కూడా వున్నాడు.

వకుళలేచి వాటి దగ్గరగా వెళ్ళి... ఒకటొకటే శ్రద్ధగా చూస్తూనడుస్తోంది.

భీమన్నకి ఈ పరిస్థితి ఇబ్బందిగా వుంది...

"వాటిని మీరిప్పుడు చూడకపోతే ప్రపంచమేమీ ఆగిపోదులెండి. దగ్గరికెళ్ళి ఎక్స్‌రేకళ్ళతో చూడాల్సినంత విశేషం అందులో ఏమీ లేదు" అన్నాడు అదోరకంగా ముఖంపెట్టి!

వకుళ ఘొల్లున నవ్వింది.

"చిరాకు మీకెందుకండీ బాబూ... నాకెయ్యాలి గాని!" అని మళ్ళీ నవ్వింది.

"అబ్బ... మీరెంత పెద్దగా నవ్వుతారండీ"... అది పొగడ్తలా అనిపించినా వకుళ మీద అక్కసుకొద్దీ అన్నాడామాటలు.

నిక్కరు, చొక్కాతో భీమన్న తీయించుకున్న ఫొటోలు అరడజనుదాకావున్నాయి. వాటన్నింటిని చుట్టేయడం పూర్తయింది.

ఆఖర్న వకుళకి ఓ అనుమానం వచ్చింది. దాన్ని అనుమానంగానే భీమన్న ఎదుటబైటపెట్టింది.

"అవునూ... ప్యాంటు, లుంగీల్లో పడ్డాక మీరసలు ఫొటోలు దిగలేదా?"

భీమన్న మళ్ళీ ఇబ్బందిలో పడ్డాడు.

చివరి రెండు ఫొటోలు వరసగా గత రెండేళ్ళవేనని చెప్పాడు.

వాటిల్లో కూడా నిక్కర్లతోనే వున్నాడు.

"ఎంచక్కా ప్యాంటు, ఫుల్‌షర్టు వేసుకుని ఇన్‌షర్టుతో ఫొటోదిగొచ్చు కదా" అని అడిగింది.

భీమన్న జవాబు చెప్పలేదు. దానిక్కారణం లేకపోలేదు.

వకుళ ఇందాక నవ్విన నవ్వుకి- ఎవరో వచ్చినట్టున్నారని పసిగట్టిన బామ్మ వంటింట్లో నుంచి ఆ గదిలోకొచ్చి ఏళ్ళవాలకం చూస్తూ నిలబడింది.

భీమన్న ఆమెని చాలా ఆలస్యంగా గమనించాడు. అందుకే వకుళకి జవాబివ్వలేదు.

కొంచెంసేపయ్యాక తేరుకుని బామ్మకేదో చెప్పే ప్రయత్నం చేశాడు.

ముందుగా నోరు తెరిచి మాట్లాడే అవకాశం ఎప్పుడూ బామ్మే తీసుకుంటుంది. ఈసారీ అలాగే చేసింది.

"ఎవర్రా ఈ పిల్ల?" వకుళవైపు తేరిపారజూస్తూ అడిగింది.

"నా స్టూడెంట్ బామ్మా" పొడిగా సమాధానం చెప్పి వూరుకున్నాడు.

బామ్మగొంతు విని వకుళ ఆమెవైపు తిరిగింది.

వకుళ నమస్కారం చేసింది. రెండుచేతులు జోడించి- ఎంతో వినయంగా!

"నా పేరు వకుళండీ...ఇంటర్మీడియట్ రెండో సంవత్సరం చదువుతున్నాను. మాస్టారు మా క్లాసుకి కూడా వస్తారు" అన్నది.

ఎంతో కుదురుగా, మరెంతో స్పష్టంగా, అంతకన్నా వినయంగా సమాధానమిచ్చిన వకుళ మొదటిచూపులోనే బామ్మని ఆకర్షించింది.

"అలాగా... కూర్చోమ్మా..." అంటూ మర్యాద చేసింది బామ్మ.

"ఫర్వాలేదండీ..." కూర్చోకుండానే మొహమాటం చూపింది వకుళ.

"కూర్చోమ్మా..." అంటూ ముసలావిడ బలవంతం చేసింది.

"ఏది చేసినా అంతే" అనుకున్నాడు భీమన్న.

"మీరు నిలబడితే నేను కూర్చోవడం నాకేమాత్రం మనస్కరించదండీ" వకుళ జవాబు. అది విన్న భీమన్న "ఇద్దరూ ఇద్దరే దిగ్రేట్ మాస్టర్లు" అనుకున్నాడు.

"అమ్మాయికి ఓసారి ఇల్లంతా చూ





పించరా...'' అన్న బామ్మ మాటలకి భీమన్న మధ్యలోనే బ్రేక్‌వేశాడు.

"మనింట్లో అద్దెకి వుంటానికి రాలేదే ఆ అమ్మాయి''

భీమన్నకి ఇప్పుడు వకుళ అంటే గొంతుదాకా ఉక్రోషం నిండిపోయింది.

బామ్మ ఎప్పుడన్నా తనతో ఇంత సౌమ్యంగా మాట్లాడిందా? బామ్మ నోటిగుండా అస్తమానం తిట్లు తినడమే తెలిసిన భీమన్న ఇప్పుడు బామ్మ ఆ పిల్లని ఎంతో ఆర్ద్రతతో మాట్లాడిస్తుంటే తెగ ఉడుక్కున్నాడు. పైగా తాను వకుళ చేతికి చిక్కాడేమో - ఈ ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ అతనిలో కొండంత పెరిగిపోయింది. బామ్మముందు ట్రిక్కులేస్తూ బామ్మని ఆకట్టుకుంటున్న వకుళ తిక్క కుదర్చాలనుకున్నాడు. ఆ ఉక్రోషంలో వెనకాముందూ, మంచి చెడ్డలు ఆలోచించకుండానే బామ్మకి కలం సంగతి చెప్పెయ్యాలనుకున్నాడు. అప్పుడుగాని బామ్మ ఆ పిల్లని వైనవైనంగా తిట్టదు. దాంతో రోగం కుదురుతుంది అనుకుంటూనే-

"బామ్మా...ఇవ్వాళ కాలేజీలో ఓ అమ్మాయి కలం తీసుకున్నదని చెప్పానే...'' దీర్ఘం తీస్తూ ఆగాగి చెప్పబోతున్నంతలో బామ్మే నోరువిప్పింది.

"అమ్మాయి...ఎవరో పిల్ల మావాడి కలం తీసుకుందట. కొంచెం ఇప్పించు తల్లీ. మావాడు వట్టి అర్భకుడు. నోరులేని వెధవ... నోట్లో నాలుకలేని బడుద్ధాయి, ఇచ్చినవాడు మళ్లా అడిగితీసుకోవాలని తెలియదూ...''అన్నది.

కలాన్నితనకు కానుకగా ఇస్తున్నట్టు చెప్పి, బామ్మముందు భీమన్న ఆ ప్రస్తావన ఎందుకు లేవదీశాడో ఓ పట్టాన అర్థంకాక ఆలోచనలో మునిగిపోయిన వకుళకి బామ్మ మాటలు వేసవిలో వర్షపు జల్లులా అనిపించాయి.

'ఇంకా బాగా తిట్టండి' అని మనసులోనే అనుకుంటూ భీమన్నవైపు హుషారుగా చూసింది. భీమన్నకి టెంపర్ ఎక్కిపోతున్నది.

'బామ్మ....ఇంకా తిడితే బావుణ్ణు' అనుకుంటోంది వకుళ.

ఇంతలో మళ్లీ బామ్మ గొంతు వినిపించింది:

"అయినా ఆ పిల్లకి మాత్రం బుద్ధివుండక్కర్లా... కలం అడిగితీసుకుని అంతే పోతపోవాలా? కలానికి అంత కక్కుర్తి ఎందుకు? లేకి బుద్ధులు కాకపోతే ఏమిటి చెప్పు తల్లీ'' అన్నది వకుళవైపు చూస్తూ.

వకుళ ఇబ్బందిగా ముఖంపెట్టింది. భీమన్న మనస్సు ఇప్పుడు కొంచెం ప్రశాంతమైంది.

"మావాడొక నాప. వాడు అడగడుగాని రేపు నువ్వైనా అడిగి వాడి పెన్ను వాడికి ఇప్పించు తల్లీ... నీ పుణ్యముంటుంది. రూళ్ళకర్రంత పెన్ను... కళ్ళలో మెదులుతున్నది... వాడి తాత గారిదమ్మా ఆ కలం...'' అన్నది బామ్మ.

భీమన్నకి మళ్లీ చిరాకేసింది. తాను చెప్పదలుచుకున్నదేమిటి? చివరికి జరిగిందేమిటి? ఈ పాడు బామ్మ ఎప్పుడూ ఇంతే. సొంతం చెప్పనివ్వదు; చెప్పింది వినదు అనుకున్నాడు. భీమన్న దగ్గర్నుంచి ఉదయం క్లాసులో పెన్ను అడిగితీసుకున్నది తనేననీ, క్లాసు అయిపోగానే ఇద్దామనుకుంటే పిల్లల గొడవకి తట్టుకోలేని మాస్టారు గంటమోగగానే స్పీడ్‌గా వెళ్లిపోయారనీ, ఆ కలం ఇచ్చేందుకే తానిప్పుడు ఇల్లు వెదుక్కుంటూ వచ్చానని, మాస్టారు మధ్యలో ఫాల్స్ ప్రిస్టేజికిపోయి కలాన్ని నాకు కానుకగా ఇస్తానని ఎరవేశారని అంతా బామ్మకి పూసగుచ్చినట్లు చెప్పేయాలనుకున్నది వకుళ.

కాని ఆ క్షణంలో ఆమె ఆలోచన మారింది. అందుకే ప్లేటు ఫిరాయించింది.

"సరే బామ్మగారూ... కలం తీసుకున్న అమ్మాయి నాకు తెల్సు. నా క్లోజ్ ఫ్రెండ్ కూడా... మాస్టారు ఎటూ ఆ పిల్లని కలం అడగలేర్లే. రేప్పొద్దున కాలేజీకి వెళ్లగానే ముందు ఆ వ్యవహారమే చూస్తాను. మాస్టారికి పెన్ను ఇప్పించాకే నేను క్లాసులోకి వెళతాను. ఆ పెన్ను గురించి మీరింక బెంగపడకండి సరేనా?'' అంది హామీ ఇస్తున్నట్లుగా

"నువు చాలా మంచిదానివిలాగా వున్నావు. నీ పుణ్యం ఎక్కడికీ పోదమ్మా'' అంటూ బామ్మ వంటింట్లోకి వెళ్లిపోయింది.

భీమన్నకి ఇదేమీ అంతుబట్టక వకుళవైపు వెర్రిగా చూశాడు.

ఆ వెర్రి చూపులెందుకో అర్థంకాక వకుళ అతనివైపు వింతగా చూసింది. చూస్తూనే ఏమి



టన్నట్టు కళ్ళెగరేసింది.

"ఏమిటి నువు నాటకాలు కూడా ఆడ తావా?" అన్నాడు భీమన్న.

"ఇంతవరకు ఆడలేదు. ఇప్పుడోసారి ఆడి చూస్తే ఎలా వుంటుందనిపించింది" చిలిపిగా జవాబిచ్చింది.

"ఎందుకట?"

"ఎందుకో తెలీదు. చెయ్యాలనిపించింది అంతే."

"పెన్ను నీ దగ్గరుంచుకుని అలా ఎందుకు చెప్పావ్?"

"పెన్ను నాదే. నీకు నా కానుక- అని రోడ్డుమీద పాచిపోగుబుట్టముందు నిలబడి మాటిచ్చి తీరా బామ్మచేత నాకు శాపనార్థాలు పెట్టించి తమాషా చూడాలని మీరనుకోలేదా- లేకుంటే మీ బామ్మముందు మీరసలు కలం ప్రస్తావన ఎందుకు తేవాల్సివచ్చింది?" వకుళ సీరియస్ అయింది.

భీమన్న ఏం మాట్లాడలేకపోయాడు.

బామ్మముందు కలం ప్రస్తావన తెచ్చి అనవసరంగా తొందరపడ్డానేమోననిపించింది.

ఇంతలో 'ఒరేయ్ భీమా' అంటూ లోపల్నుంచి బామ్మ కేక వినిపించింది.

"ఒక్క నిముషం. ఇప్పుడే వస్తాను" అని లోపలికి దారితీస్తుండగా-

"అహా...ఇప్పటికే లేటయింది... వెళ్తాను" అంటూ లేవబోయింది.

"ఏమిటీ... మా ఇంటికొచ్చి అదీ మొదటి సారి... కాఫీ, టిఫిన్ గట్రా తీసుకోకుండానే వెళతారా?" అని భీమన్న గడపదాటబోతుండగానే రెండు చేతుల్లో రెండు ప్లేట్లతో బామ్మ ఎదురైంది.

"ఇదుగో అమ్మాయి... ఈ నాలుగు ముక్కలూ నోట్లో వేసుకో..." అంటూ ఒక్క ప్లేటు వకుళకి అందించింది. రెండో ప్లేటు భీమన్న అందుకున్నాడు. ఆ తర్వాత బామ్మలోనికెళ్లిపోయింది.

వకుళ ఆ ప్లేటు ఓ చేత్తో పట్టుకుని దాన్నే చూస్తూ కూర్చుండిపోయింది.





"ఏమిటి...అలా చూస్తున్నారు?" అన్నాడు భీమన్న.

వకుళ తలెత్తి భీమన్నవైపు తదేకంగా చూడసాగింది.

"ఏమిటి.... ఈసారి నామొహంలోనే స్వీట్లు కనిపిస్తున్నాయా?" జోక్‌వేసి తనే నవ్వాడు.

"మీరు ఆవేశంలో ఉన్నప్పుడు ఒక రకంగా... లేనప్పుడు మరో రకంగా వుంటారు. మీ మాటల్లో ఆ తేడా స్పష్టంగా కనిపిస్తుంది" అంది వకుళ.

"అది ఎవరికైనా సహజం..." అన్నాడు చాలా తేలిగ్గా!

"అదేమీ కాదు. ఇందాక ఆవేశంగా మీరో ప్రశ్న అడిగారు గుర్తుందా. నువు నాటకాలు కూడా ఆడతావా అని! అప్పుడు 'నువ్వు' అన్న మీరే ఇప్పుడు మీరు అంటూ పిలుస్తున్నారు. దీన్ని బట్టి కోపమొస్తే మిమ్మల్ని మీరు మరిచిపోతారని అర్థమవుతోంది"

"కోపమొస్తే ఎవరైనా అంతే"

"ఆవేశంలో మీరు వెర్రివాళ్ళవుతారని కూడా తెలుస్తుంది"

"ఆవేశంలో అది సహజమే"

**"అంటే మీ ప్రవర్తనని మీరు ఒప్పుకుంటున్నట్టే.... నాదృష్టిలో అది చాలా మూర్ఖత్వం మాస్టారూ" అంది ఏమాత్రం తడబడకుండా!**

భీమన్న ఖంగు తిన్నాడు.

అప్పుడెప్పుడో ఇంటర్ క్లాసులో తన బొమ్మగీసిన సోడా బుడ్డి కళ్ళద్దాల కుర్రాడు గుర్తొచ్చాడు. అతని తప్పుని తాను అతని చేత చెప్పించిన వైనం కళ్ళముందు మెదిలింది. అప్పుడు తాను చేసినదానికి ఇప్పుడు వకుళ చేసినదానికి అట్టే తేడా కనిపించడంలేదు భీమన్నకు. తన నోటి మీదగా తన చేత తను మూర్ఖుడినని ఒప్పించింది. అమ్మ వకుళా... అనుకున్నాడు మనసులోనే.

పైకి మాత్రం టాపిక్ మారుస్తూ-

"మీకు ఈ స్వీటంటే ఇష్టమేనా?" అడిగాడు వకుళ కళ్ళలోకిచూస్తూ!

ఆ స్వీట్ ఏమిటో తెలీనట్టు ముఖంపెట్టింది వకుళ!

"ఏమిటీ... ఈ స్వీటే తెలీదా?" చాలా

ఆశ్చర్యంగా అడిగాడు.

వకుళ నుంచి సమాధానం రాలేదు.

"ఇది చాలా పాపులర్ తెలుసా? పైగా మీ ఆడవాళ్ళకి ఈ స్వీటంటే చాలా ప్రాణమంటారు."

వకుళ మాత్రం అతన్నే చూస్తూ అతను చెప్పేది వింటూంది.

"వీటిని అరిసెలంటారు. పంచదారతో, నేతితో చేస్తారు. బామ్మ ఇందులో స్పెషలిస్టు. బెల్లంతో, నూనెతో కూడా చేసుకోవచ్చు... కాకపోతే పంచదార, నేతితో చేసిన వాటిముందు అవి దిగదుడుపే" భీమన్న అనర్గళంగా చెబుతుంటే వకుళకి ఎంతో ముచ్చటేసింది.

అరిసెలు తినకుండా తనవైపే అలా చూస్తూ కూర్చున్న వకుళని ఏమిటలా చూస్తున్నారు అంటూ వాకబు చేశాడు.

"ఏదోలెండి చిలిపి ఆలోచనొకటి వచ్చింది" అంది నవ్వుతూ.

"నా క్కూడా చెప్పండి.." అన్నాడు ఆసక్తిగా!

"నిజం చెప్పనా... అబద్ధం చెప్పనా..."

"నిజమే చెప్పండి"

"మీరు నొచ్చుకోకూడదు"

అంటే అదేదో తనకు ఎసరుపెట్టే ఆలోచనేమోనన్న అనుమానం వచ్చింది. పైకి మాత్రం చాలా గంభీరంగా ముఖం పెట్టి... 'నోప్రాబ్లెమ్' అంటూ చాలా తేలిగ్గా భుజాలెగరేశాడు.

"అరిశెల శాస్త్రంలో మీకు మంచి ప్రావీణ్యత వుంది గదా! రిన్కులహరి తెలుగు లెక్చరర్ వుద్యోగం కన్నా హాయిగా అరిసెల వ్యాపారం పెడితే అందులో మీ పాత్రపోషణ ఎలా వుంటుందో ఊహిస్తున్నాను" అంది.

తన నెత్తి మీదెవరో పెద్ద సుత్తితో బాదినంతగా ఫీలయ్యాడు.

మరుక్షణమే వకుళమీద చెప్పలేనంత కోపమొచ్చింది.

అవతల వకుళేమో తన జోక్‌కి తనే విరగబడినవ్వుతోంది.

అయితే జోక్‌ని జోక్‌గానే రిసీవ్ చేసుకోగల విశాల హృదయం తనకున్నదని నిరూపించుకునే లక్ష్యంతో భీమన్న వకుళవైపు వెర్రిగా చూస్తూనే ముఖానికి బలవంతాన కళాకాంతు ల్లేని నవ్వుని పులుముకున్నాడు.

ఓపావుగంటకి బామ్మ రెండు స్టీల్ గ్లాసుల నిండా పాలు పట్టుకొచ్చింది.

అది చూసి వకుళ అదోలా ముఖం పెట్టింది. ఇందాకేమో కాఫీ అన్నాడు ఇప్పుడిదేమిటి అనుకుంది. ఆమె అవస్థ భీమన్నకి అర్థమైనట్టుంది.

"మా ఇంట్లో కాఫీ, టీలు ఉండవు. మా బామ్మ ఆరోగ్య నియమాల్లో చాలా స్ట్రిక్ట్. దయ చేసి ఏమీ అనుకోక ఈ పాలు తాగెయ్యండి" అన్నాడు.

"పాలు నాకు అలవాటు లేదండీ" ఇబ్బందిగానే చెప్పింది.

భీమన్న ఆశ్చర్యంతో ఆమె వైపు చూశాడు.

"ఏమిటి... పాలు అస్సలు అలవాటు లేదా?... అంటే చిన్నప్పుడు మీ అమ్మగారి దగ్గర కూడా..." అంటూ ఆగి పోయాడు. వకుళకి సిగ్గేసింది. తలొంచుకుని మిన్నకుండి పోయింది.

ఇప్పుడీ పాలు తాగకపోతే భీమన్న ఇంకేమేమి అప్రాచ్యపు మాటలు పేలతాడోనన్న ఆలోచన రాగానే ఆమెకి కంగారేసింది. మరుక్షణమే గ్లాసు ఎత్తిపట్టుకుని గటగటా తాగేసింది.

ఆ తర్వాత భీమన్న దగ్గర, బామ్మ దగ్గర సెలవు తీసుకుని వకుళ హాస్టల్ దారిపట్టింది. వకుళ రోడ్డు మీదికి వెళ్ళేదాకా బామ్మ కలం నంగతి గుర్తు చేస్తూనే వుంది. బామ్మ ఆ విషయం పదేపదే ప్రస్తావించడం; వకుళేమో... "మీరేమీ బెంగపెట్టుకోవద్దు. కలం నంగతి నాకొదిలేయండి. రేపీపాటికి మీ కలం మీ ఇంట్లో ఉంటుంది సరేనా" అంటూ హామీలివ్వడం భీమన్నకి మహాచికాకు తెప్పించింది.

అంటే ఈ మహాతల్లి రేపుకూడా ఇక్కడికి వూడిపడుతుందా? అయితే రేపు మాత్రం చాలా జాగ్రత్తగా వుండాలి. రేపు పాచిపోగు క్లీనింగ్ బంద్ అనుకున్నాడు...

వకుళని సాగనంపి బామ్మ లోపలికొచ్చింది.



"ఒసేవ్ పిచ్చిబామ్మా... ఆ పిల్ల నీకు మహాచక్కగా టోపీ వేసిందే. నా దగ్గర పెన్ను తీసుకున్నది ఈ ఘటికురాలే. ఇప్పుడా అమ్మాయి హ్యాండ్ బ్యాగ్‌ని సోదాచేస్తే దొరికేది. నీకు బాగా మస్కా కొట్టింది" అని నోరారా చెప్పాలనుకున్నాడు. కాని అంతలోనే వెనక్కితగ్గాడు.

నడిరోడ్డుమీద నిక్కరులో తను... తన నెత్తిన పాచిపోగుబుట్ట... ఆ పక్కనే వకుళ... ఆ సంఘటన కళ్ళముందు మెదిలింది.

బామ్మకి కలం విషయం చెప్తే... రేపు ఆ పిల్లరాగానే నాలుగు దులుపుతుంది. ఆ కోపంకొద్దీ వకుళ తన గురించి కాలేజీలో ప్రచారం చేస్తే... అమ్మో.. దొరక్క దొరక్క ఈ పిల్లకి చాలా దారుణమైన పరిస్థితుల్లో దొరికిపోయానే... అనుకుంటూ బామ్మకి చెప్పాలనుకున్న నిజాన్ని తనలోనే నొక్కేశాడు.



మర్నాడు సాయంకాలం కాలేజీ వదలగానే వకుళ సరాసరి బామ్మగారింటికి బయల్దేరింది.

అప్పటికింకా భీమన్న ఇంటికి రాలేదు.

వకుళని చూడగానే బామ్మముఖం చేటంతయింది.

"రా అమ్మాయి రా... నీకోసమే ఎదురుచూస్తున్నాను" అంటూ సాదరంగా ఆహ్వానించింది.

వకుళ గుమ్మంలోకొస్తూనే 'నమస్కారమండీ' అంటూ మర్యాదలకు సంబంధించిన సకల విధివిధానాలు పాటించింది.

"నిన్ను చూస్తూవుంటే ముచ్చటేస్తోందమ్మా... మామూలుగా అయితే ఈ వయస్సు పిల్లలకి పెద్దవాళ్లంటే ప్రేమాపేక్షలు వుండక పోగా వీసమెత్తు గౌరవమైనా వుండదని నాయీడువాళ్ళ అభిప్రాయం. ఈ కాలం కుర్రకారుని చూస్తుంటే ఇది దురభిప్రాయం కాదేమోననిపిస్తుంది. కాని నిన్ను చూస్తూవుంటే మాత్రం అందర్నీ అలా ఒకే గాడిన కట్టడం ఏం సబబు అనిపిస్తోందంటే నమ్ము. మా సన్నాసి వున్నాడు ఎందుకూ... నన్ను చూస్తే చాలు... చిర్రుబుర్రులు మొదలవుతాయ్" అన్నది బామ్మ తనదైన బాణీలోనే!

"సన్నాసి ఎవరండీ?" అంటూ కూపీలాగింది వకుళ.

"ఇంకెవరమ్మా... సన్నాసి... అంట్ల వెధవ... శుంఠ... అన్నీ నాకు వాడొక్కడే గదమ్మా..."

"భీమన్న మాస్టారా?"...

"ఆ... వాడే... ఏం మాస్టార్లేమ్మా... నోట్లో నాలుకలేని మాస్టారు. ఇంతకీ అమ్మాయీ... మా సన్నాసి పారేసుకున్న కలం సంగతి కనుక్కున్నావా?" ఆరాతీసింది బామ్మ. ఎప్పుడెప్పుడు ఆ విషయం అడుగుతుందా అని ఎదురు చూస్తున్న వకుళ వెంటనే బ్యాగ్ జిప్ తెరిచి కలం బైటికి తీసింది.

"బామ్మగారూ... మీకు నిన్న మాటిచ్చాను... ఆరు నూరైనా రేపు కలం చేతుల్లో పెడతానని! ఇదిగో ఆ మాట ప్రకారం కలం తెచ్చాను."

కలం చూడగానే బామ్మ ముఖం సంతోషంతో వెలిగిపోయింది. వకుళవైపు కృతజ్ఞతా భావంతో చూసిందామె.

"ఈ కలం సంపాదించడానికి ఎంత కష్టపడాల్సివచ్చిందో... ఆ మహాతల్లి నుంచి రాబట్టేసరికి నా తలప్రాణం తోకకొచ్చినంత పనైందనుకోండి" అన్నది వకుళ.

"అంతటి జగత్‌జెట్టీ అన్నమాట ఆ కాలాంతకురాలు" నోటిమీద వేలేసుకుని ఆశ్చర్యం వెలిబుచ్చింది బామ్మ.

"బామ్మగారూ... ఇందులో పాపం ఆ పిల్లని అనడానికేమీ లేదండీ"

"అంటే...?"

"ఏముంది... భీమన్న మాస్టారే ఈ కలాన్ని ఆ అమ్మాయికి కానుకగా ఇచ్చార్ట. అందుకని చచ్చినా ఇవ్వనని మొండికేసింది. చివరికి

బెదిరించాల్సివచ్చింది''

బామ్మకి మతిపోయినంత పనైంది.

భీమన్న తనకెప్పుడూ అబద్ధం చెప్పి ఎరగ డు. అలాంటిది ఆ పిల్ల అడిగితేనే కలం ఇచ్చానని చెప్పాడు. పైగా ఆ పిల్ల తిరిగి ఇవ్వలేదని చిన్నపిల్లాడిలా కథ చెప్పుకొచ్చాడు

భీమన్నమీద మొదటిసారిగా బామ్మకి అను మానం కలిగింది.

"ఆ పిల్లకి వీడు కానుక ఇవ్వాల్సినంత అవసరమేమొచ్చిందమ్మాయ్?''

"ఏమో బామ్మా... తెలీదు. ఆ పిల్లంటే మాస్టారికి ఇష్టమేమో...''

మనవడిమీద బామ్మకి చెప్పలేనంత కోప మొచ్చింది.

"అబద్ధాలు కూడా నేర్చుకున్నాడన్నమాట. రానీ భడవని. ఉతికి ఎండేస్తాను'' అంటూ గొణిగింది.

మాస్టారు వచ్చాక పెద్ద రభస జరగడం ఖాయమనిపించింది వకుళకి. ఎందుకైనా మంచిది. ఆలోగానే ఇక్కడినుంచి జారుకోవాల న్న ఆలోచన వచ్చింది. తొందరగా బైటపడే వుద్దేశంతో నాలుగు ముక్తాయింపు మాటలు చెప్పింది.

"బామ్మా... మాస్టారు చాలా మంచివారు. ఆయనలా చేశారంటే నాకు నమ్మశక్యంగా లేదు. ఇందులో ఏదో మెలిక వుండివుంటుంది. లేకపోతే ఆయనలా చెప్పరు. జరిగిందేదో జరి గిపోయింది. పాపం... ఇదంతా మళ్ళీ కెలికి మాస్టార్ని ఇబ్బంది పెట్టడం అంత మంచిదికా దేమో...

పెద్దదానివి.. పెద్ద మనసుతో ఆలోచించు. మన పెన్ను మనకి దొరికిందిగదా. అన్నట్టు ఇదిగో పెన్ను. తీసుకోనేలేదు'' అంటూ కలంఅందించింది. దాన్ని బామ్మ చేతులోపెట్టి అక్కడినుంచి చల్లగా జారుకునే ప్రయత్నంలో వున్న వకుళని బామ్మ మాటలు కట్టిపడేశాయి.

"అమ్మా వకుళ... నాకా అంట్లవెధవమీద నమ్మకం పోయిందమ్మా. రేపో మాపో మళ్ళీ ఈ కలం తీసుకెళ్ళి అప్పగించి ఆ రాక్షసి చేతిలో పెట్టినా పెడతాడు. నిత్యం దానికి నేనెక్కడ కాపలావుండను. అది మూడు తరాల కలమ మ్మా... నువు తీసికెళ్ళు భద్రంగా వుంచు. నీ దగ్గరే దానికి రక్షణ వుంటుందనిపిస్తోంది నాకు'' అన్నది కలం తిరిగి ఇచ్చేస్తూ.

ఇస్తూఇస్తూ కలాన్ని ఒకసారి తనివితీరా చూసుకుని, ముద్దు పెట్టుకుని మరీ ఇచ్చింది.

వకుళ మరేమీ ఆలోచించకుండా దాన్ని తీసేసుకుని బ్యాగ్‌లో వడేసుకుంది.

"బామ్మా... నాకిక టైమయింది. మళ్ళీ లేట యితే మా వార్డెన్ కరిచేస్తుంది. ఇంక వెళతా ను'' అన్నది చెప్పులు తొడుక్కుంటూ.

"అదేమిటమ్మాయ్... కుక్కలు కరుస్తయ్. పాములు కరుస్తయ్యని విన్నాంగాని మనుమ లు కరవడమేమిటి? అయినా మనిషి కాటుకి మందే లేదంటారు. ఎందుకొచ్చిన గొడవగాని పద...'' అన్నది.

వకుళ రోడ్డుమీదకి రాగానే వెనక్కి తిరిగి చూసిందోసారి. అప్పుడే భీమన్న వస్తున్నాడు. తెలుగు మాస్టారికి ఇప్పుడు లగ్గం వుందన్న మాట అని ముసిముసిగా నవ్వుకుంటూ గబ గబా ముందుకి నడుచుకుంటూ వెళ్ళిపో యింది.

భీమన్న వకుళని గమనించలేదు.

ఇంట్లో బామ్మ మనసంతా గందరగోళమైపో యింది. చిన్నప్పటి నుంచి కంటికి రెప్పలా అన్నీ తానే అయి పెంచితే ఆ భీమిగాడు ఇవ్వాళ తన దగ్గర కొన్ని నిజాలు దాస్తున్నాడ న్న విషయం ఆమెని మానసికంగా బాగా బాధపెట్టింది. ఏ చిన్న విషయమైనా తనతో చెప్పకుండా నిద్రపోయేవాడే కాదే. అలాంటిది కలం విషయంలో ఇంతగా అబద్ధం ఎందుకు ఆడినట్టు? ఎంత ఆలోచించినా అంతుచిక్క డంలేదు. ఒకవేళ ఆ అమ్మాయితో ప్రేమ, గత్రాలాంటి ఒడిదుడుకుల్లో ఏమన్నా పడ్డాడా? లేకపోతే ఆ అమ్మాయే వీణ్ణి ఆ సుడిగుండంలో కి తోసిందా? ఇదంతా తెలిస్తే ఎక్కడ కోప్పడ తానో అని భయంకొద్దీ వెర్రినాగన్న నానుంచి దాస్తున్నాడా? అయినా నా ఛాదస్తంగాని వాడు ప్రేమలో పడటమేమిటి? పెళ్ళి చేసుకోరా అని తను ఎంతగా పోరుపెట్టడంలేదు. పెళ్ళిమీద మనసుంటే గదా ప్రేమ...లాంటి అంటువ్యాధు లు దగ్గరికి చేరేది. అసలు ఆ ఆలోచనే

లేనివాడికి ఆ వ్యాధి కలలో కూడా అంటదు... ఇలా రకరకాలుగా ఆలోచిస్తూ బామ్మ వంటింటి పనిలో నిమగ్నమైపోయింది.

కొద్ది సేపటికి భీమన్న వచ్చాడు. ఆ రావడం మహా హుషారుగా వచ్చాడు. బామ్మ ఆ విషయం గమనించింది. 'వీడి వాలకం చూస్తుంటే ప్రేమలో పడ్డట్టే వుంది' అనుకుంది.

కాని భీమన్న హుషారుకి వేరే కారణంవుంది. బామ్మ జీవితాంతం తనని తిడుతూకుర్చోకుండా కలం బామ్మ చేతికొస్తున్నది గదా అన్న ఆనందంలో వున్నాడతను. అసలు ఈపాటికే వచ్చేసిందేమో!

అనుకోనివిధంగా ఇబ్బందికరమైన స్టిల్స్‌లో వకుళ ముందు దర్శనమిచ్చిన నేరానికి లంచం కింద ఆ కలాన్ని తాను ఆమెకి ధారాదత్తం చేశాడు... లంచం అదేదో అనుకుని కానుక అనిచెప్పగానే ఉబ్బితబ్బిబ్బయి తీసేసుకుంది. దాన్ని తన నోటి మీదుగా అడగలేదు. బామ్మకేం సమాధానం చెప్పాలా అని దిక్కుతోచక అయోమయంలో కొట్టుకుంటున్న తనకి వకుళ నిన్న బామ్మముందు ఆడిన నాటకం చివరికెంతో రిలీఫ్ అనిపించింది. ఆ పిల్ల సరదాకే ఆడిందో తన తిక్కకుదర్చాలనే ఆడిందోగాని చివరికి తన సమస్య మాత్రం పరిష్కారమవుతుంది అనుకున్నాడు. పైగా వకుళ తనకితానుగానే తన నోటి మీదగానే కలం ఇచ్చేస్తానని చెప్పిందిగాబట్టి ఆమెని అనుమానించాల్సిన పనిలేదు. తనని ఆ పిల్ల కాలేజీలో బ్లాక్‌మెయిల్ చేస్తుందన్న భయమూ లేదు.

ఆ హుషారులో ఇంట్లో కొచ్చీరాగానే "ఏం బామ్మ...నీ కలం నీ చేతికొచ్చిందా?" అని అడిగాడు స్టయిల్‌గా, ధీమాగా!

"ఆ...వచ్చిందిలే...సంబడం..." ముక్తసరిగా జవాబిచ్చింది తలయినా ఎత్తకుండానే!

"గుడ్...ఇచ్చినమాట నిలబెట్టుకున్నదన్నమాట. వకుళ గుడ్‌గాళ్‌లా వుందే. గదూ?" అన్నాడు చొక్కా విప్పుతూ!

బామ్మ మనస్సంతా కుతకుతా వుడుకుతోంది!

భీమన్న దగ్గర అసలీవ్యవహారాన్ని ఎలా ప్రస్తావించాలా అన్న ఆలోచనలో పడిపోయిందామె. ఒకవేళ అడిగినా నిజం చెబుతాడన్న గ్యారంటీ ఏముంది? అందుకే అనవసరంగా బైటపడి పెద్దరికాన్ని అభాసుపాలు చేసుకునే కంటే మరో నాలుగు రోజులు ఆగితే సరి! నిజం తెలిసేది నిలకడమీదగదా! అన్న నిర్ణయానికొచ్చింది.

భీమన్న ప్యాంటు, షర్టు విప్పేసి లుంగీ కట్టుకొని బామ్మదగ్గరి కొచ్చాడు.

కలం సమస్య పరిష్కారమైనందుకు అతని మనస్సంతా తేలికపడి గాలిలో విహరించసాగింది. ఈ శుభ సమయంలో బామ్మకి ఓ చిన్న సైజు క్లాసు తీసుకోవాలనిపించి వంటింటి గడపమీద కూర్చున్నాడు. తన ఆనందంలో బామ్మ మూడ్ కనిపెట్టేస్థితిలోలేడు అతను.

"నీ కలం మొత్తానికి నన్ను మహా ఇబ్బందుల్లో పడేసిందే బామ్మ" అన్నాడు తన ధోరణిలో తాను.

ఒక్కసారి భీమన్న కళ్ళల్లోకి చురచురచూసిందామె.

"ఇబ్బందులు కొని తెచ్చుకుంటే వస్తాయిరా" అంది.

"అమాటేనే నేనూ చెప్పబోయేది. అసలీ ఇబ్బందులన్నింటికీ మూలం నువ్వేనే. నువ్వు, మారని నీ ఛాదస్తాలూనూ..."

బామ్మకి అరికాలి మంట నెత్తికెక్కింది.

"పోయిన వాళ్ళుపోగా వాళ్ళ పేర్లు చెప్పి నిక్కర్లని, లాగులని ఎందుకే నన్ను వేధిస్తావ్? నిన్నటికి నిన్న పాచిపోగు ఎత్తిపోస్తూ నా స్టూడెంట్‌కి దొరికిపోయానా? ఆ పిల్ల కాలేజీలో ఎక్కడ టాంటాం చేస్తుందోనన్న హైరానాతో నానాగడ్డీ కరవాల్సివచ్చింది" అన్నాడు. కలానికీ, నిక్కర్లకీ లంకె ఏమిటో ఓ పట్టాన అర్థం కాలేదు బామ్మకి.

"అసమర్థపువెధవ. భీమన్న అని పేరు పెట్టిన నేరానికి తండ్రీ, తాతల పరువు తీస్తున్నావ్. అది చాలదన్నట్లు ప్రతిదానికీ నామీద విరుచుకుపడతావ్. సిగ్గులేకపోతే సరి" అన్నది చాలా మామూలుగా.

"అసలు ఎవరు పెట్టమన్నారే నాకా పేరు? మాట్లాడితే ప్రతిదానికీ వాళ్ళ పరువు తీశావ్-




వీళ్ళ పరువు తీశావ్ అంటావ్? ఏం తీశానని?'' రెట్టించాడు.

బామ్మ ఒక్కక్షణం అతనివైపు తృణీకార భావంతో చూసి వేరే పని మీద దొడ్లోకి వెళ్ళిపో యింది. నిష్ఠూరంగా ప్రశ్న అయితే అడిగాడు గాని బామ్మ దానికి ఏం సమాధానం చెబు తుందో అతనికి తెలీనిదేమీ కాదు. ఈ సంవాదం వాళ్ళిద్దరిమధ్య వారంపదిరోజులకో మారైనా వస్తూనే వుంటుంది. అందుకే బామ్మ జవాబుకోసం ప్రత్యేకించి ఎదురుచూడలేదు.

బామ్మకూడా 'ఎన్నిసార్లు మొరపెట్టుకున్నా ప్రయోజనం ఏముందిలే' అన్న భావంతో భీమ న్న ప్రశ్నకి సమాధానమివ్వలేదు.

భీమన్న వంటింటి గుమ్మంమీదనుంచిలేచి హాల్లోకి వెళ్ళి ఏదో పుస్తకం చూస్తూ పడుకున్నా డు. చూపు అయితే పుస్తకం మీదున్నదిగాని మనసంతా గందరగోళంగావుంది.

భీమన్నకు ఆ నామధేయం రావటం వెనక పెద్దగాథవుంది!

భీమన్న తాతగారికి అంటే బామ్మ భర్తగారి కి వేములవాడ భీమకవి అంటే మహా ఇష్టం. వేములవాడ భీమకవిలాగానే ఆండాళమ్మ భర్త గారుకూడా శాపాలశాస్త్రులుగా అప్పట్లో ప్రసిద్ధి కెక్కారు. ఆయనగారినోటికి బెదిరి ఆవూరి జనమంతా ఆయనకి అణిగిమణిగి వుండేవా రు. అందుకే ఆపేరు పెట్టించింది బామ్మ.

'అన్నమంతా సున్నం అవాలనీ... అప్పాల న్నీ కప్పలు అవుగాక అనీ దర్జాగా శపించిన వేములవాడ భీమకవి గురించీ అతని పుట్టు పూర్వోత్తరాలగురించీ తనకి చిన్నతనంలోనే కథలు కథలుగా చెప్పింది బామ్మ! ఆ భీమ కవి మాదిరిగానే తాతగారు, తండ్రిగారు వూరి నెలా గడగడలాడించిందీ ఎంతో ఆసక్తిగా వివ రించేది. మనవడుకూడా అంతపేరు ప్రఖ్యాతు లు తెచ్చుకోవాలన్నది ఆమె కోరిక. మనవడు అలా చెయ్యలేకపోతున్నాడే అన్నది ఆమెదిగు లు. పైగా నానాటికీ అధముడిలా తయారవు తున్నాడే అని ఆమె బెంగ...ఇవన్నీ ఆమె మాటల్లో పదేపదే వ్యక్తమవుతూనే వుంటాయి.

''మీ తాతగారు ఎలా వెలిగారో మన వూరె ళ్ళి ఓసారి విచారించు. చెట్లూ చేమలు, రాళ్ళూ రప్పలు, పుట్టలూ గుట్టలూ సైతం వివరిస్తాయి. నువ్వూ వున్నావు ఎందుకూ వర్థి వాజమ్మవి'' అంటుంది బామ్మ.

తాతగారి కంఠం కంచుకంఠంలా వుండే దిట. కదిలిస్తే చాలట. ఖంగుఖంగున మోగే దట! ఎక్కడికెళ్ళినా నాలుగుపద్యాలు ఆశు వుగా చదివి, తనగాన మాధుర్యంతో వాళ్లని ఆకట్టుకుని పనులు చేయించుకొచ్చేవారని బామ్మ చెబుతుంటుంది.

అందుకు భీమన్న చెప్పే సమాధానం ఒక్కటే!

''నేను పద్యాలు శ్రావ్యంగా చదవలేకపోవ చ్చు. పద్యాలు చదివి వినిపించి పన్లు చే యించుకురాలేకపోవచ్చు. అంతమాత్రాన నువు చెప్పే ప్రతిపనీ చెయ్యలేని దద్దమ్మని కాదుగదే'' అంటాడు.

''దద్దమ్మవిగాక మరేమిట్రా. మన పని మనం చేసుకోవడం తప్పా? వాళ్ళెవరో చూశా రు. మరెవరో నవ్వుతారు అని అంటున్నావంటే నిన్నేమనాలి? ఇదంతా చేతగాని తనం కాదూ? ఆమాటకొస్తే పాచిపోగు పారబోసుకోవాల్సిన అవసరం మన కెందుకొచ్చింది? వూరుగాని వూళ్ళో మన మొర ఆలకించే నాథుడు లేకపో బట్టేగదా? మీతాతగారో, నాన్నగారో బతికి వుంటే పరిస్థితి ఇలా వుండేదా?'' అంటూ భూత, వర్తమాన కాలాలని కలగలిపి క్లాస్ తీసుకుంటుంది.

తాతగారు తననోటిమీదుగా ఏది అంటే అది జరిగేదట? అని బామ్మ చెబుతుంటుంది. అందుకని ఆయన నోటికి జడిసి ఏపని చెబితే ఆ పని చేసేవాళ్ళట వూళ్ళోవాళ్ళు.

తాతల తండ్రుల కాలంలో అలా జరి గిందంటే భీమన్నకి నమ్మశక్యంగా లేదు! అందుకే అనేవాడు ''మీ ఆయన... అదే... మా తాతగారి కాలంలో మంత్రాలకు చింతకాయ లు రాలేవేమో నాకు తెలీదుగాని ఈ రోజుల్లో మాత్రం అది కుదరదు బామ్మ. నాలుగుప ద్యాలు వినిపించగానే మనపన్లు చేసిపెట్టే వెర్రి బాగులవాళ్ళు ఆరోజుల్లో వున్నారేమోగాని ఈ రోజుల్లో మాత్రం అలా ఎవరూ లేరు''

''చేత కానప్పుడు ఎన్నికబుర్లయినా చెప్పొ చ్చు. భీమన్న అని పేరు పెట్టినందుకు పెద్దల



కోరిక తీర్చాలిరా. అదీ గొప్పంటే" అంటూ వీలు చిక్కినప్పుడల్లా మనవణ్ణి దెప్పిపొడవడం బామ్మకి బాగా అలవాటైపోయింది.

భీమన్న ఈ విషయంలో మాత్రం ఆమె వాదనలని చాలా తేలిగ్గా కొట్టి పారేసేవాడు. ఏదో పాతకాలపు మనిషి. మూఢనమ్మకాలకు పెట్టిందిపేరు. పైగా వయస్సు తెచ్చే చాదస్తంకొంత! శాపాలు గట్రా అని అవిడంటే చెల్లుతుందిగాని ఆధునిక యుగంలో తోటి మనిషిని శపించే మనిషి వుంటాడని ఎవరైనా నమ్మగలరా? అనుకునేవాడు...

ఈ ఆలోచనలతో భీమన్న బుర్రంతా వేడెక్కిపోయింది. పుస్తకం పక్కనపడేసి కాసేపు కళ్ళు మూసుకుపడుకున్నాడు... అలా కళ్ళు మూశాడో లేదో...వెంటనే కునుకు పట్టేసింది.

ఆ నిద్దట్లో ఓ కల వచ్చింది. ఆ కలలో భీమన్న తాతగారు, తండ్రిగారు ఒకరి తర్వాత ఒకరు తలొక అయిదు నిముషాలు భీమన్నకి క్లాసు తీసుకున్నారు. ఇద్దరూ ముందుగా వేసుకున్న పథకం ప్రకారం తనమీద దాడికి దిగారనిపించింది' భీమన్నకి. బామ్మ తరచూ చెబుతుండే విషయాలే మొర పెట్టుకున్నారు వాళ్ళిద్దరూ భీమన్నకి.

వేములవాడ భీమకవి లాగా సాహిత్యంలో మూడుపువ్వులూ ఆరుకాయలుగా వెలుగొందుతూనే, సాహిత్యపటిమతో సంక్రమించే మహత్ శక్తిని సద్వినియోగం చేసుకుంటూ ప్రజల ముందు తమ మాదిరిగా సామర్థ్యాన్ని ప్రదర్శించుకోవాలని వారు హితబోధ చేశారు. భీమన్న అని పేరుపెట్టినందుకు సార్థకం చేసుకుని బామ్మని సంతోష పెట్టమని సలహా ఇచ్చారు.

భీమన్నకి ఎన్నెన్నో సందేహాలు... వాటిని అడుగుదామనుకుంటుండగానే బామ్మ వచ్చి నిద్రలేపింది. దాంతో వాళ్ళు అంతర్థానమయ్యారు...

"భోజనం వేళ నిద్రేమిటి... వంటయింది. భోజనానికి లే" అని చెప్పి లోనికి వెళ్ళిపోయింది బామ్మ.

భీమన్న కళ్ళు నులుముకుంటూ లేచి దొడ్లోకి వెళ్ళి కాళ్ళు, చేతులు ముఖం కడుక్కొచ్చి భోజనానికి కూర్చున్నాడు.

ఇందాకటి కల భీమన్న మనస్సులో నుంచి చెదిరిపోవటంలేదు. ఇదెక్కడి గొడవరా బాబూ... వాడెవడో కవిగాడు తన కాలంనాడు పద్యాల్తో శాపాలు పెట్టి అందర్నీ బెదిరించాడని ఆ పేరే అంటగట్టి తననూ అలా బతకమని ఇలా వాయిస్తున్నారేమిటి అనుకుంటూ అన్నం కలుపుకోసాగాడు.

అన్నం తింటూనే కలగురించి బామ్మకి చెప్పాడు...

'తాతగారూ, నాన్నగారూ ఇంతకుముందే కలలో కనిపించారే' అంటూ మొదలు పెట్టి, వాళ్ళ హితబోధ, అంతర్థానం వరకూ పూసగుచ్చినట్టు వివరించాడు.

బామ్మ చాలా పొడిగా 'వూ' కొడుతూ వుండిపోయింది.

భీమన్న ఇది గమనించాడు. తాతగారి విషయం ఎప్పుడు ప్రస్తావించినా బామ్మ ముఖంలో అనిర్వచనీయమైన ఆనందం స్పష్టంగా కనిపించేది. కాని ఇప్పుడేమిటి... ఇలా ముభావంగా వుంది అనుకున్నాడు.

"బామ్మా... ఏమిటే అలా వున్నావ్... ఒంట్లో బాగాలేదా?" అడిగాడు.

"బాగాలేకేం... దివ్యంగా వున్నానా..." చాలా మామూలుగా జవాబిచ్చింది. తనలో రేగుతున్న తుఫాను మనవడి దృష్టికి పోకూడదన్న ప్రయత్నంలో!

భీమన్న మరిక ఆ విషయాన్ని పొడిగించదలచుకోలేదు.

ఆ రాత్రి బామ్మకి నిద్రపట్టలేదు... పగలంతా మనస్సు కొంచెం ఆవేశంగా వుందేమో... రక్తపోటు ఒక్కసారిగా పెరిగింది. అర్ధరాత్రి సమయంలో గుండెనొప్పి వచ్చింది. మనవణ్ణికూడా పిలవలేని పరిస్థితి... చివరికెలాగో అతికష్టంమీద భీమన్నని నిద్రలేవ గలిగింది.

బామ్మ అవస్థచూసి భీమన్న కంగారుపడ్డాడు. బామ్మకి గతంలో ఏనాడూ తలనొప్పి అయినా వచ్చినట్లు తాను విన్లేదు. అలాంటిది ఈ వయస్సులో గుండెనొప్పా... అమ్మో... ఇక వూహించలేకపోయాడు.

అప్పటికప్పుడు ఆటోలో ఆసుపత్రికి తీసుకె





ళ్ళాడు.

రెండు మూడు రోజులు ఆసుపత్రిలో వుండా లన్నారు డాక్టర్లు.

★ ★ ★

తెల్లారి తొమ్మిదిన్నరకల్లా వకుళ ఆసుప త్రిలో ప్రత్యక్షమైంది!

కాలేజీకి వెళుతూ దార్లో తను ఇంటికెళ్ళి- ఇటు వచ్చిందనుకున్నాడు భీమన్న- ఆమె చేతిలో పుస్తకాలున్నాయి! వకుళ రావడం రావ డమే నేరుగా బామ్మదగ్గరకెళ్ళి పుస్తకాలు ఓ వక్కన పడేసి ఆమె పక్కనే కూర్చుంది.

"ఏమైంది బామ్మా..." అంటూ కళ్ళనీళ్ళ పర్యంతమైంది.

"మళ్ళీ ఆవిడచేత ఇప్పుడా ఫ్లాష్‌బ్యాక్ చెప్పించకు తల్లీ... ఆవిడ్ని రెస్ట్ తీసుకోనీ! ఇలారా... నేను చెబుతా" అన్నాడు భీమన్న అసహనంగా!

మనవడి వాలకం బామ్మకి బొత్తిగా నచ్చలే దు.

"ఓరి భడవా... పాపం... గంపెడు ఆపేక్షని గుండెల్లో మోసుకుంటూ రెక్కలు కట్టుకుని పొద్దున్నే వచ్చిన పిల్లని ఎందుకురా అలా ఆడిపోసుకుంటావ్" అన్నది సన్నగా దీర్ఘం తీస్తూ!

"మాస్టారు తప్పుగా ఏమీ అన్లేదులే బామ్మా... నిన్ను అనవసరంగా డిస్టర్బ్ చె య్యడం నాదే తొందరపాటు గదా" అంది వకుళ.

"మా తల్లే... ఎంత నిదానం... ఎంత ఓర్పు...!!" వకుళని మెచ్చుకుంది బామ్మ.

"రెస్ట్ తీసుకో బామ్మ" అని చెప్పి బెడ్‌మీద నుండి లేచి- అసలు విషయమేమిటో కను క్కుందామని భీమన్న దగ్గరికొచ్చింది వకుళ!

ఆమె తన దగ్గరికి వచ్చీ రాగానే భీమన్న తన సందేహాన్ని బయటపెట్టాడు.

"అవునూ... మేం ఇక్కడ వున్నామని నీకెలా తెల్సింది?"

"కాలేజీకి పోతూపోతూ మీ ఇంటివైపు చూ స్తే తాళంవేసి కనిపించింది. అనుమానంవేసి పక్కింటివాళ్ళనడిగాను. అప్పుడు తెలిసింది అసలు విషయం. అంతే. ఇట్నుంచి ఇటే వచ్చేశాను" అని చెప్పింది.

మళ్ళా ఓ క్షణమాగి "అసలింతకీ ఏమిటి కంప్లెయింట్?" అడిగింది.

"ఈ వయస్సులో ఏముంటుంది? హార్ట్‌ఎ టాక్!"

వకుళ గుండె ఒక్కసారిగా ఝల్లుమంది.

"ఇంత సడెన్‌గా..." అని అంటూండగానే

"హార్ట్ వ్యవహారమంతా అంతే... మహా సడెన్‌గా జరిగిపోతూ వుంటుంది"

"నిన్న సాయంత్రం కూడా చక్కగా మాట్లా డింది కదా?"

"అంటే చక్కగా మాట్లాడకుండా వుండా ల్సిందంటావా?"

"ప్చ్...చచ్చుజోక్" అని గొణిగింది.

"అవునూ... మా బామ్మకి నువు పరిచయమై ముచ్చటగా మూడురోజులైనా కాలేదు. మొద టిరోజున బామ్మగారు అంటూ మొదలుపె ట్టావ్... తీరా ఇప్పుడు బామ్మ అంటూ ఏకవచ నంలోకి దిగావ్. ఇంత క్లోజ్ ఎప్పుడయ్యావ్?" గుర్రుగా అడిగాడు.

"నిన్న సాయంత్రమే..." అంది వకుళ.

ఇంతలో బామ్మ పిలవడంతో ఇద్దరూ అటు వైపు నడిచారు.

"అమ్మాయి... నీకు కాలేజీ టైమ్ అవు తోందేమో..." అన్నది బామ్మ.

"ఇవతల నీకు ఇలా వుంటే నేను కాలేజీకి ఎలా వెళతాను బామ్మా" అన్నది దిగులుగా!

అప్పుడే నర్సువచ్చి ఇంజక్షన్ చెయ్యడానికి సిరంజీలోకి మందెక్కిస్తోంది.

"నాకోసం నువ్వెందుకమ్మా... పాఠాలు పోగొ ట్టుకోవడం... మా సన్నాసి వున్నాడుగా నాకు తోడుగా" అన్నది బామ్మ.

ఈ మాటలు విని నర్సు తలెత్తి భీమన్న వైపు ఎగాదిగా చూసింది.

భీమన్నకి చిరాకేసింది. వకుళ పక్కకి వెళ్ళి "నువ్వెళతావా... ఇక్కడే వుండి ఆమె చేత నామీద అందరిముందూ అక్షింతలు వేయి స్తుంటావా?" కోపంగా గొణిగాడు.



"బామ్మని వదిలి వెళ్ళాలని లేదు. నేనిక్కడే వుంటాను... మీరు కాలేజీకి వెళ్ళండి" అన్నది వకుళ.

"నిన్ను వెళ్ళమని బామ్మ చెబుతుంటే నువ్వు నన్ను వెళ్ళమంటావేమిటి?" వినుక్కున్నాడు.

"అది కాదండీ... నేను వెళ్ళకపోతే నష్టపోయేది నేనొక్కదాన్నే. కాని మీరు వెళితే అరవై మంది పిల్లలు లాభపడ్తారుకదా. అదీ నావుద్దేశం" చాలా వినయంగా అంది వకుళ.

"మా తల్లే... మా తల్లే... చిన్నపిల్లని చూసైనా నేర్చుకోరా సన్నాసీ..." బామ్మ వకుళ తలే నిమురుతూ అంది.

నర్సు మళ్ళీ తనవైపు ఎగాదిగా చూస్తూ ఇంజక్షన్ చెయ్యడానికి బామ్మ దగ్గరికి వెళ్ళింది. భీమన్నకి ఒళ్ళు తెగ మండిపోయింది.

బామ్మకి ఇంజక్షన్ చేయడం పూర్తిచేసి నర్సు వెళ్ళిపోతూ తలుపు దగ్గర్నుంచి వెనక్కి తిరిగి 'సన్నాసిగారు...' అంటూ కేకేసింది.

భీమన్నకి ఓ పట్టాన అర్థంకాలేదు. తలతిప్పి ఆమెవైపు వెర్రిగా చూశాడు.

"మిమ్మల్నే..." అన్నదా నర్సు.

వకుళ కిసుక్కున నవ్వింది.

"ఆయన పేరు భీమన్న సన్నాసి కాదు"

అని వకుళ నర్సుతో చెప్పింది.

"అహా... సారీ అండి... ఆ ముసలమ్మ అలాగే పిలుస్తుంటే మీ పేరు అదేననుకున్నాను" అన్నది నర్సు చాలా విచారంగా!

"మరే... నన్నాసీ, భడవ, అంట్లవెధవ... ఇవన్నీ మనుమల పేర్లుగదూ.... అందుకే పాపం నువు పొరపాటుపడ్డావ్... ఇందులో నీ తప్పేమీ లేదు తల్లీ" మనస్సులోనే కసిగా అనుకున్నాడు భీమన్న.

ఇంతకీ అసలు విషయమేమిటో చెప్పమన్నట్లు నర్సువైపు చూశాడు.

"ఓ అరగంటయ్యాక సెలైన్ బాటిల్ అరేంజ్ చేస్తాం" అని చెప్పి వెళ్లిపోయింది నర్సు.

"ఏమిటి... ఇక్కడకూడా నన్ను భ్రష్టుపట్టించాలని మీరిద్దరూ పథకమేదన్నా వేసుకున్నారా?" వకుళతో అన్నాడు భీమన్న పళ్లుపటపటలాడిస్తూ... బామ్మకి వినిపించకుండానే.

"ఏమిట్రా అంటున్నావ్... ఇందులో పెద్దగా తర్కించుకోవాల్సిందేం వుంది... ఆడపిల్ల నాకు తోడుగా వుంటుంది. నువ్వు వెళ్లరా కాలేజీకి" అన్నది బామ్మ.

భీమన్న గుండెల్లో పిడుగుపడ్డట్లయింది.

కాలేజీకా... ఇప్పుడా... పాఠం ప్రిపేర్ కాకుండానే... అమ్మో... పాఠం ప్రిపేర్ కాకుండా ముప్పావు గంటసేపు క్లాసులో ఎలా కాలక్షేపం చెయ్యడం... ఇట్లా తలవని తలంపుగా క్లాసుకెళ్లాలంటే తనలాంటి కొత్తవాడికి. నగటు లెక్చరరుకు సాధ్యమయ్యేపనేనా? భీమన్నకి ఆ సీనంతా కళ్లముందు మెదిలింది. ఏదేమైనా ఇవ్వాళ తనుమాత్రం కాలేజీకి వెళ్లలేడు... వెళ్ళినా క్లాసు తీసుకునేస్థితిలోలేడు. కాబట్టి కాలేజీకి వెళ్లకుండా వుండడమే ఉత్తమం అని నిర్ణయించుకున్నాడు. పైకిమాత్రం-

"ఏమోనే బామ్మా... నిన్నిక్కడ ఒంటరిగా ఈ పరిస్థితుల్లో వదిలేసి నేను క్లాసుకెళ్ళి పాఠం చెప్పలేను"

"చూశావా బామ్మా... నిన్ను ఒంటిరిదాని వంటున్నాడు, నేనులేనా... మాస్టారు నన్ను గుర్తించడంలేదు బామ్మా..." వకుళ పౌరుషంగా ఫిర్యాదుచేసింది.

"బామ్మ ఇలా ఆసుపత్రిలో వుంటే నేను అక్కడ శ్రద్ధగా పాఠం ఎలా చెప్పగలుగుతాను? పోతేపోనీ... రెండురోజులేగా... సెలవులు బోలెడన్ని వున్నాయ్" అన్నాడు.

మనవడికి తనమీద వున్న అభిమానానికి బామ్మలోలోనే సంబరపడింది.

'సరే నీ ఇష్టం రా' అంటూ ఇక ఆ విషయాన్ని అక్కడితో ముగించింది బామ్మ.

వకుళ అదే గదిలో ఓ పక్కగా కింద కూర్చుని నోట్‌బుక్‌లోని ఒక కాగితం చించి సెలవుచీటీ రాస్తుంటే...

ఈ మహాతల్లి ఇక్కడే క్లాస్‌రూం ఓపెన్ చేసినట్లుంది. కొంపదీసి పాఠం చెప్పమనదు గదా అనుకున్నాడు భీమన్న.

వకుళ సెలవుచీటీ రాయడంపూర్తి చేసి నోట్స్‌లోనుంచి ఇంకోకాగితం చించుకొచ్చి భీమన్న చేతికందించింది. అతనికేమీ అర్థంకాలేదు. అయోమయంగా ముఖంపెట్టాడు.

ఓ క్షణమాగి వకుళ తాపీగా చెప్పింది- "బామ్మకి సెలైన్ అరెంజ్ చేయడానికి ఇంకా పావుగంట టైమ్ వుందిగదా! ఈలోగా నేను కాలేజీకి వెళ్ళి లీవ్‌లెటర్ ఇచ్చి వస్తాను. మీరూ రాసివ్వండి. లీవ్‌పెట్టకుండా కాలేజీ ఎగ్గొట్టడం మంచిదికాదని విద్యార్థులకి చెప్పే లెక్చరర్లే ఆపని చేస్తే పిల్లలముందు విలువ వుండదు గదా! నేనెటూ నా లీవ్‌లెటర్ ఇచ్చేందుకు కాలేజీకి వెళుతున్నాను. పనిలోపనిగా మీ విలువ కాపాడతాను" అన్నది.

'అమ్మ... వకుళమ్మా... ఏం దెబ్బతీశావ్ తల్లీ' అనుకున్నాడు భీమన్న లోలోనే.

"ఒరేయ్ భీమా... కాలేజీకి వెళ్లకపోతే వెళ్లకపోయావు. అమ్మాయి చెప్పినట్టు చెయ్యరా" సలహా ఇచ్చింది బామ్మ.

చేసేదిలేక భీమన్న సెలవుచీటీ రాసి వకుళ చేతికిచ్చాడు.

కాలేజీదాకా వెళ్లొస్తానని బామ్మకిచెప్పి వకుళ అక్కడినుంచి బైటపడింది. వెళుతూవెళుతూ భీమన్నని అడిగి ఇంటి తాళాలు తీసుకెళ్లింది.

"వకుళ ఇంకా రాలేదేమిరా... రోడ్డుమీదకెళ్ళి చూసిరా... వస్తోందేమో" నంటూ అరగంటకో




సారి బామ్మ అరాతీస్తుంటే భీమన్నకి ఒళ్ళు మండుకొచ్చింది. రెండుమూడుసార్లు ఓపిక గానే సమాధానమిచ్చాడు. బామ్మ సంతృప్తి కోసం ఒకటిరెండుసార్లు బైటిగేటుదాకా వెళ్ళొచ్చాడుకూడా.

"వస్తుందిలేవే... వెళ్ళి అరగంటకూడా కాలేదుకదా"

"ఫ్రెండ్స్ ఓపట్టాన వదల్లేదేమో... వస్తుందిలే కానియ్"

"వస్తూ వస్తూ మధ్యలో మనింటికి వెళ్లి వుంటుంది. తాళం చెవులు అడిగి తీసుకెళ్లింది"

ఈ సమాధానాలతో ఆమెని సమాధాపరుస్తూ వచ్చాడు. ఓ దశలో అయితే బామ్మ బాధ భరించలేక 'అబ్బ... ఈ ముసలి ఛాదస్తంతో చచ్చిపోతున్నాను' అని తనలో తానే విసుక్కున్నాడు. మరోసారైతే 'వకుళమ్మ తల్లీ... తొందరగా వూడిపడమ్మా... నీకు వుణ్యముంటుంది' అనుకున్నాడు.

మధ్యాహ్నం ఒంటిగంట ప్రాంతంలో వకుళ వచ్చింది. వస్తూ వస్తూ క్యారేజీ తెచ్చింది. అదేమిటన్నట్టు భీమన్న ప్రశ్నార్థకంగా చూశాడు.

'మీకోసం మీల్స్ చేసి పట్టుకొచ్చాను.' అని చెప్పింది. ఈ విషయం బామ్మ దృష్టికి వెళ్లలేదు. ఉదయం వకుళ వెళ్లిన అరగంటకల్లా సెలైన్ బాటిల్ సెట్ చేశారు. బామ్మ ఓ పక్కగా ముఖంపెట్టి కళ్ళుమూసుకు పడుకుంది.

వకుళ వెళ్ళి స్టూలుమీద కూర్చోడంతో ఆ అలికిడికి బామ్మ తలతిప్పి చూసింది.

"ఇంత ఆలస్యం అయిందే తల్లీ" అని అడిగింది.

"మాస్టారుకి భోజనం చేసి పట్టుకొచ్చేసరికి ఆలస్యమైంది బామ్మా" అని చెప్పింది.

"మా తల్లే– మా కోసం నువ్వెంత శ్రమ తీసుకుంటున్నావ్ తల్లీ... నీకెంతటి ముందుచూపో" పొగిడింది బామ్మ.

ఇదే మరో సమయంలో అయితే భీమన్న ఉడుక్కునేవాడే. కాని అప్పటికే కడుపులో ఎలుకలు పరుగెడుతున్నాయ్. ఈ పూటకిక తిండి ఇంతేనంగతులు అని ఉసూరనుకుంటున్న వేళ తనకోసం క్యారేజీ తెచ్చిన వకుళ మీద అతనికి కొంచెం అభిమానం కలిగింది. అందుకే అనవసరంగా ఉడుక్కునే ప్రయత్నం చెయ్యలేదు.

వకుళ క్యారేజీ విప్పి భీమన్నకి భోజనం సిద్ధంచేసింది.

"అవక్కగా స్టూలుమీద పెట్టుకుని తినెయ్యండి– ఇప్పటికే ఆలస్యమైంది" భీమన్నకి చెప్పింది.

భీమన్న ఆత్రంగా కూర్చుని క్యారేజీ గిన్నెని ఒళ్ళోపెట్టుకుని తినబోతూ వెంటనే గుర్తొచ్చి "మరినువ్వో?" అన్నాడు వకుళవైపు చూస్తూ.

"ముందు మీరుకానివ్వండి... నాతో వంతేమిటి?" అంది.

ఓ అయిదునిమిషాల తర్వాత భీమన్న భోజనం ముగిస్తున్న దశలో వకుళ అతనిదగ్గరగా వెళ్లి-

"అరె... ఏమిటి మాస్టారూ... అన్నం, కూర, పప్పు... అన్నీ అలా మిగిల్చారేమిటి. భలేవారే... తినండి" అంటూ వడ్డించింది- బలవంతాన.

"అవన్నీ నీకోసం వుంచాను. వద్దు... నువ్వు తినాలిగా" అని భీమన్న ఎంత వారిస్తున్నా ఆమె ఆగలేదు. "భలేవారే మాస్టారూ... అవతల బామ్మతినకుండా నేనెలాతింటాను" అన్నది.

భీమన్నకి ఒక్కసారిగా కొరబోయింది. వకుళ తనచెంపమీద ఛెళ్లున కొట్టినట్టుఫీలయ్యాడు. అక్కడకి బామ్మఆరోగ్యం గురించి తనక్కొత్తె తెగబాధపడిపోతున్నట్లు, సొంత మనవడినైనా తనకు ఎలాంటి దిగులు విచారం లేనట్టు వకుళ తనని ఎత్తిపొడిచిందన్న భావన కలిగింది. దాంతో ఇంక అతనికి భోజనం చెయ్యాలనిపించలేదు.

పదినిమిషాల తర్వాత- "అమ్మాయీ.. నువ్వు భోజనం చేశావా" అంటూ బామ్మ వాకబుచేసింది. "ఆహా... సుష్టుగా లాగించాను బామ్మా" భీమన్నవైపు చూస్తూ బదులిచ్చింది వకుళ.

భీమన్న మళ్ళీ గతుక్కుమన్నాడు.



"ఏరా భీమా... అమ్మాయి నిజంగా భోజనం చేసిందా?" మనవణ్ణి ఆరాతీసింది.

"ఎకాడికి అమ్మాయిగురించి ఆరాతియ్యడ మేగాని నా గురించి అడగవేమే" అన్నాడు ఉక్రోషంతో.

"పిచ్చి నన్నాసి... నీగురించి ఆ పిల్ల పట్టించుకుంటున్నదిగదరా. ఎటొచ్చీ నువ్వే ఆ పిల్లని పట్టించుకోవు" అన్నది బామ్మ.

★ ★ ★

రెండు రోజుల తర్వాత బామ్మగారిని ఆసుపత్రినుంచి డిశ్చార్జి చేశారు. ఆసుపత్రినుంచి బైటపడ్డారన్నమాటేగాని భీమన్న మనసంతా పుట్టెడు దిగులుతో నిండిపోయింది. డాక్టరు చెప్పినమాటలే పదేపదే గుర్తొస్తున్నాయి.

బామ్మకి డయాబెటీస్ , షుగర్, బి.పి అన్నీ హెచ్చుమోతాదులోనే వున్నాయట! చాలా జాగ్రత్తగా చూసుకోవాలని చెప్పాడు. ఆహారం విషయంలో మరీ శ్రద్ధ అవసరమని హెచ్చరించాడు. రక్తపోటు రాకుండా జాగ్రత్తపడాలని మరీ మరీ చెప్పాడు.

తన చిన్నతనం నుంచీ చూస్తున్నాడు భీమన్న - బామ్మ కనీసం తలనొప్పి అని కూడా తన నోటిమీదగా అని ఎరగదు! నిన్నమొన్నటిదాకా విసుగూ విరామమన్నది లేకుండా ఎంత హుషారుగా పనంతా తానే చక్కబెట్టుకునేది! వంట చేసినంతసేపూ మడిపేరుతో ఒంటిమీద బట్ట ఆరిపోకుండా అరగంటకోమారు బావిదగ్గర కెళ్ళి రెండు బక్కెట్ల నీళ్ళు కుమ్మరించుకొచ్చేది. కనీసం ముక్కుకి పడిసెమన్నా పట్టి ఎరగదు. పిప్పళ్ళ బస్తాలా వుంటావని తానెన్నిసార్లు అపహాస్యం చెయ్యలేదు! అలాంటి బామ్మ ఒంట్లో ఇన్నాళ్ళుగా ఇన్ని రోగాలు పెరుగుతూ వచ్చాయన్నమాట!

భీమన్న బాగా అప్‌సెట్ అయ్యాడు.

ఈ రోగాలన్నీ తనకొచ్చినా ఎంత బావుండేది. ఈ ముసలివయస్సులో బామ్మ వాటితో బాధపడాల్సిందేనా...

ఆసుపత్రిలో వున్న రెండురోజులు వకుళ కాలేజీకి పోలేదు. పగలంతా బామ్మగారికి సపర్యలు చేసేది. వంట చేసుకొచ్చి ఇద్దరికీ పెట్టి, తానూ తినేది. సాయంకాలం మళ్ళీ వంట చేసి ఆసుపత్రికి తీసుకెళ్ళేది. కాలేజీ వదిలే వేళకి హాస్టల్‌కెళ్ళేది. అసలైతే రాత్రిళ్ళు కూడా అక్కడే వుండిపోవాలనిపించేది. కాని హాస్టల్ వార్డెన్ కొరివిదయ్యంలా పట్టుకు పీడిస్తుందన్న భయం కొద్దీ తప్పక వెళ్ళేది.

బామ్మ ఆసుపత్రినుంచి విడుదలై వచ్చే రోజున ఉదయాన్నే వకుళ బామ్మగారింటికెళ్ళి ఇల్లంతా నీట్‌గా సర్దింది. ముందుగదిలో నులకమంచంవేసి, పరుపువేసి, దానిమీద బెడ్ షీట్ పరిచింది.

మడి బట్టలతో వంట చేసింది.

బామ్మని భీమన్న రిక్షాలో ఇంటికి తీసుకొచ్చాడు.

ఇంటిముందు ఆమె రిక్షా దిగేసరికి చేతిలో ఎర్రనీళ్ళ చెంబుతో వకుళ ఎదురొచ్చింది. బామ్మని మెట్లదగ్గరే నిలబెట్టి ఎర్రనీళ్ళు దిష్టి తీసింది.

'ఇక్కడ కూడా సెంటిమెంట్ మీద దెబ్బ కొట్టావా... కొట్టు నీ ఇష్టం' అనుకున్నాడు భీమన్న.

ఆ తర్వాత భీమన్న వకుళ బామ్మని చెరొక రెక్క పట్టుకుని మెల్లగా నడిపించారు. "బామ్మా... మెల్లిగానే... అడుగు అలా గట్టిగా వెయ్యకు..." అంటూ భీమన్న తెగ ఆందోళన పడిపోయాడు.

ఒకవైపు వకుళ, మరోవైపు భీమన్న తన నిలా చావుకి దగ్గరైన రోగిష్టిదానిమాదిరిగా పట్టుకు నడిపిస్తుంటే బామ్మకి చాలా ఇబ్బందనిపించింది... కుర్రకుంకలు... తనమీద వున్న అభిమానంకొద్దీ ఇలా చేస్తున్నారు అని సరిపెట్టుకుంది... అయితే అడుగు మెల్లగా వెయ్యి, కాలు కొంచెం కొంచెంగా ఎత్తు... అంటు కుర్రకుంక తనకి పాఠాలు చెబుతుంటే ఆమెకి చిరాకేసింది. అందుకే టక్కున జవాబిచ్చింది. "అసలు నేను అడుగే వెయ్యట్రా... ఏం చేస్తావ్" అంటూ నిలబడిపోయింది. "అదికాదే బామ్మా... నీమంచి కోసమేనే..." బతిమిలాడుతున్నట్టు చెప్పాడు భీమన్న. "ఏమిట్రా భడవా... నామంచి నాకు తెల్సులేరా... గుడ్డొచ్చి పిల్లని వెక్కిరించినట్టు... అడుగు తీసి అడుగు వెయ్యడం కూడా నాకు చేతకాదనా..." అన్నది





బామ్మ. "చేతకాకపోతే అడుగెయ్యమని ఎందుకు చెబుతారు బామ్మా... ఆయనే పాపం పట్టుకుని అడుగేయించేవారు కదా" వకుళ అంది నవ్వుతూ!

"నువ్వేమిటి? ఆవిడకి సపోర్టా?" గుర్రుగా చూశాడు భీమన్న.

"ప్రస్తుతం మనిద్దరం సపోర్టేగదా" మళ్ళీ నవ్వింది.

బామ్మ కదలకుండా నిలబడిపోయేసరికి భీమన్న అన్నాడు- "సరే... నీ ఇష్టమొచ్చినట్టు నడవ్వే"

"ఏరా.. నేనెలా కనిపిస్తున్నాను నీ కళ్ళకి. ఇష్టమొచ్చినట్టు నడు... అంటే ఏమిటి అర్థం?"

"అబ్బ... నా వుద్దేశం అది కాదే" భీమన్న తలపట్టుకున్నాడు.

"ఇంతసేపు నిలబడకే. కదలకుండా ఇలా ఒకేచోట ఇంతసేపు నిలబడితే రక్తమంతా కాళ్ళలోకి చేరి కాళ్ళు వాస్తాయి తెల్సా?" ఆందోళనగా అన్నాడు బామ్మతో.

ఈ మాటలకి వకుళ పగలబడి నవ్వింది.

"తెలిసీ తెలీని వాగుడు వాగకురా. ఎవరైనా వింటే నవ్విపోతారు నీ తెలివికి. నువ్వు మాత్రం ఇంకా బిగ్గరగా నవ్వమ్మా" అన్నది బామ్మ.

భీమన్న ఓ పక్కకి వంగి వకుళతో మెల్లిగా అన్నాడు– "నువ్వేం నవ్వక్కర్లేదు. అట్లాగన్నా బామ్మ ముందుకి కదులుతుందని అలా చెప్పాను"

"బామ్మా... లోనికెళదామా?" అన్నది వకుళ.

"మీరిద్దరూ నాచేతులు వదులుతారా లేదా?"

"నేను మాత్రం వదలను" అన్నాడు భీమన్న.

ఒక్క విదిలింపుతో రెండు చేతులూ విడిపించుకుంది బామ్మ.

"ఇందాకట్నుంచి చూస్తున్నాను... ఏదో ముసలి వయస్సులో కొద్దిగా నుస్తీ చేస్తే చేసిందేమో... దానికి మీరింత రాద్ధాంతం చేస్తారా? నేనేదో ఇప్పుడో ఇంకాసేపటికో కాటికి వెళ్ళిపోతున్నట్టు ఏమిటీ పైత్యం మీకు?" అని విసురుగా లోనికెళ్ళింది.

వకుళ, భీమన్న ఒకరి ముఖాలొకరు చూసుకుంటూ బామ్మ వెనకాలే లోపలికి పరుగుపెట్టారు.

బామ్మ లోనికెళ్ళి వెళ్ళగానే ముందు గదిలో మంచం కనిపించింది. దానిమీద చక్కగా పక్కవేసి వుండటం చూసిందామె.

"ఎవరి పని ఇది?" అంటూ గుడ్లురిమింది.

వాస్తవానికి భీమన్న కూడా విస్తుబోయాడు. ఈ రెండు రోజుల నుంచీ అతను ఇంటి ఛాయలకే రాలేదు. ఇల్లంతా ఇంతెత్తున గందరగోళంగా వుండాల్సినమాట! కాని చాలా చక్కగా, మరెంతో పరిశుభ్రంగా వుంది.

"ఫర్వాలేదు– పనిగత్తె ఏకున్నాడు" వకుళ వైపు చూస్తూ!

బామ్మ ప్రశ్నకు వకుళ జవాబిచ్చింది.

"నేనే బామ్మా... బాగా రెస్ట్ అవసరమని డాక్టరుగారు చెప్పారు గదా! అందులోనూ రెండురోజుల్నుంచి సరిగా భోజనమేలేదాయే... నీరసంగా వుంటుందిగదా. ఇంటికిరాగానే ముందు కాసేపు నడుంవాల్చి రెస్ట్ తీసుకుంటావని నేనే పక్క సిద్ధం చేశాను" వినయంగా, వివరంగా చెప్పింది.

భీమన్న అయితే ఇదే విషయాన్ని మరోరకంగా చెప్పివుండేవాడు. "అవును ... నేనే వేశాను. నువు ఇంట్లో ఇదివరకటిలాగా తిరగడానికి వీల్లేదు. ఇల్లంతా చుట్టబెడతానంటే కుదరదు. మంచం మీద నుంచి దిగనే దిగకూడదు. పడుకో ...నువ్వెప్పుడూ అలాగే పడుకుని వుండాలి - అందుకోసమే ఈ పక్క" అనేవాడు.

బామ్మకి అప్పుడు కోపం వచ్చేది.

"నేనేమన్నా రోగిష్టిదాన్నా పగలూ రాత్రి మంచానికి అతుక్కుపోయి వుండేందుకు. నసేమిరా వీల్లేదు. పిప్పళ్ళబస్తాలా వున్నాను. నాకే రోగమూలేదు. మంచంమీద పడుకుని లేని రోగాలు తెప్పించుకోలేను" అంటూ అప్పటికప్పుడు పక్కతీసేసి మంచం ఎత్తేసేది.

కాని వకుళ ఇదే విషయాన్ని మరింత కన్విన్సింగ్‌గా చెప్పడంతో బామ్మకి ఆ పిల్లమీద

మరింత గురికుదిరింది. చిన్నపిల్లయినా ఒక పద్ధతిలో మాట్లాడుతుందని మరోమారు అనుకుంది మనసులో.

వకుళ చెప్పింది కూడా నిజమేననిపించింది. అందుకే ఆ పిల్ల మాటల్ని కాదనలేకపోయింది. "కానివ్... చిన్నపిల్ల ఎందుకు చెప్పిందో చెప్పింది... ఎందుకు కాదనాలి... కాసేపు సర్దుంవాలిస్తే సరి..." అనుకుని వెళ్ళి మంచం మీదపడుకుంది.

భీమన్న తేలిగ్గా ఊపిరిపీల్చుకున్నాడు.

ఆ తర్వాత వకుళ వంటింట్లోకి వెళ్ళింది.

అయిదు నిమిషాల తర్వాత రెండుగ్లాసుల నిండా పాలు తెచ్చింది.

"బామ్మా! పాలుతాగు" అంటూ ఒక గ్లాసు బామ్మకిచ్చి రెండోగ్లాసు భీమన్నకి అందించింది.

"పాలు ఎవరు తీసుకున్నారమ్మా" అడిగింది బామ్మ.

"ఇవాళ నేను పొద్దున్నే వచ్చాను బామ్మా" వకుళ జవాబిచ్చింది.

టైమ్ దాదాపు పదిగంటలు కావస్తూండగా

"బామ్మా... కాలేజీకి టైమయింది. వెళ్ళొస్తాను. ఇవ్వాళ శనివారమే. ఒంటిపూట కాలేజీ. ఒంటిగంటకల్లా వచ్చేస్తాను" అంటూ బామ్మకి చెప్పి బయల్దేరింది. గుమ్మంలో వున్న భీమన్నని చూస్తూ-

"మీరివ్వాళ కాలేజీకి వస్తున్నారా?" అడిగింది.

"రావట్లేదు" టక్కున బదులిచ్చాడు.

"ఏం... ఎందుకని?" వకుళ అడిగింది. మళ్ళా ఇవ్వాళ కూడా పాఠం ప్రిపేర్‌కాలేదని చెప్పబోయి అంతలోనే తమాయించుకున్నాడు.

"బామ్మ ఒక్కత్తినే వదిలేసి ఎలారాను?" అన్నాడు.

ఒక్క క్షణం అతని కళ్ళల్లోకి సూటిగాచూసి ముందుకి కదిలింది వకుళ.

"రాత్రి అనువత్రిలోనన్నా పాఠం ప్రిపేర్ కావాల్సింది" అంటూ ఓ బాణం వదిలి గబగబా గుమ్మందాటి బైటపడింది.

అదే సమయంలో మనవడికి తనమీదున్న అభిమానాన్ని తలుచుకుని "పిచ్చివెధవ... పిచ్చివెధవని" అంటూ భీమన్నని బామ్మ మెచ్చుకోలుగా తిట్టడం వకుళకి వినబడింది.

ఇట్లాగే పడుకుంటే పొయ్యిలో పిల్లిలేచేదెట్లా గనుకుంటూ బామ్మ మంచంమీద నుంచి లేవబోయింది.

"ఏంకావాలి బామ్మా... నాకు చెప్పు... నేనే తెచ్చిస్తాను" అంటూ ఆమె దగ్గరకి పరుగెత్తాడు.

"నా పిండాకూడు కావాలి. వెధవన్నర వెధవ... నామానాన నన్నొదిలేసి కాలేజీకి వెళ్ళిపోరా" అంటూ గదిమింది.

"అలా పెద్దగా అరవకే. నీకు పుణ్యముంటుంది" అన్నాడు ఆందోళనగా. పెద్దగా అరిస్తే గుండె అదిరి మళ్ళా రక్తపోటు ఎక్కువవతుందని అతని భయం.

"ఏం అరిస్తే? నలుగురు నవ్విపోతారని భయమా? అంత నామోషీ వున్నవాడివే అయితే ఇట్లా ప్రవర్తించవురా. ముందు నువ్విక్కడి నుంచి వెళతావా... కర్ర తేనా..." మళ్ళా గద్దించింది.

బామ్మని అరిపించడం మంచిదికాదని నిర్ణయించుకున్న భీమన్న ఇక తప్పక పునూరుమంటూ కాలేజీకి బయల్దేరాడు.

వంటకి ఉపక్రమించడానికి ముందుగా బామ్మ దొడ్లోకివెళ్ళి కాళ్ళూచేతులూ కడుక్కుంటూ- "ఏం అనువత్రులో...ఎంపాడో... వచ్చి గంటయినా అనువత్రికంపు వదలదు" అని గొణుక్కుంది.

కాళ్ళూ చేతులూ కడుక్కొచ్చి, పట్టుబట్ట కట్టుకుని వంటింట్లో అడుగుపెట్టింది. ఒక్క క్షణం ఆమె అయోమయంగా చూడాల్సి వచ్చింది. వంటిల్లంతా ఎంత గందరగోళంగా చేసివుంటుందో ఈ పిల్ల. అదంతా సర్దుకునేసరికి తలప్రాణం తోకకి వస్తుందనుకుంటూ లోనికి అడుగుపెట్టిన బామ్మ తన కళ్ళని తానే నమ్మలేకపోయింది.

వంటిల్లు కూడా చాలా చక్కగా సర్దివుంది. ఎక్కడ వుండాల్సిన సామాన్లు అక్కడ పొందికగా అమర్చబడివున్నాయి.




పొయ్యి దగ్గరకెళ్ళి చూసింది. బామ్మ మళ్ళా ఆశ్చర్యపడక తప్పలేదు. వకుళ వంట కూడా చేసిపెట్టివెళ్ళింది.

పొయ్యివక్కనే ఓ కాగితం కనిపించింది. బామ్మకి వకుళ రాసిపెట్టిన చీటి అది. "బామ్మ గారికి...

పొద్దున్నే స్నానంచేసి(తలమీద) తడిబట్ట లతో మడితోనే వంటచేశాను. మీకోసం పొట్ల కాయ కూరవండాను. చిన్న స్టీలుగిన్నెలో వుంది. కారప్పొడి చేశాను. రెండూ వక్కవక్కనే వున్నాయి. మాస్టారికి కూడా ఇదే ఈ పూటకి" అని రాసి వుంది అందులో.

బామ్మకి నిజంగా ఒళ్ళంతా ఒక్కసారి పులక రించింది.

భీమన్న పెళ్ళిచేసుకుంటే తను ఈవిధంగా హాయిగా సుఖపడవచ్చుననిపించింది. అప్పు డే అనుకుందామె- "వకుళ చాలా బుద్ధి మంతురాలు. ఎంతటి వినయం? ఎంతటి అణకువ... చదువుకునేదాన్నన్న గర్వం ఏకో శానా లేదు"

రెండురోజుల తర్వాత కాలేజీకి వెళ్ళటమ య్యేసరికి వకుళకి పాఠాలన్నీ కనెక్షన్ తప్పాయి. కొత్తకొత్తగా అనిపించసాగాయి. ఒక్క తెలుగు సబ్జక్టులో మాత్రం ఈ బెడద ఎదురుకాలేదు. నోట్సు భారం పెరిగింది.

ఇంటర్వెల్‌లో ఫ్రెండ్స్ వకుళ చుట్టూచేరి వందెం సంగతి గుర్తుచేశారు. అప్పటిదాకా ఈ విషయం వకుళకి గుర్తేలేదు. ఆరోజే శని వారం. తెల్లారితే ఆదివారం అంటే పందెం ప్రకారం భీమన్న మాస్టార్ని రేపే పిక్చర్‌కి వెంటబెట్టుకెళ్ళాలి. తానింతవరకు ఆయన్ని అనలు అడగనే లేదు. ఆయనేమంటాడో తెలీ దు. ఒప్పుకోకపోతే అప్పుడిక తన అస్త్రం ప్రయో గించకతప్పదు.

కాని అవతల బామ్మగారి ఆరోగ్యం అలా వున్నపరిస్థితుల్లో మాస్టారితో తానిలా పందెం నెగ్గించుకోవడం బావుంటుందా? ఈ పరిస్థితు ల్లో తాను ఇలా ప్రవర్తించడం మానవత్వం అనిపించుకోదు- ఇలా చాలాసేపు ఆలో చించాక ఓ నిర్ణయానికొచ్చింది. ఆ వెంటనే ఫ్రెండ్స్‌కి చెప్పింది:

"ఒసేవ్... పాపం మాస్టారి బామ్మగారికి హార్ట్ ఎటాక్ వచ్చింది. ఈ రోజు ఉదయమే ఆస్పత్రి నుంచి డిశ్చార్జ్ అయ్యారు. ఇంట్లో ఇప్పటివ రకూ ఆమె బెడ్‌మీదనే వున్నారు. మాస్టారు ఆ దిగులుతో వున్నారు. కాబట్టి నావందేన్ని వచ్చే ఆదివారానికి వాయిదా వేసుకుంటున్నాను. దీనికి మీరు వప్పుకుంటే సరేసరి. ఒప్పుకోరా... సరాసరి ఈ వందేన్ని ఏకమొత్తంగా కాన్సిల్‌చే సేస్తా" అంది.

పరిస్థితి గ్రహించిన మిత్రబృందం- మొద టికే మోసం వస్తే చివరికి వినోదం మిస్ అవుతామేమోనన్న ఆలోచనలో పడ్డారు. అందుకే లౌక్యంగా:

"సరేనే... నీ ఇష్టప్రకారమే వందేన్ని వచ్చే ఆదివారానికి పోస్ట్‌పోన్ చేస్తున్నాం. కాని ఈసా రిమాత్రం ఎలాంటి సాకులూ కుదరవమ్మాయ్. వచ్చే ఆదివారం ఖచ్చితంగా వంతం నెగ్గించు కుతీరాల్సిందే. లేకపోతే నువ్వు ఓడిపోయినట్లు ప్రకటించాల్సి వస్తుంది" అని హెచ్చరించారు.

"ఓకే... నోప్రాబ్లెమ్" అన్నది వకుళ ధీమాగా.



బామ్మ త్వరలోనే కోలుకుంది. ఆమె ఆరో గ్యం బాగా కుదుటపడింది.

ఇదివరకటిలా హుషారుగా పనులన్నీ చకా చకా చేసుకోసాగింది.

భీమన్నకి మాత్రం లోలోన దిగులుగానే వుంది.

ఆ పని చెయ్యకపోతేనేం, ఈ పని చెయ్యక పోతేనేం కొంపలంటుకుపోతాయా - అంటూ బామ్మచేత వీలైనంత తక్కువగా పని చే యించాలన్న తపనలో ఆమెని అరిపిస్తూనే ఉన్నాడు.

అరిపించడంవల్ల వచ్చే అనర్థమేమిటో వెంటనే గుర్తిచ్చి నరే నీయిష్టం వచ్చినట్టు చేసుకో- అంటూ అక్కడనుంచి తప్పుకోవడం అతనికి అలవాటైపోయింది.

అసలీ ఆడవాళ్ళంతా ఇంతేనేమో... ఒంట్లో హుషారుగా ఉంటే ఎప్పుడూ ఏదోక పని కెలుకుతూవుంటారు - అని సరిపెట్టుకున్నాడు.

వకుళ దాదాపు ప్రతిరోజూ వచ్చి బామ్మ దగ్గర అటెండెన్స్ వేయించుకు వెళుతూనే వుంది. ఎప్పుడన్నా ఒకరోజు కనిపించకపోతే భీమన్నచేత బామ్మ కబురు చేసేది.

ఓరోజు కాలేజీ అయ్యాక భీమన్న వకుళని వెతికి వెతికి పట్టుకున్నాడు. అప్పుడే ఆ అమ్మాయి కూడా ఇంటికి బయల్దేరింది.

"మీ బామ్మ నిన్ను రమ్మంది" అన్నాడు ఉక్రోషంగా- 'మీ' అక్షరాన్ని వత్తిపలుకుతూ.

"... మాబామ్మ... ఆవిడెవరు?" తెలిసినా అడిగింది.

భీమన్న జవాబివ్వలేదు.

"నాకు తెల్సిన బామ్మగారల్లా ఒక్కరే. మీ బామ్మగారే" అన్నది.

"ఆఁ.... ఆవిడే!"

"అబ్బ... మీలో ఇంత ఉక్రోషం వుందని తెలిసి నాకు చాలా హేపీగా వుందండీ"

"అంటే నేనంత చవటలా వున్నానా?"

"ఈ ప్రశ్నకి సమాధానం బామ్మగారే ఇవ్వాలి" అంది నవ్వుతూ.

ఇద్దరూ రోడ్డుమీద నడుస్తున్నారు.

మాటల మధ్యలో కలం ప్రస్తావన వచ్చింది.

"అయినా నేను కానుకగా ఇచ్చిన కలాన్ని బామ్మకెందుకిచ్చావ్?" అన్నాడు.

"మీ ప్రెజెంటేషన్ని నేనెందుకిస్తాను?"

"కబుర్లు చెప్పకు. బామ్మదగ్గర డ్రామా ఆడావుగా"

"నేనే డ్రామా ఆడలేదు"

"మరి...? అసలు విషయం బామ్మకి చెబుతాలే ఆగు. నంగనాచి కబుర్లు చెప్పకు. బామ్మ దగ్గర కుండబద్దలుకొట్టినట్టు నిజం చెప్పేసి నీ పరువు తియ్యకపోతే న్ను 'బ్రోయ్' అనిపిలు"

భీమన్న ఇప్పుడెందుకు తననిలా సతాయిస్తున్నాడో వకుళకి అర్థంకాలేదు. ఆ అమ్మాయికి చెప్పలేనంత కోపమొచ్చింది.

"చెప్పండి నాకేం భయం. కాని చెప్పే ముందు ఒక్క విషయం గుర్తుంచుకోండి" అంది.

"ఏమిటది?"

"అబ్బే ...ఏంలేదు. పొట్టినిక్కరు; పాచిపోగు... ఇంకా ఇది కాలేజీ కాంపౌండ్‌దాకాపోలేదు. మీరు కావాలంటే తెల్లారేసరికల్లా బొమ్మలతో సహా ప్రచారం చేస్తా..."

భీమన్ననెత్తిన ఓపెద్ద బండరాయి పడినంతపనైంది. చిక్కక చిక్కక ఈ పిల్లకి ఇలా చిక్కానేమిటా అని తనని తానే తిట్టుకున్నాడు. లెక్చరర్ ఉద్యోగమంత పాడువుద్యోగం ఇంకోటి వుండదనిపించింది. పిల్లల దయాదాక్షిణ్యాలమీద ఆధారపడిన బతుకు. ఇలాంటి ప్రొఫెషన్ ఇంకేదీ వుండదు- అనుకుంటుండగానే ఇల్లు రావడం, వకుళ గబుక్కున ఇంట్లో దూరడం జరిగిపోయాయి. అందుకే వకుళని బతిమిలాడి' దారికి తెచ్చుకునేందుకు భీమన్నకి అవకాశం చిక్కలేదు.

ఇంట్లో వకుళ వున్నంతసేపూ భీమన్నకి ముళ్ళమీద కూర్చున్నట్టేవుంది. ఎప్పుడెప్పుడు వెళుతుందా; బామ్మకి సీరియస్‌గా ఎప్పుడు క్లాస్ తీసుకుందామా అని ఆత్రుతతో ఎదురు చూస్తూ బయటే కూర్చున్నాడు.

ఓ అరగంటతర్వాత వకుళ వెళ్ళిపోయింది.

మరుక్షణమే భీమన్న విసురుగా లోనికెళ్ళాడు.

"ఏమే బామ్మా... అడ్డమైనవాళ్ళని ఇంట్లోకి చేరదీసి నన్నెందుకే ఇట్లా ఏడిపించుకు తింటావ్?" ఇంట్లోకి రావడమైతే విసురుగా వచ్చాడుగాని మళ్ళా బామ్మెక్కడ బాధపడుతుందోనన్న భయంకొద్దీ కోపాన్ని దిగమింగుకుని దీనంగా అడిగాడు.

మనవడు ఎవరిగురించి అంటున్నాడో ఓ పట్టాన అర్థంకాలేదు బామ్మకి.

"ఎవరి గురించిరా...?" అంటూ ఆరాతీసింది.





"అహా... ఏం అమాయకురాలివే.. నేను మాట్లాడుతున్నది ఆ వకుళ గురించి..." అన్నాడు పెద్దగా.

"ఇప్పుడేమైందిరా? పాపం ఆపిల్ల చాలా మంచిది. గుణవంతురాలు" అంది మెచ్చుకోలుగా.

"ఓహో... నీకు నీ మనవడికన్నా ఆ పరాయిపిల్లే ఎక్కువైందన్నమాట" ఉక్రోషంపట్ట లేక అరిచినట్టుగానే అన్నాడు.

మనవడి ప్రవర్తన బామ్మకి వింతగా అనిపించింది. ఎప్పుడూ తనని పెద్దగా అరవద్దని అనేవాడు ఇవ్వాళ వాడే అరుస్తున్నాడు; తెగ గొంతుచించుకుంటున్నాడేమిటి చెప్మా అని ఆలోచనలోపడింది.

"నువ్వేమో నాచేత పొట్టిపొట్టి లాగూలు వేయించి పాచిపోగులు ఎత్తిస్తూవుండు. పట్టు బట్టలు కట్టించి మడినీళ్ళు మోయిస్తూవుండు. ఆ అమ్మాయేమో ఇదంతా ఇక్కడ చూసెళ్ళి కాలేజీలో టాంటాం వేస్తుంది. ఆ విధంగా నా పరువుతీస్తుంది" అన్నాడు జుట్టుపీక్కుంటూ.

బామ్మకి నవ్వాగలేదు. ఒక్కసారిగా పెద్దగా నవ్వేసింది.

"ఈ భాగ్యానికే అలా రెచ్చిపోయి జుట్టుపీక్కుంటావేరా... పిచ్చినాన్నాసీ... జుట్టుపీక్కోకు - మళ్ళీ జుట్టు ఓ పట్టానరాదు. బోడితలకి సంబంధాలు కూడా రావు. అంతగా అయితే పెళ్ళయ్యాక మొత్తం పీక్కుందువుగానిలే. లేకపోతే తలకాయ ఒక్కసారి పెళ్ళాంముందుపెట్టు చాలు" అంది.

"నేనివతల సీరియస్ విషయం మాట్లాడుతుంటే నువ్వేమిటి జోకులు?" భీమన్న ఉక్రోషం ఇంకా తగ్గకపోగా మరింత పెరిగింది.

వకుళమీద భీమన్న ఇలా విరుచుకుపడటానికి కారణం వుందనిపించింది బామ్మకి. రూళ్ళకర్రలాంటి కలాన్ని వీడు ఎవరో అమ్మాయికి దానంచేసిన విషయాన్ని వకుళ తనకి చెప్పినందుకే వీడి రుసరుసలన్నీ అనుకుంది బామ్మ. అందుకే మనవడి మాటల్ని ఆమె ఏ మాత్రం సీరియస్‌గా తీసుకోలేదు.

బామ్మనుంచి సమాధానం రాకపోయేసరికి భీమన్నకి చిర్రెత్తుకొచ్చింది.

"ఆ పిల్లని ఇక్కడికి రాకుండానన్నాచెయ్యి నాచేత పాచిపోగు ఎత్తించడమన్నా మానెయ్. ఈ రెంటిల్లో ఏదో ఒకటే జరగాలి. రెండూ జరగాలంటే మాత్రం జాన్తానై"

మనవడి ఉడుంపట్టుతో బామ్మకి కోపమొచ్చింది.

"జానెడులేవు నాతో పరాచికాలాడతావురా... అడగాలి అన్నలు పడనట్టు నాముందు వేసాలేస్తావ్... చాటుమాటుగా కలాలు, కానుకలివ్వడానికి సిగ్గు బిడియం లేవు...అవునా. పైగా ఆ చేష్టల్ని నాదాకా రాకుండా జాగ్రత్తపడతావ్" అన్నది గుర్రురుముతూ.

భీమన్న డంగైపోయాడు.

"అమ్మ వకుళమ్మా... బామ్మముందు ఎంత చక్కగా పకడ్బందీగా గ్రౌండ్ ప్రిపేర్ చేసుకున్నావ్. నీ తెలివికి నా జోహార్లు" అనుకున్నాడు మనసులోనే. ఇక బామ్మతో మాట్లాడి ప్రయోజనం లేదనిపించింది... తనకే ఎదురు క్లాసు తీసుకుంటున్నది. ఖర్మగాలి ఇద్దరికీ దొరికిపోయినందుకు ఇక ఈ విషయాన్ని ఇంతటితో వదిలెయ్యడమే మంచిదనిపించింది.

తాను ఆ కలాన్ని ఏ పరిస్థితుల్లో కానుకగా ఇవ్వాల్సి వచ్చిందో చెప్పాలనుకున్నాడుగాని బామ్మ తన మాటకంటే ఆ వకుళ మాటే నమ్ముతుందన్న నిర్ణయానికొచ్చాడు. పైగా ఆ పిల్ల మాటకే ఎక్కువ విలువ ఇస్తుందని తెలిసి, తాను చెప్పడం కూడా వృధా అనుకుని అక్కడి నుంచి లేచి వెళ్ళిపోయాడు.

★ ★ ★

మళ్ళీ ఆదివారం దగ్గర పడుతున్న కొద్దీ వకుళ గుండెల్లో రైళ్ళు పరుగెడుతున్నాయ్. ఈ కాలచక్రానికి కళ్ళెంవేసేవాడే లేకపోయెనే అనుకుంది బాధగా చాలాసార్లు.

తెల్లవారితే ఆదివారం.

భీమన్న మాస్టారితో ఎలాగైనా సరే ఇవ్వాళ కేసు ఫైనల్ చేసుకోవాలి.

ఆయన్ని ఎలా డీల్‌చెయ్యాలనే విషయమై అరగంటసేపు తనలో తనే మధనపడింది. ముందుగా రిక్వెస్ట్ చేసి చూద్దామనుకుంది. పనికాకపోతే బెదిరిద్దామన్న నిర్ణయానికొచ్చింది. తన చేతిలో ఎటూ అస్త్రం వుండనే




వుంది 'పొట్టి నిక్కరూ... పాచిపోగు...' - దీనికిక ఎదురేముంది. అరునూరైనా సరే మాస్టార్ని రేపు సినిమాకి తీసుకెళ్ళి పంతం నెగ్గించుకు తీరాలి అని మరోమారు తనకి తానే శపథం చేసుకుని భీమన్న ఇంటివైపు దారితీసింది.

గుమ్మం దగ్గరుండగానే లోపల్నుంచి భీమన్న మాటలు గట్టిగా వినిపిస్తున్నాయి. బామ్మతో ఏదో గొడవపడుతున్నట్టున్నారు అనుకుంటూ లోనికి దారితీసింది.

బామ్మ రుబ్బురోలు దగ్గర చతికిలబడి కూర్చుని ఏదో పచ్చడి రుబ్బుతోంది.

"నువ్వికె పచ్చళ్ళు రుబ్బుళ్ళు పెట్టుకోవద్దని మొన్ననే చెప్పానా?" అంటున్నాడు భీమన్న. "పచ్చడి రుబ్బుకోకుండా లొట్టలేసుకుంటూ తింటానికి ఎలా వస్తుందనుకున్నావేరా?" దీర్ఘం తీస్తూ అంటున్నది బామ్మ.

"నువ్వట్టా గుండెలు పడిపోయేట్టు రుబ్బుతుంటే నేను చూళ్ళేక పోతున్నానే" బామ్మ ఇలాంటి బరువు పన్లు చేస్తే మళ్లా ఎక్కడ గుండెనొప్పి వస్తుందోనని అతని భయం.

"బామ్మ కష్టపడటం చూళ్ళేకపోతే మీరు ఓ చెయ్యి వెయ్యొచ్చుగా. ఈ మగాళ్ళంతా ఇంతే బామ్మా. పైసా ఖర్చు కాకూడదు. వీసమెత్తు శ్రమ కలగకూడదు. తిండి దగ్గర కొచ్చేసరికి అన్నీ అమరాలి" అంటూ వకుళ రోటి దగ్గరికెళ్ళింది.

"బామ్మా... కాసేపు నువ్వు పక్కకి తప్పుకో... అయిదు నిముషాల్లో నేనీ పచ్చడిని రుబ్బేస్తా"నంటూ బామ్మని పక్కకి జరగమని, పిడి తాను అందుకుంది.

"ఎందుకమ్మా... ఇదేమంత పెద్దపని? నేనేదో రోగిష్టిమారిదాన్నని వాడనుకుంటున్నాడు గాని వాడికంటే నేను ఎంత ఆరోగ్యంగా వున్నానో వాడికేంతెల్సు..." అంటూ పక్కకి తప్పుకుంది.

"ఆఁ... ఆరోగ్యంగా ఎందుకుండవ్... వుంటావ్... మొన్న డాక్టరు ఏం చెప్పాడో తెలిస్తే ఇప్పటికే గుండె 'టాప్'మని పగిలి ఇక్కడికిక్కడే కుప్పలా కులిపోతావ్" అనుకున్నాడు భీమన్న లోలోనే.

బామ్మ బావిదగ్గరకెళ్ళి చేతులు కడుక్కుంటూ-

"మరీ కాటుకలా మెత్తగా రుబ్బకేం. చివర్లో చెప్పు ఉప్పేస్తాను. ఈలోగా నా ధోవతులు రెండు పిండి ఆరేసుకుంటాను" అని చెప్పి అటు నుంచి అటే దొడ్లోకి వెళ్ళిపోయింది.

మాస్టారితో మాట్లాడేందుకు ఇదే మంచి అవకాశం అనిపించింది వకుళకి.

"మాస్టారూ... మాస్టారూ..." అంటూ మెల్లగా కేకేసింది.

తలొంచుకుని పాత్రాన్ని గిరగిరా తిప్పేస్తూ కూర్చున్న వకుళ, తన ఎదురుగానే నిలబడివున్న భీమన్నని గమనించలేదు. అందుకే పిలిచింది- తలెత్తకుండానే.

"ఏమిటా అరుపులు... ఇక్కడేవున్నాను చెప్పు" అన్నాడు.

అప్పుడు తలెత్తి చూసిందామె.

భీమన్న తననే పరీక్షగా చూస్తున్నాడు.

"ఏమిటి అలా చూస్తున్నారు?" అంది అదోలో చూస్తూ.

"కందిపచ్చడి రుబ్బడంలో నువ్వు నేషనల్ ఛాంపియన్‌వా... ఇంటర్నేషనల్ ఛాంపియన్‌వా అని అంచనా వేస్తున్నాను"

"మీరేమీ నాకు అవార్డులు ఇవ్వక్కర్లేదు" పుణ్యకాలంకాస్తా గడిచిపోతున్నది. బామ్మ వచ్చేలోగా అసలు విషయం తేల్చుకోవాలని మరో వంక ఆమె మనసు తొందరపెడుతోంది. అందుకే వెంటనే అసలు విషయంలోకి దిగింది.

"మాస్టారూ ... నేను మిమ్మల్ని ఒక రిక్వెస్ట్ చేస్తాను. ఒప్పుకుంటారా?" జంకుతూనే అడిగింది.

"ఏమిటో చెప్పు" అడిగాడు యధాలా పంగా.

"మీరు ఓకే అంటానంటేనే చెబుతా"

"విషయం తెల్సుకోకుండా ఎలా అనను?"

"అడిగే వ్యక్తిమీద నమ్మకం వుంటే అనవచ్చుగదా"

"అదుగో నువ్వు మళ్ళీ సెంటిమెంట్ జోలికి పోకు ఆ అస్త్రంతోనే గదా బామ్మకి టోపీ వేశావ్"



"ఏమిటండీ... బామ్మకి నేను టోపి వేయడ మేమిటి? ఏం చేశాను... నేనేమన్నా మాయమాటలు చెప్పి ఆమె చేత ఆస్తిపాస్తులు రాయించుకున్నానా" అంటూ గయ్యిన లేచింది.

"అబ్బెబ్బే...నేనావుద్దేశంతో అన్లేదు. అసలు అంత దూరమే ఆలోచించలేదు. ఏదో సరదాకి అన్నానంతే" నచ్చచెప్పబోయాడు.

నిజానికి వకుళ ఇంతగా రియాక్ట్ అవుతుందని అతను వూహించలేదు. "మీకు నిజంగా ఏదురుద్దేశమూ లేకపోతే ఇంకా వుప్పుకూడా వెయ్యని ఈ కందివచ్చడి కొంచెం తిని మీ నచ్చీలతని నిరూపించుకోండి" అంది.

నిమ్మకాయంత కందివచ్చడిని ఉండగా చేసి భీమన్న చేతిలోపెట్టింది. పురాణకాలంలో అగ్నిపరీక్షల గురించి విన్నాం; మళ్ళా ఇప్పుడు ఇదుగో ఈ కందివచ్చడి పరీక్ష స్వయంగా చూస్తున్నాం- అనుకుంటూ నాలికతో కొంచెం కొంచెం రుచి చూడసాగాడు.

వచ్చడి బాగా కారంగా వుంది. నసాళానికి అంటుతోంది.

"కారంగా వుంది" అన్నాడు కళ్ళమ్మట నీళ్ళు తిరుగుతుండగా.

"అందుకేగా మీకు పెట్టింది" అన్నది వెంటనే.

"లేకపోతే అన్నెంపున్నెం తెలీనిపిల్ల మీద అభాండాలు వెయ్యడమేనా? ఇదే తగిన శిక్ష. మొత్తం తినండి. తిని అప్పుడు చెప్పండి నేను ఏ ఛాంపియన్నో?" అంది. తప్పేదిలేక కంది వచ్చడి కొంచెంకొంచెంగా తినసాగాడు. మధ్యలో కొరబోయింది. సరిగ్గా అప్పుడే వకుళ తన మనస్సులో మాట బైటపెట్టింది.

"మాస్టారూ...రేపు మీరు నాతో సినిమాకి వస్తున్నారు..." అంది.

ఈ మాటవిని భీమన్న పిడుగుపడ్డట్టు అదిరిపడ్డాడు. అసలే పచ్చడికారంతో సతమతమవుతున్నాడేమో...గుక్కతిప్పుకోలేనంతగా పెద్దగా కొరబోయింది.

దొడ్లో వున్న బామ్మకి ఇది వినిపించింది.

"ఏంటమ్మాయ్...ఏమైంది?" అన్నదామె అక్కడినుంచే.

"ఏంలేదు బామ్మా...మాస్టారు పచ్చడి టేస్ట్ చూస్తానంటే కొంచెం పెట్టాను. ఇంకాఉప్పు వెయ్యలేదుకదా. కారం కొంచెం జాస్తి అయిందేమో...కొరబోయిందంతే. అక్కడికీ నేను చెప్పాను—ఇంకా ఉప్పెయ్యలేదు. వద్దు మొర్రో అని—వింటేనా..." రోటి ముందు నుంచి లేవకుండానే వకుళ బామ్మకి సర్దిచెప్పింది.

భీమన్న కొంచెంసేపటికి తెప్పరిల్లుకున్నాడు.

"ఏమిటి...నేనడిగానా పెట్టమని?" గుడ్లురుముతూ అడిగాడు.

"అబ్బ...ఏదో ఆడపిల్లని...అవసరార్థం చిన్న అబద్ధం ఆడాను. దాన్ని పట్టించుకోవాలా చెప్పండి. ఇంతకీ నా రిక్వెస్టు..." అంటూ సాగదీసి ఆగిపోయింది.

"అది రిక్వెస్టా..."

"కాకపోతే బెగ్గింగ్"

"రెండూ కాదు...సైనిక నియంత పాస్చేసే ఆర్డర్లా వుంది" తాపీగా అన్నాడు.

"మీరు అపార్థం చేసుకోవద్దు. నిజానికి అది రిక్వెస్టే. కాకపోతే గొంతులో అందుకు అవసరమైన ఆర్ద్రత సమయానికి రియాక్ట్కాక మాడ్యులేషన్ కొంచెం పెళుసుగా వినిపించి వుంటుంది" అంది నవ్వుతూ.

"అవునూ...నాతో సినిమాకి వెళ్ళాలని ఎందుకనుకున్నావ్? నీకిదేం పోయేకాలం?"

"ఏమిటండీ ఆ...ఆడంగి తిట్లూ మీరూనూ...నేనడిగాను వస్తారా రారా? రెండే రెండు మాటలు- అంతే" అంది నిష్ఠూరంగా.

"నేను రాను- అన్నాననుకో ఏంచేస్తావ్?"

"మిమ్మల్ని సినిమాకి ఎలా రప్పించాలో నాకు తెల్సు అన్నాననుకోండి- ఏమంటారు?"

"ఇంపాజిబుల్... నేను నీతో సినిమాకి రావడమేమిటి? నాకసలు సినిమాలు చూసే అలవాటే లేదు. పుట్టి బుద్ధెరిగాక ఒక్క సినిమాకైనా వెళ్ళలేదు. ఎనిమిదో తరగతిలో వున్నప్పుడు ఒకసారి సినిమాకి వెళతానని మారాంచేస్తే





alk of the town...ఏ నోట విన్నా...Talk of the town...ఏ నోట విన్నా...Ta

చతుర

"మా ఇంట్లో లైబ్రరీకోసం
నవలలు కొనాలంటేనే
భయమేస్తోందోయ్
వాటి ధరలు
చూస్తుంటే!"

"దానికొక్కటే
పరిష్కారం - చతుర!
నెల నెలా ఓ ఉత్తమ
నవలతో మీ లైబ్రరీని
అలంకరిస్తుంది
చతుర!!"



బామ్మ చితకబాదింది. బామ్మకి చెప్పి నీకు ఆ శాస్తి చేయించనా ఏమిటి?- అన్నాననుకో. ఏమంటావ్?" అన్నాడు గడగడ పాఠం చదువుతున్నట్టే.

"ఓహో...ఆ రూట్‌న వచ్చారా...అయితే నేనూ అదేరూట్‌కి మారతాను" అంటూ రోలు దగ్గర్నుంచి లేచి భీమన్న దగ్గరికొచ్చింది.

"ఆఁ... ఇప్పుడు చెప్పండి. ఏమిటి బామ్మతో చెప్పి బడితెపూజ చేయిస్తారా...చెప్పండి. నేనూ చెబుతాను" అంది.

"నేను చెప్పినా నువు చెప్పినా నీకే నష్టం" అన్నాడు.

"అక్కడే వుంది తిరకాసు. నాకు నష్టమయ్యేట్టు నేనెందుకు చెప్పుకుంటాను"

"అంటే అబద్ధం చెబుతావా?"

"అవును"

"ఏమని చెబుతావ్?"

"మీరు కాలేజీ అమ్మాయిలతో సినిమాలకి షికార్లకి వెళుతున్నారని."

భీమన్న అదిరిపడ్డాడు. మరోసారి కొరబోయినంత పనైంది.

వకుళ అన్నంత పనీచేసినా చేస్తుంది. ఆ పిచ్చిబామ్మ నమ్మినా నమ్ముతుంది. ఈ గొడవంతా ఎందుకు. ఈ పిల్ల దగ్గరే వ్యవహారం ఫైనల్ చేసుకోవడం మంచిదనుకున్నాడు.

"వకుళా...నేను కాలేజీలో లెక్చరర్ని. ఒక స్టూడెంట్‌తో అందులోనూ లేడీస్టూడెంట్‌తో సినిమాహాల్లో కనిపిస్తే నలుగురూ ఏమనుకుంటారు? మన పరువు వుంటుందా అసలు? అందులో నువ్వు ఆడపిల్లవి. ఈ పుకార్ల మధ్య చిక్కుకుంటే రేపు నీ పెళ్ళికూడా కష్టమవుతుంది"

"అవన్నీ నేనిప్పుడు ఆలోచించదలుచుకోలేదు. ఆరునూరైనా మనిద్దరం రేపు మార్నింగ్ షోలో వుండాలి" ఖచ్చితంగా చెప్పింది.

"సారీ...నావల్లకాదు. కాకపోతే ఆ కందిపచ్చడి మొత్తం అయిదు నిముషాల్లో తినమను... తింటాను. అంతేగాని సినిమా గినిమా జాన్తానై" అన్నాడు.

"అంతేనా?"

"అంతే... ముమ్మాటికీ అంతే"

"మీ నిర్ణయం మారదా?"

"కుందేటికి మూడే కాళ్ళని అనేరకంకాదు నేను. అవసరమనిపిస్తే నిర్ణయాలు మార్చుకోవడానికి వెనుకాడనుగాని నావుద్యోగం, నీ భవిష్యత్తు, ఉమ్మడిగా మన పరువుప్రతిష్ఠలతో ముడిపడివున్న ఈ విషయంలో మాత్రం నా కుందేటికి మూడంటే మూడే కాళ్ళు- అంతే. ఎవ్వరు ఔనన్నా కాదన్నా ఇది మాత్రం మారదు" అన్నాడు.

"నాతో సినిమాకి వస్తే పరువుపోతుందని బాధపడుతున్నారుగదా! నాతో సినిమాకి రానన్నా తెల్లారేసరికి మీ పరువు గోదావరిలో కలవచ్చు"

"అంటే?" అయోమయంగానే అడిగాడు.

"ఏమీ లేదు. సింపుల్- పొట్టి నిక్కరూ- పాచిపోగు; పట్టుబట్ట- నీళ్ళబిందె" అన్నది ఒక్కొక్క పదాన్నే సాగదీస్తూ.

భీమన్న జావగారిపోయాడు.

"వకుళా... నువ్విలా నన్ను బ్లాక్‌మెయిల్ చెయ్యడం ఏమీ బాగాలేదు" అన్నాడు విషాదంగా ముఖంపెట్టి.

"ఇంకెప్పుడూ అడగను. బ్లాక్‌మెయిలింగ్ కూడా ఇంకెప్పుడూ చెయ్యను. ఈ ఒక్కసారికి నా కోరిక తీర్చి, నా పరువు కాపాడండి ... ప్లీజ్" అర్థించినట్టే అంది వకుళ.

భీమన్న ఆలోచనలో పడ్డాడు.

తన పరువు ప్రతిష్ఠలతో ముడిపడివున్న ఈ క్లిష్ట సమస్యపై తన కర్తవ్యం ఏమిటన్నది అతని ముందున్న ప్రశ్న.

వకుళతో సినిమాకి వెళితేపోయే పరువుకన్నా వకుళ కాలేజీలో చేసే ప్రచారంవల్ల ఎక్కువ డ్యామేజీ కలుగుతుందని అతని లెక్కల్లో తేలింది. ఎన్నివిధాల బేరీజు వేసి చూసినా వకుళతో సినిమాకి వెళ్ళడమే మేలనిపించింది.

సినిమా రెండున్నరగంటల వ్యవహారం. కాని కాలేజీలో తనమీద ఒక్క పది నిముషాలు ప్రచారం జరిగినా చాలు- అది ఏడాదికేడాది స్టూడెంట్స్‌లో నానుతూనే వుంటుంది. అందుకే భీమన్న ఈ నిర్ణయానికొచ్చాడు.




మాస్టారు ఒప్పుకున్నందుకు వకుళ మనస్సు ఎగిరిగంతేసింది. రేపు పందెం తను గెలవబోతోంది... ఆమెలో హుషారు హెచ్చింది. రేపు ఎన్నిగంటలకి ఏ థియేటర్ దగ్గర కలుసుకోవాలో వకుళ వివరంగా చెప్పింది.

ఇంటిదగ్గర నుంచే ఇద్దరం కలిసి వెళదామంటే భీమన్న ఒప్పుకోలేదు. సినిమాకి వెళుతున్నట్టు బామ్మకి చెప్పకుండా రావాలని అతని వుద్దేశం. సినిమాహాలు బైట గేటుదగ్గరే కలుద్దామని ప్రోగ్రామ్ ఫిక్స్ చేసుకున్నారు.

మర్నాడు-

ఉదయం పదకొండింటికల్లా భీమన్న తయారై, ఓ ఫ్రెండ్ దగ్గరికి వెళ్ళొస్తానని బామ్మకి చెప్పి బైటపడ్డాడు.

ఆ తర్వాత పది నిముషాలకి వకుళ రిక్షా దిగింది. ఆ ఇంట్లోకి దారి తీసింది.

పథకం ప్రకారం భీమన్న ఇంట్లో నుంచి వెళ్ళే సమయం వరకు వెయిట్ చేసి మరీ బయల్దేరింది వకుళ.

లోనికెళ్తూనే ఏదో పనిలోవున్న బామ్మని పలకరించింది వకుళ.

"ఏంటమ్మాయ్... ఆదివారంనాడు కూడా టింగురంగామంటూ పుస్తకాలు వేసుకు బయల్దేరావ్?" అనడిగింది బామ్మ.

"నాకివ్వాళ ఇంగ్లీష్ ప్రయివేట్ క్లాసుంది బామ్మా" అన్నది తడుముకోకుండా. ఆ వెంటనే ఇల్లంతా కలియజూస్తూ:

"బామ్మా... ఏవిటి ఇల్లు చాలా నిశ్శబ్దంగా వుంది. మాస్టారు లేరా?" అడిగింది అమాయకంగా.

"ఎవరో ఫ్రెండ్ దగ్గరికి వెళ్ళొస్తానని చెప్పి ఇప్పుడే బైటికెళ్ళాడమ్మా"

"ఫ్రెండ్ దగ్గరకని చెప్పారా... అయితే మీకు మళ్ళీ టోకరా వేశారన్నమాట" చిన్నగానే అన్నా బామ్మకి వినిపించేట్టు మాత్రం జాగర్తపడింది.

"టోకరానా...?" అంది బామ్మ అర్థంకాక.

"అవును బామ్మా... అప్పుడెప్పుడో కలం తీసుకుందే... ఆ పిల్లతో మాస్టారు మార్నింగ్ షో ప్రోగ్రాం వేసుకున్నార్ట. నాకు ఆ పిల్లే చెప్పింది" అన్నది.

బామ్మ స్టన్ అయింది. ఓ క్షణంపాటు తనేం విన్నానా అన్న ఆలోచనలో పడింది. ఆ తర్వాత తేరుకుని-

"ఏమిటోనమ్మా... రానురాను వీడిలా మారిపోతున్నాడు. నాకెందుకో భయంగా వుంది" అన్నది దిగులుగా.

"వెధవని రానీ... చీపురుకట్ట మడమ తిరగేస్తా... మా ఇంటావంటా లేని చేష్టలు వీడికెలా అబ్బాయంట..." తనని తానే ప్రశ్నించుకుంది బామ్మ.

ప్రయివేట్ క్లాస్ టయిమ్ అవుతోందంటూ వకుళ బామ్మదగ్గర సెలవు తీసుకుని గబగబా బయల్దేరింది- చేతిలో పుస్తకాలతో.

సినిమాహాలు గేటు బయట భీమన్న బెదురుబెదురుగా తారట్లాడుతున్నాడు. మరో పది నిముషాలకి వకుళ అక్కడికి చేరుకుంది.

"గుడ్ మార్నింగ్ మాస్టారు" అంది నవ్వుతూ- రిక్షా దిగుతూనే.

"ఆఁ... మార్నింగ్..." అన్నాడు ముక్తసరిగా ఎటో చూస్తూ.

"లోపలికెళదాం పదండి" అన్నది వకుళ చొరవగా ముందుకి నడుస్తూ. భీమన్న ఆమెను అనుసరించాడు.

జనంతో ఆవరణ అంతా కిటకిటలాడుతోంది.

ఎవరి కోసమోనన్నట్టు వకుళ అటుఇటు చూస్తుంటే భీమన్న మాత్రం స్టూడెంట్స్ ఎవరన్నా కంటబడతారేమోనన్న భయం కొద్దీ తల వంచుకుని నేలవైపే చూస్తూ నిలబడ్డాడు.

ఇంతలోనే వకుళ మిత్రబృందం సుడిగాలిలా వచ్చి ఇద్దర్నీ చుట్టేసింది.

"గుడ్ మార్నింగ్ సర్" వాళ్ళంతా మాస్టార్ని విష్‌చేశారు.

భీమన్నకు సిగ్గుతో చచ్చిపోయినంత పనైంది. అతనికి ఇది ఊహించని సంఘటన.

వాళ్ళంతా ఓ ప్లాను ప్రకారం తననిక్కడికి రప్పించారన్న విషయం వాళ్ళమాటల ద్వారా అర్థమైందతనికి.

'అయిపోయింది ... అంతా అయిపోయింది. ఈ ఆడంగులంతా కల్సి రేపు కాలే



జీలో టాంటాం చెయ్యడం ఖాయం. రేప ట్నుంచి వకుళ పేరు, తన పేరు కాలేజీ గోడల మీద వెలుస్తాయి' భీమన్న ముఖమంతా ము చ్చెమటలు పోశాయి. వాళ్ళమధ్య చాలా అనీ జీగా నిలబడ్డాడు.

వాళ్ళంతా సరదాగా కబుర్లలో పడ్డారు. తా ను ఒక లెక్చరర్, వాళ్ళు స్టూడెంట్స్ అన్న భావనే వాళ్ళలో కనిపించలేదు భీమన్నకి. 'కలికాలం' అనుకున్నాడు మనసులోనే.

ఇంతలో గంట మోగింది.

ఓ ఇద్దరు అమ్మాయిలు వెళ్ళి టిక్కెట్లు తెచ్చారు.

మరో అయిదు నిముషాల్లో అందరూ కల్సి లోపలికి వెళ్ళారు.

సినిమాహాల్లో కూర్చున్నాడేగాని భీమన్న మనస్సంతా కకావికలమైపోయింది.

అమ్మాయిలు మాత్రం తమ అభిమాన హీరో బ్రేక్‌డ్యాన్సుకి లయబద్ధంగా కాళ్ళు వూపు తూ మమేకమై సినిమా చూస్తున్నారు. భీమన్న కి ఆ సినిమా ఏమాత్రం ఒంటపట్టడం లేదు.

అరగంట తర్వాత అతనిక అక్కడ కూర్చో లేకపోయాడు. మెల్లగా వకుళతో చెప్పాడు.

"నాకు తలనొప్పిగా వుంది. కూర్చోలేకపోతు న్నాను. పైగా సినిమా కూడా నాకు నచ్చలేదు. నువు చూసిరా. నేను వెళతాను" అన్నాడు బతిమిలాడుతున్నట్టు!

వకుళకి జాలేసింది. తన పందెం కోసం ఆయన్ని బలవంతం చేశానన్న భావన ఆమెలో వుంది. మొత్తానికి తన పందెం నెగ్గిన ట్లే. ఇక ఆయన సినిమా చూసినా ఒకటే. చూడకపోయినా ఒకటే. ఆయన్నిక ఇబ్బంది పెట్టదలుచుకోలేదు.

"సరే మాస్టారు... మీ ఇష్టం" అంటూనే పక్కనే వున్న ఫ్రెండ్స్‌కి చెప్పింది. వాళ్ళు ససేమిరా వీల్లేదన్నారు. చివరిదాకా మాస్టార్ని హాల్లో వుంచితేనే పందెం గెలిచినట్టు! లేకపోతే ఇంతే సంగతులు అని స్పష్టంగా చెప్పారు.

వకుళ ఈ విషయంలో నిస్సహాయురాలు. తను పందెం గెలిచితీరాలి. అందుకే ఫ్రెండ్స్ ఒప్పుకోవడం లేదని భీమన్నకి చెప్పింది.

"సారీ మాస్టారూ... వాళ్ళు ఒప్పుకోవడం లేదు..." అంది.

"వాళ్ళు ఒప్పుకోకపోతే నాకేమిటి... నా యిష్టం... నేవెళతాను" అంటూ విసురుగా లేవబోయాడు.

"తొందరపడకండి మాస్టారూ... వాళ్ళకి కోప మొచ్చి రేపు కాలేజీలో టాంటాం చేసినా చేస్తా రు. అసలే మహాగడుసుపిండాలు" హెచ్చ రించింది.

కుర్చీలోనుంచి లేవబోతున్న వాడల్లా ఠపీ మని మళ్ళీ కూర్చుండిపోయాడు!

పిక్చర్ మరోపావుగంటకి వదులుతారనగా ఫ్రెండ్స్ అనుమతితో వకుళ భీమన్ని వదిలే సింది.

"మాస్టారూ... మీరిక వెళ్ళొచ్చు" అని వకుళ చెప్పడంతోనే-

నేలకేసి కొట్టిన బంతి పైకి లేచినంత వేగంగా సీట్లోంచి లేచాడు భీమన్న.

రోడ్డు మీద నడుస్తున్నాడన్న మాటేగాని మనసంతా చికాకు ఆవరించింది. యాంత్రి కంగా ఇంటివైపు అడుగులేస్తున్నాడు.

ఇంటా బయటా తానిలా అభానుపాలవుతు న్నానన్న భావన అతనిలో ఆవేదనని రగులు స్తున్నది.

దీనికంతటికీ కారణం... తన బలహీనతా? లేక బామ్మ చీటికీమాటికీ దెప్పిపొడుస్తున్నట్టు తన అసమర్థతా? నిజంగా తాను అసమర్థుడా? అదే నిజమైతే కాలేజీలో జూనియర్ లెక్చరర్ వుద్యోగం తనకెలా వచ్చివుండేది? తనేమీ డబ్బూ దస్కం లంచం పెట్టలేదే. ఎవ్వరి రికమండేషన్ కూడా లేకుండానే కేవలం తన ప్రతిభతోనే గదా ఉద్యోగం సంపాదించింది! ఆ లెక్కన తను సమర్థుడే! అయితే మరిలా ఇంటాబయటా ఎందుకు ఫెయిల్ అవుతున్న ట్టు? ఇంట్లో చూద్దామా... బామ్మ మాట్లాడే ప్రతిమాటలోనూ తన అసమర్థత కొట్టొచ్చినట్టు కనిపిస్తూనే వుంటుంది. కాలేజీలో చూద్దామా... అటు పిల్లలు ఇటు తోటి లెక్చరర్లు వాళ్ళకి తోడు ప్రిన్సిపాల్ తననొక వెధవలాగా వాజమ్మ లాగా చూస్తారు. ఒకడు కాకపోతే ఒకడన్నా కోపరేషన్ ఇచ్చేవాడే లేడే తనకి! తన జీవితం





ఎందుకిలా అభానుపాలవుతోంది? తాను నిజంగా ఎదుటివాడికి తన చేష్టలతో బఫూన్‌లా కనిపిస్తున్నాడా? తనంటే ఎవ్వరికీ సీరియస్‌నెస్ లేదు. ఆ ఫీలింగ్ వుంటే వకుళ ఇవ్వాళ తననిలా నవ్వులపాలు చేసేదా? ఆట పట్టించి తన పరువుతో చెలగాటం ఆడి వుండేదా?

ఎదుటివాళ్ళు ఏమి అన్నా చూసీచూడనట్టు పోయే తన మనస్తత్వమే దీనికంతకూ కారణమా?

తన మంచితనాన్ని వీళ్ళిలా అలుసుగా తీసుకుంటున్నారా?

ఏదేమైనా తానిక ఈ అవమానాన్ని భరించలేడు! ఎక్కడో ఒకచోట దీనికి ఫుల్‌స్టాప్ పెట్టాలి.

అందుకు తెలివైన మార్గం ఆలోచించాలి. లేకపోతే తాను ఇంకా భ్రష్టుపట్టిపోవడం ఖాయం... ఇలా ఆలోచిస్తూ ఆవేదనామనస్కుడై భీమన్న ఇంటికి చేరాడు.

అతను వచ్చేసరికి బామ్మ పడుకుని వుంది. మామూలుగా అయితే ఆవేళప్పుడు బామ్మ అస్సలు మంచమెక్కదు.

భీమన్న గుండెలో రాయిపడింది.

కొంపదీసి గుండెనొప్పి వచ్చిందేమోనన్న ఆలోచన వచ్చింది.

హడావుడిగా మంచం దగ్గరకెళ్ళాడు.

రెండుమూడుసార్లు బామ్మని పిలిచాడు.

ఆమెలో వులుకూ పలుకూ లేదు.

చేత్తో తట్టిలేపాడు.

చలనం లేదు.

భీమన్నలో కంగారెక్కువైంది.

బామ్మ ప్రాణం అనంతవాయువుల్లో కలిసిపోయిందేమోనన్న అనుమానం కలిగింది.

దాంతో అతని మనస్సు శోకతప్తమైంది. ఒక్కసారిగా కట్టలు తెంచుకు రాబోయిన ఏడుపుని ఎలాగో తమాయించుకున్నాడు. కళ్ళు మాత్రం నీటితో నిండిపోయాయి. ఇప్పుడేమిటి చేయడం?

అంతలోనే ఓ ఆలోచన తట్టింది!

'బామ్మ ముక్కుదగ్గర అరచెయ్యి అడ్డుపెట్టి కాసేపు పరీక్షించాడు- అధైర్యంగానే!

వెచ్చటి శ్వాస చేతికి తగులుతోంది.

అమ్మయ్య... బామ్మ బతికేవుంది! అనుకున్నాడు. దాంతో మనస్సు కొంచెం తేలికపడింది.

కొంత ధైర్యం వచ్చింది. బామ్మ పొట్టవైపు పరీక్షగా చూశాడు.

ఉచ్ఛ్వాసనిశ్వాసాలతో పొట్ట ఎగిరెగిరిపడుతోంది- మామూలుగానే.

'అంతా బాగానే వుంది. మరెందుకు పడుకున్నట్టబ్బా! అనుకున్నాడు.

ఈసారి గట్టిగా తట్టి లేపాడు.

ఒక్క విసురుతో భీమన్న చేతిని విదిలించి కొట్టి అవతలివైపుకి తిరిగి పడుకుంది బామ్మ.

భీమన్నకి ఏమీ అర్థం కాలేదు.

అర్థమైందల్లా ఒక్కటే- బామ్మ ఇందాకట్నుంచి నిద్రమాత్రం పోలేదు.

మరైతే అలిగిందా ఏమిటి చెప్మా!

మంచం రెండోదిక్కుకి వెళ్ళి కూర్చున్నాడు.

"బామ్మా... ఏమిటే అలిగావా?... నేను అదురుకు చచ్చాగదే. అయినా ఈ వయస్సులో నీకు అలకలేమిటే? ఎప్పుడో తాతగారి కాలంలో చెయ్యాల్సిన పని నువ్విప్పుడు నామీద ప్రయోగించడం తప్పుగదూ... లే" అంటూ బామ్మగడ్డం పుచ్చుకు బతిమిలాడాడు.

బామ్మ మళ్ళీ భీమన్న చేతిని విసురుగా తోసేసింది. ఈసారి కళ్ళు తెరచి అతనివైపు తీక్షణంగా చూసింది. సాధారణంగా బామ్మకి నికార్సయిన కోపం ఎప్పుడూ రాదు. కాకపోతే భీమన్న మీదున్న ప్రేమకొద్దీ నోరారా తిట్టడం ఆమెకి అలవాటైపోయింది.

మూడో మనిషంటూ ఎవ్వరూ అక్కడ లేకపోతే భీమన్న ఆ తిట్లని దీవెనలుగా స్వీకరిస్తాడు నవ్వుతూ. "ఏంటేబామ్మ... ఏమైందివాళ" అడిగాడు విసుగ్గా ముఖంపెట్టి. అలాగన్నా బామ్మ దారికొస్తుందేమోన్న ఆశతో.

"అబ్బ..... ఏమైందంటూ ఎంత అమాయకంగా అడుగుతున్నావురా... నంగనాచి తుంగబుర్ర" అన్నది బామ్మ.

"అమ్మయ్య.... ఫర్వాలేదు మొత్తానికి నోరు విప్పింది" అనుకున్నాడు భీమన్న.




బామ్మ ఆగ్రహానికి, అలకకి కారణమేమిటో ఇంకా అతనికి అంతుచిక్కలేదు. అడిగినా చెప్పేట్టు లేదు. కొంచెంసేపాగితే అవిడే చెబుతుందిలే అనుకుని అక్కడి నుంచి లేచాడు.

అప్పుడు లేచి కూర్చుంది బామ్మ.

"ముసలిముండని పడుకుని వుంటే నీకేం... అలిగితే నీకేంరా... నేనంటే నీకసలు లెక్కలేకుండా పోయింది" అన్నది నిష్ఠూరంగా.

"ఇప్పటిదాకా నీ దగ్గరే కూర్చుంటిని గదే. నువ్వు అలా పడుకుని వుంటే నాకెంత భయమేసిందో తెల్సా ... ఒకవేళ మళ్ళీ గుండె నొప్పి వచ్చిందేమోనని హడలి చచ్చా" అన్నాడు.

"అవున్రా ... నా గుండె నొప్పి మీద నీకీమధ్య శ్రద్ధ ఎక్కువైంది. ఈ ముసల్ది ఎప్పుడు అడ్డు తొలిగిపోతుందా అని తెగ ఎదురుచూస్తున్నావ్" అన్నది.

బామ్మ ఎందుకిలా మాట్లాడుతుందో భీమన్నకి అర్థం కాలేదు. ఎప్పుడూ ఇలా మాట్లాడి ఎరగదు. "సూటిపోటి మాటలతో చంపక అసలు విషయం చెప్పొచ్చుగదా" అన్నాడు వినుగ్గా.

"సినిమా బావుందా?" తాపీగా అడిగింది.

భీమన్న దిమ్మెరపోయాడు.

"నీకెలా తెల్సింది?" అప్రయత్నంగా అనేశాడు.

"ఆ వగలాడితో సినిమాకి పోయి నాతో అబద్ధం చెబుతావా?"

భీమన్న ఈసారి మరీ ఖంగుతిన్నాడు.

ఎంతోగొప్పగా అభిమానించే వకుళని బామ్మ ఇలా అనడం అతనికి ఆశ్చర్యం కలిగించింది. కాని బామ్మ వేరేపిల్లని దృష్టిలో ఉంచుకుని అన్నదన్న విషయం అతనికి తెలీదు.

బామ్మకి నిజం చెప్పెయ్యాలనుకున్నాడు.... వకుళ బలవంతంచేస్తేనే గదా.... తానెళ్ళింది! అదే చెప్పాలని నిర్ణయించుకున్నాడు.

"అది కాదే బామ్మా.... పాపం.... బలవంతంచేస్తేనూ...." నసుగుతూండగానే- "నాతో అబద్ధం చెప్పమని కూడా తనే బలవంతం చేసిందా?"

"సినిమాకంటె నువ్వు వద్దంటావని నేనే అలా చెప్పాను"

"అదే... అక్కడే తెలుస్తోంది. నా మీద నీకున్న విలువేమిటో" అన్నది ఈసడింపుగా.

భీమన్నకి ఒక్కసారి చిర్రెత్తుకొచ్చింది. తను ఏ పరిస్థితుల్లో అలా చేయాల్సి వచ్చిందో మాటమాత్రమైనా ఆలోచించకుండా బామ్మ తననిలా చెండుకు తినడం అతనికి చిరాకనిపించింది. అసలు దీనికంతకూ కారణం ఆ వకుళ మహాతల్లి. అడుగడుగునా తనని అప్రతిష్టపాల్జేస్తూ, సమస్యల ఊబిలో దించుతూ ఇంతవరకు తెచ్చింది. వాస్తవానికి ఇందులో అసలు తన తప్పేమీ లేదు. ఆరోజు తెలుగు క్లాసులో ఆడపిల్లగదాని దయదలిచి అడక్కముందే కలం ఇచ్చిన నేరానికి తానివ్వాళ ఇన్ని ఇబ్బందులువడాల్సి వచ్చింది....

ఏదేమైనా తనకి ఇదొక మంచి గుణపాఠం.

అంతగా దయార్ద్రగుణమేగనక వుంటే పేదలకి అన్నదానం చేయొచ్చు, వస్త్రదానం చేయొచ్చు. లేకుంటే పిల్లల్ని పిలిచి చేగోడీలు కొనిపెట్టొచ్చు. కాని కాలేజీ అమ్మాయిలకి మాత్రం కలందానం చెయ్యగూడదు. ఇంతకి మించిన మహాపాపం, గొప్ప శిక్ష ఇంకేదీ వుండబోదు.

వకుళ ఆరోజు ఎంత నంగనాచిలా ముఖం పెట్టింది? ఆ అమాయకత్వానికి బుట్టలోపడి పాపం... నోట్సు రాసుకుంటుంది గదాని కలం ఇస్తే.... అమ్మపిల్లా....

కలాన్ని అడ్డుపెట్టుకుని ఎంతనాటకం ఆడింది...

ఏమైనా ఈ నాటకం ఇంకా పూర్తి కాలేదు. ఎప్పుడు తెరదించుతుందో అర్థంకాకుండా వుంది. కర్టెన్ ఆమె చేతుల్లోనే వుంది. కాబట్టి అది ఆమె ఇష్టం.... నాటకం ఇంక ఏం వరాకాష్టకి తీసుకెళుతుందోనన్న ఆలోచనరాగానే భీమన్నకి ఒక్కసారి ఒళ్ళంతా కంపించినట్లయింది. ఆవిడ తెరదించకముందే తానే ఈ నాటకానికి స్వస్తి చెప్పాలి.

ఇంటా బయటా తనని అభానుపాలు చేస్తున్న ఆ మాయలమరాఠీ ఆటలు కట్టించాలి. ఈ వ్యవహారానికి సంబంధించి ఆ సుండి క్ష

వరకు మొత్తం కథ పూసగుచ్చినట్లు బామ్మకి చెప్పెయ్యాలన్న నిర్ణయానికొచ్చాడు.

ఇంతలోనే భీమన్న అంతరంగం అతనికి హిత బోధ చేసింది.

పిచ్చివాడా... మళ్ళీ ఆ వ్యవహారమంతా ఆ మునలమ్మ ముందు తిరగదోడి ఎందుకు ఆమె ఆరోగ్యాన్ని మళ్ళీ చెడగొడతావు. నువ్వు చెప్పిందంతా విని ఆమె అగ్గిమీద గుగ్గిలం కావడం ఖాయం. వకుళమీద దుమ్మెత్తి పొయ్యడం ఖాయం. ఆ ఆగ్రహావేశాలతో మున లమ్మకి బి.పి. పెరగడం అంతకన్నా ఖాయం.

"అమ్మో.... ఇలా జరగడానికి వీల్లేదు" భీమన్న గొణిగాడు. ఇందులో సెంట్‌పర్సెంట్ యదార్థం వుంది. బామ్మ ఇప్పుడిప్పుడే మళ్ళీ మామూలు మనిషవుతోంది . అనవసరంగా కెలికి మళ్ళీ నెత్తిమీదికి తెచ్చుకునేకన్నా కష్టమో నిష్టూరమో తానొక్కడే భరించడం మేలన్న నిర్ణయానికొచ్చాడు.

ఆరోజంతా బామ్మ అతనితో చాలా ముభావంగా వుండిపోయింది.

భీమన్నకి ఇది లోటుగానే వుంది.

ఆ అసంతృప్తి లోనుంచి వకుళమీద ఆగ్రహంపుట్టుకొచ్చింది.

ఎంత అణచుకుందామనుకున్నా ఆగని కోపంతో....

గబగబా బట్టలు వేసుకొని వకుళ కాలేజీ హాస్టల్ వైపు నడిచాడు.

బామ్మకి ఇదేమీ అంతుబట్టక వాకిట్లోకి వచ్చి కేకేసింది.

భీమన్న అదేమీ పట్టించుకునే స్థితిలో లేడు.

ముందు వకుళని కలిసి ఆవిడకి లెఫ్ట్ అండ్ రైట్ తీసుకోవాలి. ఇదే అతని లక్ష్యం. ఉమెన్స్ హాస్టల్ అదే రోడ్డులో వుందని తెల్సుగాని ఎప్పుడూ అతను అటువైపే వెళ్లలేదు. బోర్డు కనిపిస్తుందిగదాని రోడ్డుకి రెండువైపులా వెతుకుతూ మెల్లమెల్లగా ముందుకి నడుస్తున్నాడు.

రెండు ఫర్లాంగులు నడిచాడో లేదో....

•వకుళే ఎదురొచ్చింది.

మాస్టార్ని చూస్తూ నవ్వుతూ పలకరించింది.

భీమన్న మాత్రం చాలా నిబ్బరంగా కనిపించాడు.

"ఇటు ఎక్కడికి మాస్టారూ?"

"నీ దగ్గరకే"

"బామ్మ పిలుచుకురమ్మందా?"

"అవును. అహ... లేదు. నేనే... నాఅంతట నేనే వచ్చాను" అన్నాడు చాలా పొడిపొడిగా.

చల్లని సాయంకాలం... వాతావరణం చాలా ఆహ్లాదకరంగా వుంది. వకుళ తలారాస్నానం చేసి కొత్తగా కొనుక్కున్న డ్రస్ వేసుకుని బామ్మ గారింటికి బయల్దేరింది. ఇంతలో భీమన్న ఇలా ఎదురుపడ్డాడు.

మాస్టారు తనకోసం పనిగట్టుకుని ఎందుకొచ్చారో ఓ పట్టాన అంతుబట్టలేదు వకుళకి. చాలాసేపటికి ఓ చిలిపి ఆలోచన వచ్చింది.

'పాపం మనసు నావైపు పీకిందేమో' అనుకోగానే ఆమె మనసంతా అనిర్వచనీయమైన ఆనందంతో నిండిపోయింది.

"పని కట్టుకుని నాకోసం ఇంతదూరం నడుస్తూ వచ్చినందుకు నిజంగా చాలా థాంక్స్ మాస్టారూ" చాలా మార్దవంగా చెప్పింది.

భీమన్న అదోలా వకుళ ముఖంలోకి చూసి మళ్ళా చూపులు మరల్చుకున్నాడు. అతని సీరియస్‌నెస్ మాత్రం తగ్గలేదు.

"వెనక్కి తిరగండి... వెళదాం. నేనూ మీ ఇంటికే బయల్దేరాను" అన్నది.

"మా ఇంటికి వెళ్ళక్కర్లేదు" అన్నాడు ఖచ్చితంగా.

"మరి మా హాస్టల్‌లో మగవాళ్ళకి ప్రవేశంలేదే" అన్నది.

"ఇక్కడే ఎక్కడన్నా కూర్చుని కాసేపు మాట్లాడుకుందాం" అన్నాడు సీరియస్‌గానే. మాస్టారేమిటి ఇలా మారిపోయారు... అనుకుంది వకుళ.

ముఖంమీద పడుతున్న వెంట్రుకల్ని వెనక్కి తోసేస్తూ-

"పక్కరోడ్డులో పిల్లల పార్కుంది. అందులో కూర్చోవచ్చు. వెళదామా" అంది.

"ఓకే...పద" అన్నాడు పైకి.





లోలోనమాత్రం "అక్కడైతే నిన్ను తాపీగా కూర్చోపెట్టి తలంటి పొయొచ్చు పద" అనుకున్నాడు.

ఇద్దరూ ఓ అయిదు నిముషాల్లో పార్కు చేరుకున్నారు.

పార్కంతా పిల్లలతో కోలాహలంగా వుంది...

పిల్లలు కేరింతలు కొడుతూ రకరకాల ఆటల్లో మునిగివున్నారు.

భీమన్న వకుళ పార్కులో ఓమూలగా ఒక చెట్టుకింద కూర్చున్నారు.

అయిదు నిముషాలసేపు ఇద్దరికీ మాటలే కరువయ్యాయి.

మాస్టారే మాట్లాడతార్లేనని వకుళ దూరంగా పిల్లలవైపు చూస్తూ కూర్చుంది.

భీమన్న మనస్సు మాత్రం అట్టుడికినట్టు ఉడికిపోతోంది.

వకుళని ఉతికి ఆరేసే విషయంలో ఏమాత్రం రాజీపడదలుచుకోలేదు. ఎటొచ్చీ సబ్జెక్టుని ఎలా మొదలుపెట్టాలన్నదే అతని సంకోచమంతా.

రకరకాల కోణాల్లో నుంచి ఆలోచిస్తున్నాడు.

అయిదు... పది... నిముషాలు గడిచాయి.

వకుళకి బోర్‌గా వుంది. ఇక్కడికొచ్చింది మౌనవ్రతం పాటించడానికా... ఇది హాయిగా ఇంట్లోనే కూర్చుని చేసుకోవచ్చుగదా... అనిపించింది.

మాస్టారివైఖరి ఆమెకి కొంచెం విసుగు తెప్పించింది. అయినా విసుగు చెందాల్సిన సమయం ఇది కాదనుకుని మళ్ళా తానే మూడ్ మార్చుకుంది.

"ఎంతైనా మాస్టారుగదా... స్టూడెంట్‌తో సిగ్గిడిచి మాట్లాడేందుకు జంకుతున్నారు... పావం స్టార్టింగ్ ట్రబుల్‌లా వుంది. అదేదో నేనే చేస్తేపోతుంది." అన్న నిర్ణయానికొచ్చి-

సంభాషణల పర్వానికి తానే శ్రీకారం చుట్టింది.

"మధ్యాహ్నం సినిమా ఎలావుంది మాస్టారూ?"

'నా మొహంలా వుంది' అనబోయి-

ఇంకా తగ్గని ఆవేశంతో-

"నీమొహంలా వుంది" అన్నాడు. అన్నాడేగాని వెంటనే నాలిక్కరుచుకున్నాడు.

వకుళ ఆ మాటల్ని సీరియస్‌గా తీసుకోలేదు.

"నా మొహంలా వుందంటే బాగుందన్నట్టు లెక్కే... అవునా?" అంది నవ్వుతూ.

అప్పటికే- నోరుజారానన్న పశ్చాత్తాపంలో వున్న భీమన్న తన పొరపాటును కప్పివుచ్చుకునేందుకు అన్నట్టుగా 'అవునవును' అంటూ గొణిగాడు.

మళ్ళా సంభాషణల్లో ప్రతిష్ఠంభన!

"ఏమిటీ వెర్రిపంతులు... కిక్‌ఇచ్చినా అందుకోడేం?" అనుకుంది వకుళ. మళ్ళా తానే రాజీపడింది... డైలాగ్స్‌కోసం టాపిక్స్ వెతుకులాటలో పడింది.

ఓ అయిదునిముషాల తర్వాత-

"బొమ్మ బాగుందా..." అన్నది యధాలాపంగా.

భీమన్న చేత పిచ్చాపాటి కబుర్లు మాట్లాడించడానికి వీలుగా అతనికి లిఫ్ట్ ఇవ్వాలన్న ఉద్దేశంతో చాలా క్యాజువల్‌గా అన్నది.

"ఆఁ... బాగానే వున్నది ఇంతవరకు... నీ దయవల్ల" అన్నాడు భీమన్న...

వకుళకి ఏమీ అర్థంకాలేదు.

మాస్టారు ఎందుకిలా అఫెండింగ్‌గా మాట్లాడుతున్నారన్న ఆలోచనలో పడిపోయింది.

భీమన్నకి మాత్రం చక్కని అవకాశం దొరికింది. ఇదే పాయింట్ నుంచి శ్రీకారంచుట్టాలనుకున్నాడు.

వచ్చిన ఈ అవకాశాన్ని జారవిడుచుకుంటే తనకన్నా మూర్ఖుడు మరొకడు వుండడు అనుకుని గుండెనిండా దమ్ము పీల్చుకుని- ఎంతో ఆత్మవిశ్వాసంతో రంగంలోకి దిగాడు.

"ఏం... నేనన్నది వినబళ్ళేదా?" అన్నాడు వకుళ ముఖంలోకి చూస్తూ.

"వినబడింది" అన్నది వకుళ అదోలా ముఖంపెట్టి.

"ఏవిటి... మా బొమ్మని ఆరోగ్యంగా బతకనివ్వదలుచుకోలేదా?" అన్నాడు.

వకుళకి ఆ మాటలు బాధకలిగించాయి. మాస్టారేమిటి ఇలా. మాట్లాడుతున్నారనుకున్నది.

"నేనిప్పుడేం చేశానని?" అన్నది చాలా చిన్నగా.

"ఒకసారి ఆస్పత్రిలో జాయిన్ చేయించావు గదా!"

"నేనా?" నమ్మలేనట్టు చాలా బరువుగా వచ్చిందా ప్రశ్న!

"మరి... నేననుకున్నావా?"

వకుళ ఈసారి నోరుమెదపలేకపోయింది.

"నీమూలానే ఆ ముసలావిడ ఆస్పత్రిపాలైంది"

వకుళ నుంచి సమాధానం రాకపోయేసరికి:

'డీలాపడిపోయింది అమ్మడు' అనుకున్నాడు భీమన్న.

"నువ్వు మా ఇంట్లోపాగా వెయ్యకముందు నేను, బామ్మ ఎంత సంతోషంగా, ఎంత అన్యోన్యంగా వుండేవాళ్ళమో తెల్సా? నువ్వొచ్చి మా ఆనందంలో నిప్పులు పోశావ్... బామ్మ ఇప్పుడు నన్నొక శత్రువుని చూసినట్టు చూస్తోంది. నామాట మీద నమ్మకమేపోయిందామెకి. మా ఇద్దరిమధ్యా మాటలే కరువయ్యాయి" అన్నాడు గడగడా పాఠం చదువుతున్నట్టుగా



తనని వెతుక్కుంటూ వచ్చి తనతో ఏకాంతంగా మాట్లాడాలని చెప్పింది సరదాగా మనసువడి కాదన్నమాట- వకుళ భీమన్న చెబుతున్నదంతా విన్న తర్వాత ఒక నిర్ణయానికొచ్చింది.

"నీకు ఆరోజు కలం ఎందుకిచ్చాను?" సమాధానం చెప్పమన్నట్లు వకుళ మొహంలోకి చూశాడు కాసేపు.

ఆమెనుంచి బదులు రాకపోవడంతో మళ్ళీ తనే అందుకున్నాడు.

"ఏమోలే పాపం... ఆడపిల్ల... మళ్ళా నోట్సుకోసం ఎవర్ని అడుగుతుంది. అని జాలి పడ్డానేగాని నువ్విలా జంతర్‌మంతర్ చేస్తావనుకోలేదు"

"మాస్టారూ... మాటలు సరిగ్గా రానివ్వండి. జంతర్‌మంతర్ ఏం చేశానండి?" వకుళలో వుక్రోషం ఒక్కసారిగా పెల్లుబికింది.

"కలం నువ్వు తీసుకుని బామ్మకెందుకు అబద్ధం చెప్పాల్సివచ్చింది?"

"మాటలు తిన్నగా రానివ్వండి. కలం విషయంలో మాత్రం బామ్మకినేనొక్క అబద్ధం కూడా చెప్పలేదు"

"మరైతే నేను కాలేజీలో ఓ అమ్మాయి అడక్కుండానే కలం ఇచ్చానని ఎందుకు చెప్పావ్?"

"అవును. నిజంకాదా... నేను కాలేజీ అమ్మాయిని కానా... ఆరోజు క్లాసులో ఏం జరిగిందో గుర్తుకు తెచ్చుకోండి. మీరు నన్ను లేపి నోట్సు ఎందుకు రాసుకోవడంలేదు అని అడిగారు. పెన్నులో ఇంకు అయిపోయింది అన్నాను. అంతే అంతకు మించి నేను ఒక్కమాట కూడా నోరుజారలేదు. మిమ్మల్ని పెన్ ఇవ్వమని అడగను కూడా అడగలేదు. మీరే జేబులో నుంచి తీసిచ్చారు. బాగా గుర్తు తెచ్చుకోండి" అన్నది.

భీమన్న డిఫెన్స్‌లో పడ్డాడు. వకుళ చెప్పిందంతా నిజమేననిపించింది.

"మరైతే కలాన్ని నేను ఆ అమ్మాయికి కానుకగా ఇచ్చానని ఎందుకు చెప్పావ్?"

"మళ్ళీ ఆ అమ్మాయి అంటారేమిటి? ఎవరా అమ్మాయి. నేనేగదా... బామ్మకి నేను వేరేవాళ్ల పేరేదీ చెప్పలేదుకదా... నాకు మీరు ఆ కలం కానుకగా ఇచ్చినమాట నిజంకాదా? మీరే మీ నోటిమీదగానే చెప్పారుగదా" అన్నది వకుళ.

భీమన్నకి మళ్ళీ పాయింట్ దొరకలేదు.

ఈ వ్యవహారంలో ఇంత లిటిగేషన్ వుందా అనుకున్నాడు.





"పెన్ తీసుకున్న ఫ్రెండ్‌తో కల్సి సినిమాకు వెళ్ళానని ఎవరు చెప్పారు బామ్మకి?"

"నేనే"

"ఎందుకు?"

"ఏం... చెబితే? నిజంకాదా...?"

భీమన్న మాట్లాడలేదు.

"మాట్లాడరేం... మీదగ్గర పెన్ను తీసుకున్నది బామ్మ దృష్టిలో వేరెవరో కావచ్చు. కాని మీకు, నాకు తెల్సు ఆ వ్యక్తి నేనేనని. మరి నాతో మీరు సినిమాకి వచ్చిన మాట నిజం. ఇంత వచ్చి నిజాన్ని నిర్భయంగా చెప్పాల్సింది బామ్మకి చెప్పకుండా వస్తానని నాతో అన్నారు గుర్తుందా? ఆ ముసలావిణ్ణి ఇద్దరికిద్దరం మోసం చెయ్యడం ఇష్టంలేక మీ విషయం నిజం చెప్పేసి నేను సినిమాకి వచ్చేశాను" అంది.

భీమన్నకు చెమటలుపట్టాయి.

"ఏం తెలివి తల్లీ... నీ తెలివికి జోహార్లు" అనుకున్నాడు.

"నీ చేష్టలతో ఆవిడకి అనవసరంగా బి.పి. పెరిగేట్టు చేశావ్‌గదా"

"అంటే... బామ్మ ఆస్పత్రిపాలయింది నావల్లేనంటారా?"

"ముమ్మాటికీ... బామ్మ ఇంతవరకు... ఆమాటకొస్తే నేను పుట్టి బుద్ధెరిగిగాక తలనొప్పి అని కూడా అని ఎరగదు. అలాంటిది ఉన్నట్టుండి ఒక్కసారి ఆస్పత్రిపాలైంది" అన్నాడు భీమన్న.

ఇంతపెద్ద నిందవేసినందుకు మరో అమ్మాయి అయితే భోరుభోరున అక్కడే ఏడ్చేసేది. కాని వకుళకి మాత్రం ఏడుపు రాలేదు సరికదా భీమన్నమీద కోపమూ రాలేదు.

భీమన్న ఆలోచన్లు ఏస్థాయిలో వున్నాయో తెలిశాక ఆమెకి జాలేసింది.

సనాతన సంప్రదాయాల, ఛాందస భావాల పరదాయే బామ్మ అనుకుంటే, ఆ పరదా మాటున పెరిగిన బిడ్డడు- భీమన్న! పాపం బామ్మచాటు మనవడు. ఇదీ మాస్టారిమీద ఆ క్షణంలో వకుళకి ఏర్పడిన అభిప్రాయం. అందుకే అతనిమీద జాలేసింది.

మారుతున్న కాలానికి తగ్గట్టు- ఆమాటకొస్తే పెరుగుతున్న వయస్సుకి తగ్గట్టు మాస్టారు ఆలోచించడం ఏనాడో మానేశారు అనుకుంది. ఊహ తెలిసీ తెలియని వయస్సులో బామ్మంటే ఎలా చూశేవాడో, ఎలా ఆలోచించేవాడో ఇప్పుడూ అలాగే. ఆ ఆలోచన్లు, భావాలతోనే మనిషి చలిమిడి ముద్దలా అయిపోయాడనుకుంది.

సూపర్‌సోనిక్ స్పీడ్‌తో వయనిస్తున్న కాలంలో తానుమారి, బామ్మని మార్చాల్సింది పోయి... ఎక్కడ వేసిన గొంగళి అక్కడేనన్న సామెతలా మిగిలిపోబట్టే... తానందరికీ వింతగా కనిపిస్తున్నానన్న విషయం మాస్టారికి తెలీడంలేదు. తానెందుకు పదిమందిలో ఫెయిల్ అవుతున్నదీ వాస్తవాల మైక్రోస్కోప్ నుంచి గమనించాలన్న ఆలోచనే ఆయనకి లేదు. ఏమైనా తానొక బాధ్యత నెత్తినేసుకోవాల్సిన సమయం ఇంతకి మించి ఇక రాదు.

అమాయకుడైన ఓ మాస్టారికి తన స్టూడెంటే జీవనసత్యం బోధించాల్సిరావడం బాధ్యత కాక ఇంకేమవుతుంది అనుకుంది.

తనమీద ఎన్నెన్నో అపోహలు మాస్టారి మనసులో పొట్లతీగె మాదిరిగా అల్లుకుపోయివున్నాయి. ఆ అపోహలు తొలగిపోవాలంటే ముందు మాస్టారిని సంస్కరించక తప్పదు' అప్పుడుగాని నిజానిజాలు తెలుసుకోలేరు అన్న నిర్ణయానికొచ్చింది.

"మాస్టారూ... నేను పరిచయమయ్యాక బామ్మ ఆస్పత్రిపాలు కావడమే మీ అపోహకి కారణం. తెల్సా. వెనకటికి మీలాంటేవాడే అన్నాట్ట మిత్రుడితో- నువ్వు నావెంట రాబట్టే ఆ అగ్నిపర్వతం పేలిందని! కాని వాస్తవానికి అగ్నిపర్వతంలో లావా కుతకుత ఉడుకుతూ వుంటుందని, అది పరాకాష్ఠకి చేరినప్పుడు పర్వతం బద్దలవుతుందని అతనికి తెలీదు. తెలిస్తే అలా అనడు. మీ విషయమూ అంతే!"

"బామ్మకీ, అగ్నిపర్వతానికీ ఏమిటి లంకె?" అయోమయంగా చూస్తూ అడిగాడు.

"అవును మంచిలంకే వుంది. బామ్మ ఓ అగ్నిపర్వతంలా వుందన్న విషయం ఆమెని చూసిన మొదటిరోజే నేను గమనించాను.

"ఆహా... పెద్ద సైంటిస్ట్‌వే... మరి లావా

నంగతో?'' అన్నాడు ఉడుక్కుంటూ.

''మీరే''

''వకుళా...'' భీమన్న వెర్రిగా అరిచాడు.

''నువ్వు మరీ హద్దులు మీరుతున్నావ్' అన్నాడు నేలమీద పచ్చిగడ్డి పీకుతూ.

''బామ్మ మీ మీద ఎన్నో ఆశలు పెట్టుకుంది. మీరు వాటినేమీ గమనించలేదు. దాంతో మీ ప్రవర్తన ఆమెలో అసంతృప్తికి బీజాలు వేసింది... అవి రోజురోజుకీ పెరుగుతూ వచ్చాయి. చివరికి మానసికంగా ఆమె కుంగిపోసాగింది- ఇదంతా మీకు తెల్సా?''

'ఆవిడకి వెర్రిమొర్రి సెంటిమెంట్లన్నీ వున్నాయి' అవన్నీ నీకేం తెల్సు... అన్న ధోరణి వుందా మాటల్లో.

''నచ్చకపోయేసరికి మీరు వాటికి సెంటిమెంట్లు అని పేరుపెట్టుకున్నారు. కాని ఆమెకి... అవే ఆమె జీవితలక్ష్యం. మీమీద వున్న అసంతృప్తివల్లనే ఆమె ఎప్పుడూ ఏదో ఒకటి ఆలోచిస్తూ వుంటుంది. ఆ మానసిక ఆందోళన వల్లే రక్తపోటు మొదలైంది... ఇవేమీ మీరు గమనించరు''

''ఆమె జీవితలక్ష్యం ఏమిటో తెల్సా?'' అడిగాడు శాంతంగానే.

''ఏమిటి?''

''చెబితే నవ్వుతావ్''

''అంటే మంచిదేనన్నమాట''

''జోకులెయ్యకు''

''వింటే ఏడుస్తావ్ అంటారనుకున్నాను''

''నేను వేములవాడ భీమకవి అంతటివాణ్ణి కావాలంటుంది''

''అంటే...''

''అంటేగింటే ఏముంది? వేములవాడ భీమకవి నోటిమీదుగా ఏమాటంటే ఆ మాట







అక్షరాలా అయితీరేదని చరిత్ర చెబుతున్నది. నేనూ అంతటివాణ్ణి. అయిపోయి పూరువూ రంతటినీ గుప్పిట్లో పెట్టుకొని రాజ్యమేలా లంటుంది- అది సాధ్యమా?''

భీమన్న తన తాత, తండ్రుల వ్యవహారం మొత్తం వకుళకి వివరించాడు.

"బామ్మ మూర్ఖత్వం నీకు తెలీదు వకుళా. తాతగారి వంశంలో వెనకెప్పుడో ఎవరో లుంగీలు కట్టడం మొదలుపెట్టిన రోజే చనిపోయాట్ట. అప్పట్నుంచి లుంగీలు బంద్. అందుకే బామ్మ నన్ను నిక్కర్లు వాడమంటుంది. ఏమిటీ ఛాదస్తం?''

"ఇలాంటి ఛాదస్తాలు ఒక్క బామ్మకే గాదు... ఆ రూపంలో కాకపోయినా ఏదో ఒక రూపంలో ఇప్పటికీ మనసమాజంలో వున్నాయి. ఏదేమైనా మీరు బామ్మని మార్చడానికి చిత్తశుద్ధితో ఎన్నడూ ప్రయత్నించలేదన్నది మాత్రం నిజం''

"అసలా ఆలోచన, అవకాశం రానిస్తేనే గదా!''

"బామ్మని కూపస్థమండూకంలా మీరు ఇంటి నాలుగ్గోడలకే పరిమితం చేయడం మొదటి తప్పు... ఇవతల సమాజం ఎంతగా ముందుకెళుతోందో గమనించే అవకాశం మీరెప్పుడైనా ఆమెకి కల్పించారా?''

భీమన్న ఆలోచనలోపడ్డాడు. ఇందులో ఎంతైనా నిజం లేకపోలేదని అతని అంతరాత్మ చెబుతోంది.

"మీమీద తల్లిప్రేమ కొద్దీ మిమ్మల్ని చలిమిడి ముద్దగా మార్చిన ఆ బామ్మగారే- మారుతున్న సమాజంలో తన మనవడూ పోటీపడి పరుగెత్తాలని అంతే ప్రేమతో ఆశపడేది- తెల్సా?''

వకుళ ఏవేవో భావనా లోకాల్లోకి వెళ్ళిపోయి అనర్గళంగా మాట్లాడుతోంటే భీమన్న నోరుతెరిచి ఆమెనే చూస్తూ వింటూ కూర్చుండిపోయాడు.

అంతక్రితం వరకు వకుళ మీదవున్న ఆగ్రహమంతా క్రమంగా చల్లారిపోయింది. పైపెచ్చు ఆమె మీద ఇప్పుడిప్పుడే సద్భావం కలగసాగింది.

తన సమస్యల పరిష్కారానికి వకుళ సాయపడగలదన్న నమ్మకం కలగసాగింది.

ఇప్పటివరకు బామ్మవిషయంలో వకుళ చెప్పిందంతా నిజమే.

తనకి వూహ తెలిశాక ఇప్పటిదాకా బామ్మ ఏనాడూ గుమ్మందాటి ఎరగదు... లోకమంటే ఏమిటో తెలియదు. ఒకరకంగా తానూ ఇందుకు బాధ్యుడే... ఆమెని కూపస్థమండూకంలా వుంచేశాడు... అనుకున్నాడు.

"మరి దీనికి పరిష్కారం ఏమిటంటావ్?'' అన్నాడు కూల్‌గా.

దూరంగా పిల్లలు ఫుట్‌బాల్ ఆడుకుంటూ వుంటే బంతివచ్చి భీమన్న తలకు తగిలింది. భీమన్నకి కోపం ముంచుకొచ్చింది. బంతిపట్టుకుని తన దగ్గరే వుంచుకున్నాడు.

"బంతి ఇచ్చేయండి బావుండదు'' అంది వకుళ.

"నా తలకేసి ఎందుకు కొట్టాలివాళ్ళు?'' అన్నాడు కోపంగా.

"ఇదుగో... ఇక్కణ్ణించే ముందు మిమ్మల్ని మీరు సంస్కరించుకోవాలి. బామ్మని సంస్కరించడం ఆ తర్వాత'' అన్నది నవ్వుతూ.

"ఏమిటి... నువ్వు కూడా వాళ్ళనే సమర్థిస్తావా?'' అన్నాడు ఉక్రోషంగా.

భీమన్న చేతిలో బంతిని వకుళ తీసేసుకుని దూరంగా పిల్లలవైపు విసిరేసింది.

"వాళ్ళు చిన్నపిల్లలు. ఏదో ఆడుకుంటూ వుంటే వచ్చి తగిలింది. దానికి ఇంత సీరియస్సా? ఆమాటకొస్తే వాళ్ళు ఆడుకుంటున్నచోట కూర్చోవడం మనదే తప్పు... మీ తలకి తగిలింది వాళ్ళు ఆడుకుంటున్న బంతేకాని మరేరాయో కాదుగదా... ఇలా ఆలోచించారనుకోండి... ఆ పిల్లల మీద కోపమే కాదు పైపెచ్చు మనకి దొరికిన బంతిని చిర్నవ్వుతో మనమే వాళ్ళకి అందిస్తాం. ఇది సంస్కారం... పదిమంది మెచ్చే సంస్కారం''.

"నువ్వు చెప్పింది బాగానే వుంది వకుళా'' అన్నాడు శాంతంగా.

"థాంక్స్...''




"ఎందుకు నా కాంప్లిమెంట్‌కా?"

"లేదు... నేను మిమ్మల్ని కన్విన్స్ చేయగలిగినందుకు"

నవ్వాడు భీమన్న. వకుళ కూడా ఆ నవ్వుతో శృతికలిపింది.

"మీరు ఒప్పుకుంటే బామ్మని సంస్కరించే బాధ్యత కూడా నానెత్తినే వేసుకుంటాను" అన్నది.

"ఓయస్.. నిరభ్యంతరంగా..." అన్నాడు భీమన్న వెంటనే.

"అయితే అందుకు మీరు నాకెంతో సహకరించాల్సి వుంటుంది"

"మ్యార్‌మ్యార్... నన్నేం చేయమంటావ్ చెప్పూ?"

"స్టెప్ బై స్టెప్... మీరు అర్జంటుగా ఒక టీవీ కొని ఇంట్లో పెట్టండి. రెండు నెలల్లో బామ్మ ప్రపంచం చుట్టివచ్చినంత జ్ఞానం నేర్చుకుంటుంది"

"టీవీయా?" అయోమయంగా చూశాడు భీమన్న.

"అవునండీ... దానివల్ల రెండులాభాలున్నాయి"

"ఏమిటవి" కళ్ళు రెపరెపలాడిస్తూ అడిగాడు ఆసక్తిగా.

"మీరు కాలేజీకి వెళ్ళారనుకోండి. బామ్మకి వ్యాపకం ఏమిటి?"

"వేరే వ్యాపకం ఎందుకు. నేనున్నాగా... నేను ఎప్పుడెప్పుడు ఇంటికొస్తాను... జాగ్రత్తగా వస్తానా రానా... ఇదే ధ్యానలో సాయంత్రందాకా గడుపుతుంది. వేళకి నేను పోలేదనుకో... ఇక కంగారుపడటం మొదలుపెడుతుంది. దేవుణ్ణి ప్రార్థిస్తుంది. పిల్లల్ని నాకోసం వూరిమీదికి పంపుతుంది. అంతెందుకు ఇందాక నేను వచ్చేటప్పుడు చెప్పిరాలేదు. ఈపాటికి నాకోసం బాల సిపాయిలని రోడ్డుకి తరిమివుంటుంది. అనకూడదుగాని ఛస్తున్నాననుకో ఆవిడ బాధస్తంతో." అన్నాడు.

"ఇంట్లో టి.వి వుందనుకోండి... నాలుగురోజుల్లో అదే ఆవిడ నేస్తమైపోతుంది. బామ్మ మననును ఆవిధంగా మీమీదనుంచి తప్పించవొచ్చు"

ఈ అయిడియా బావుందనిపించింది భీమన్నకి.

"ఇక రెండోలాభం ఏమిటంటే- మనం ఎటూ ప్రపంచాన్ని చుట్టి రాలేం. టి.విలో చూస్తూనన్నా లోకంలో నాలుగువైపులా ఏం జరుగుతున్నదో తెలుసుకోవచ్చు. అదేనగం జ్ఞానం. ఈ మారుతున్నకాలంలో టి.వి చిన్న పిల్లల్నే ఎంతగా ప్రభావితం చేస్తున్నదని... పాలుతాగే పిల్లాణ్ణి కదిలించండి... టి.విలో వచ్చే ప్రతి ఎడ్వర్‌టైజ్‌మెంట్‌నీ గడగడా చెప్పేస్తాడు"

భీమన్న ఆలోచనలోపడ్డాడు. వృద్ధులు బాలలతో సమానమన్న సూత్రం ప్రకారం బామ్మ కూడా బాలల జాబితాలోకి వస్తుందని గదా మొన్నెప్పుడో తాను అనుకున్నాడు. కాబట్టి వకుళ చెప్పిన చిట్కా బామ్మమీద కూడా పనిచెయ్యొచ్చు అనిపించింది.

"ఏమిటి ఆలోచిస్తున్నారు? డబ్బుల సమస్యా?" వకుళ అడిగింది.

"కాదు... దీనికీ బామ్మే సమస్య"

"అదెలా?"

"ముందసలు టి.వి కొనడానికి బామ్మ ఒప్పుకోవద్దూ. అన్ని వేలు పోసి కొనడానికి ఆమె ఒప్పుకోదు"

"మీ కాలేజీలో ఏదో లాటరీ తగిలిందని చెప్పండి"

"అబద్ధమా?"

"ఏం... హరిశ్చంద్రులా మీరు?"

"అంతటివాణ్ణి కాకపోయినా... చూస్తూచూస్తూ వెధవ టీవీ కోసం అబద్ధమాడాలా అని"

"వెధవ టి.వీ.యా?... కళ్ళు పోతాయ్... చూస్తూవుండండి. కొన్ని నెలరోజులకల్లా అది 'వీర టి.వీ' అని మీరనుకోకపోతే నామీద ఒట్టే. ఈ ఒక్కసారికీ అబద్ధం ఆడెయ్యండి. అయినా మీరేమీ చెడుకార్యం కోసమో, చెడువుద్దేశంతోనో అబద్ధం ఆడటంలేదుకదా?"

"అబద్ధంలో కూడా ఇంతవర్గీకరణ వుందా?"

"అబద్ధాలు రెండురకాలు తెల్సా? అవి ఒకటి మంచి అబద్ధం. రెండు చెడుఅబద్ధం.



మంచిపని కోసం అబద్ధమాడినా లేక అబద్ధం ఆడి మంచిపని చేసినా అది మంచిఅబద్ధం అన్నమాట. ఇక చెడుపని కోసం అబద్ధం ఆడినా ఆడి చెడ్డపని చేసినా అది చెడు అబద్ధం అవుతుంది. ఆలెక్కన మీరిప్పుడు ఆడేది మంచిఅబద్ధమే''

మాట్లాడేందుకు భీమన్నకి వేరే పాయింట్ దొరకలేదు.

మొత్తానికి కన్విన్స్ అయ్యాడు.

''సరే... రెండురోజుల్లో టి.వీ కొనుక్కొస్తా'' అని చెప్పాడు వకుళకి.

''ఓకే... మీరు ఆ ఒక్కపని చెయ్యండి మిగతా వ్యవహారం నేను చూసుకుంటా'' అన్నది.

మొత్తానికి వకుళ తన వాగ్ధాటితో భీమన్నని చాలావరకు ప్రభావితం చెయ్యగలిగింది.

వకుళ మాటలు వింటున్నకొద్దీ భీమన్నలో ఆశలు చిగురించసాగాయి.

బామ్మ ఆలోచనల్లో మార్పు తేగలిగితే అంత కుమించిన ఆనందం తనకేముంటుంది?

వకుళమీద ఆక్షణంలో ఒక్కసారిగా కృతజ్ఞ తాభావం ఉప్పొంగింది భీమన్నలో. దాన్ని అక్షరరూపంలో వకుళ ముందుంచాడు.

''సారీ... వకుళా... నిన్ను నేను ఎంతగానో అపార్థం చేసుకున్నాను. నీకు ఆనాడు కలం ఇవ్వడమే కొరివితో తల గోక్కున్నట్టయిందను కున్నానేగాని, దానివల్లే గదా ఇవ్వాళ మనకో అవకాశం చిక్కింది నిజంగా సారీ... సో.. సారీ... వకుళ'' చాలా పశ్చాత్తాపంతో అన్నాడు.

''ఆరోజు నేను కలం ఎందుకు అడిగానను కుంటున్నారు?'' భీమన్న కళ్ళల్లోకి చిలిపిగా చూస్తూ అడిగింది వకుళ.

''నీ పెన్నులో ఇంకు అయిపోయి నోట్సు రాసుకునేందుకు ఏమీలేక వూరికే కూర్చున్నావ నిగదా నేనిచ్చాను''

''నిజంగా నా కలంలో సిరా అయిపోలేదు. కావాలనే చిన్న అబద్ధం ఆడాను''

''ఎందుకు?''

''మీ కలం కోసం. నిజానికి నేను నా ఫ్రెండ్స్‌తో అప్పటికే ఒక పందెంలో ఇరుక్కు పోయి వున్నానుగాని... పందెం కోసమే అయితే ఆ క్షణంలోనే ఆవిధంగా అడిగివుండేదాన్ని కాదు. స్టాఫ్ రూంలో మీ భరతంపట్టేదాన్ని. కాని మీ కలం కక్కి, మీ చొక్కా జేబుకి సిరా కావడం నేను గమనించాను... ఇంకా అప్పటికది మిగ తా పిల్లల దృష్టికి పోలేదు. ఈమధ్యే ఒక సినిమా వచ్చింది. అందులో ఒక పోకిరి సీనులో హీరో జేబులో కలం కక్కి జేబంతా సిరాతో తడిసి ముద్దయితే హీరోయిన్ విరగబ డి నవ్వుతుంది. స్టూడెంట్స్‌కి ఇది చాలు మిమ్మ ల్ని గేలి చెయ్యడానికి. మిమ్మల్ని ఆ ఉపద్రవం నుంచి తప్పించేందుకు ముందు మీ జేబులో నుంచి ఆ పాడుకలం తీసేయించేందుకే నేను అలా చేశాను'' అని చెప్పింది...

తాపీగా వింటున్న భీమన్న కళ్ళల్లో నీళ్ళు చెమర్చాయి... వకుళమీద చెప్పలేనంత అభి మానం పుట్టుకొచ్చింది ఒక్కసారిగా.

''నన్ను అలా ఆదుకోవాలని ఎందుకని పించింది?'' ఆర్ద్రత నుంచి తేరుకోగానే అడి గాడు.

''మిమ్మల్ని ఆదుకోవడం నా బాధ్యతగా భావించాను'' అన్నది.

వకుళమీద భీమన్నకు కొత్త అభిప్రాయం రేకులు విచ్చుకోసాగింది...

''వకుళా... నీకెలా థాంక్స్ చెప్పాలో నాక ర్థంకావడంలేదు'' అన్నాడు ఆమెమీద ఇష్టంకొద్దీ.

''అందుకు మీరేమీ జుట్టు పీక్కోవాల్సిన పనిలేదు... ఏదో ఒకరోజు నేనూ మీకు థాంక్స్ చెప్పాల్సిన అవసరం వస్తుంది'' అన్నది నర్మగ ర్భంగా.

ఎందుకు, ఏమిటో భీమన్నకి అర్థంకాలేదు.

''ఇంతకీ అసలు సమస్య అలాగే మిగిలిపో యింది'' అన్నాడు.

''ఏమిటది?''

''అదే... నేను కలియగ భీముడిని కాకున్నా కనీసం భీమకవిని కావాలిగదా'' అన్నాడు నవ్వుతూ.

''ముందు బామ్మ ఆలోచనల్లో మార్పు తేవ డానికి ప్రయత్నిస్తాను. ఆ సమస్య గురించి కూడా ఆలోచిస్తాను. ఈలోగా మీరొక పనిచే





యండి. మీ ఫ్రెండ్ వున్నారుగదా.. జి.జి.రావ్... ఆయన సలహా అడగండి... కథకు డు కదా... మనకి ఉపయోగపడొచ్చు" అని చెప్పింది.

వకుళ సలహా బాగానే వుందనుకున్నాడు భీమన్న. సరేనన్నాడు. ఇంతలోనే నలుగురు పిల్లలు రోడ్డుమీద పోతూపోతూ భీమన్నని చూసి:

"ఆఁ... దొరికిపోయాడు... భీమన్న అంకుల్ దొరికిపోయాడు" అని అరుస్తూ అతని దగ్గరకొచ్చారు.

భీమన్నకి విషయం అర్థమైంది.

"ఏరా... బామ్మ పంపిందా?"

"ఔను అంకుల్..." అన్నారు కోరస్‌గా.

"చూశావా వకుళా. నేనిందాక అన్నాను గదా..." అన్నాడు వకుళవైపు చూస్తూ.

"నీమీద బామ్మకివున్న ఆపేక్షకి ఇది గుర్తు" అంది వకుళ.

"ఇదేమిటి... ఇంతలోనే ప్లేటు ఫిరాయించావా?" ఆశ్చర్యంగా అడిగాడు.

"ప్లేటు ఫిరాయించడం ఏమీ లేదండోయ్ మాస్టారూ! కాకపోతే బేసికల్‌గా బామ్మ సైకాలజీ చెప్పానంతే" అన్నది.

"ఇంక వెళదామా మరి... ఇంకొంచెం లేటయితే బామ్మే రావచ్చు" అన్నాడు.

ఈమాటలకి వకుళ నవ్వింది. భీమన్న కూడా జతకలిపాడు.

ఇద్దరూ లేచారు.

"నాకు మీ ఇంటికొచ్చే శ్రమ తప్పించారు. నేనిక హాస్టల్‌కెళతాను"

"ఒసారి ఇంటికొచ్చి వెళ్ళు..." అన్నాడు.

"చీకటిపడింది. మళ్ళీ వార్డెన్‌తో గొడవ... రేపు కలుస్తాగా... వస్తాను" అంటూ వకుళ తన హాస్టల్‌వైపు దారితీసింది.

భీమన్న తనని వెతుక్కుంటూ వచ్చిన పిల్లలతోబాటు ఇంటిదారి పట్టాడు.

ఇంటికెళ్ళగానే బామ్మ నిలదీసింది "ఎక్కడికెళ్ళావురా ఇంతసేపు?-" అంటూ.

మనస్సు బాగాలేక అలా షికారుకెళ్ళానన్నాడు.

"నీకోసం నేనెంత హడలుకు చచ్చానో తెల్సా?" అన్నది నిష్ఠూరంగా.

బామ్మ మనస్తత్వానికి నవ్వాలో ఏడ్వాలో అర్థంకాలేదు భీమన్నకి.

"బామ్మా బామ్మా... అంకుల్... మరేమో... అక్కడ... మరేమో... చిన్నపిల్లల పార్క్ దగ్గర ఎవరో అమ్మాయితో మాట్లాడుతూ కనిపించాడు బామ్మా..."అంకుల్‌ని తామే కనిపెట్టామన్న గర్వంతో డిటెక్టివ్ మాదిరిగా పోజుపెట్టాడో కుర్రాడు.

"ఎవరో అమ్మాయి ఏమిట్రా నీమొహం... రోజూ బామ్మగారింటికి వస్తుంటుందే ఆ అంటీయే"

మరొకడు అన్నాడు.

నలుగురిలో ఇద్దరు అవునని, ఇద్దరు కాదని వాళ్ళల్లో వాళ్ళకి అభిప్రాయ భేదాలొచ్చి చివరికి వెళ్ళిపోయారు.

బామ్మకి డౌటేసింది.

"ఎవర్రా ఆ పిల్ల?" అనుమానంగా చూస్తూ అడిగింది.

"వకుళే" జవాబిచ్చాడు.

"ఛీ... నోర్మూయ్. ఆ పిల్ల సంగతి నాకు బాగా తెల్సు... నిజం చెప్పు... నువ్వు కలం ఇచ్చావే... ఆ అమ్మాయితోనేనా బాతాఖానీ కొట్టింది?" రెట్టించింది.

అవునని అందామనుకుని అంతలోనే ఆగిపోయాడు.

బామ్మ దృష్టిలో తాను కలం ఇచ్చిన అమ్మాయి వకుళ కాదు. కొంపదీసి అవును అని అనివుంటే ఇల్లుపీకి పందిరేసివుండేది బామ్మ.

ఇప్పుడు బామ్మని ఎలా కన్విన్స్‌చెయ్యడం?

ఔనంటే ఓతంటా... కాదంటే ఓతంటా... ఈ అయోమయంలో జుట్టు పీక్కోబోతుండగా-

"ఆఁ... ఇప్పుడు తెలిసింది. నిజం చెప్పలేకే జుట్టు పీక్కోబోతున్నావ్ అంటే ఆ మాయలమరాఠీతోనేనన్నమాట నువ్వు మాట్లాడింది" అన్నది బామ్మ.

వెంటనే జుట్టులో నుంచి చేతులు తీసేశాడు.

ఈ సమస్యని వకుళే పరిష్కరించాలి తప్ప తన చేతుల్లో లేదు. రేపటిదాకా బామ్మచేత చెదురుమదురు వర్షంమాదిరిగా అడపాదడపా అక్షింతలు వేయించుకుంటూ ఓపికపట్టడం మినహా చేయగలిగిందేమీ లేదు.

మర్నాడు వకుళ వచ్చీరాగానే ముందు ఈ విషయమే అడిగాడు బామ్మ సందేహం తీర్చాలన్న ఉద్దేశంతో. వకుళ వింతగా చూసింది. రాత్రి జరిగిన గొడవంతా చెప్పాడు.

విషయం తెలిశాక వకుళ బామ్మ దగ్గరికి వెళ్ళి చెప్పింది- "నిన్న సాయంత్రం నేను ఇక్కడికి వద్దామని బయల్దేరాను. తీరా రోడ్డు మీద మాస్టారు ఎదురయ్యారు... ఆ పక్కనే పార్కులో పిల్లలు బంతిఆట ఆడుకుంటుంటే కాసేపు చూద్దాం అన్నారు మాస్టారు. సరేగదాని అక్కడ కూర్చున్నాం బామ్మా" అని చాలా తేలిగ్గా చెప్పేసింది.

భీమన్న డీలాపడ్డాడు.... ఇందులో కొంత నిజం... కొంత అబద్ధం అనుకున్నాడు.

మొత్తానికి తాను మాట్లాడింది వకుళతోనేనన్న విషయం వకుళే తననోటి మీదుగా చెప్పాక బామ్మ శాంతించింది. ఇంక వేరే ప్రశ్నలేవీ వెయ్యలేదు.

భీమన్నకి ఆశ్చర్యం వేసింది. తాను వకుళతో కలిసి తిరిగితే బామ్మకి అభ్యంతరం లేదని దీనర్థమా అన్న ఆలోచనలో పడ్డాడు.

వకుళని బైట పంచలో నిలేశాడు.

"ఏమిటి తల్లీ? నేను బంతి ఆట చూద్దామని పార్కుకి తీసుకెళ్ళానా నిన్ను?" అన్నాడు.

"ఆఁ... మరే... మీరు మహారాజులుగదూ... అందుకని... క్షీవణిని పేలుస్తానంటేనో... అంత రిక్షయానం చేస్తానంటేనో తీసుకువెళ్ళానని చెబుతున్నాననుకున్నారా. చూడండి మాస్టారూ... అలా చెబితే బామ్మ నమ్మద్దూ... ఆవిడ దృష్టిలో మీరిప్పటికీ పాలపీకంత బాలభీమకవిగారే. అందుకే బంతి ఆట చూస్తానన్నారని చెప్పాను. తేలిగ్గా నమ్మేసింది- తెల్సా?"

"వకుళా... నిజంగా నీ తెలివికి మళ్ళీ జోహార్లు" పైకే అన్నాడు.

వకుళ తేలిగ్గా నవ్వేస్తూ కాలేజీకి బయల్దేరి వెళ్ళింది.

* * *

జీజీ రావ్‌కోసం బయల్దేరాడు భీమన్న.

అతను రోడ్డుమీద నడుస్తున్నాడేగాని ప్రతిక్షణం వకుళ అతని మనస్సులో మెదులుతూనే వుంది.

పార్కులో ఆ అమ్మాయితో మాట్లాడాక తన మనస్సుని కప్పిన చీకటిపొర తొలగిపోయిందని భీమన్న ఇప్పటికి చాలాసార్లు అనుకున్నాడు. అలా అనుకున్న ప్రతిసారీ ఆమె మీద ఇంకా అభిమానం పెరుగుతూ పెరుగుతూ ఇప్పుడు కొండంత అయికూర్చుంది.

ముఖ్యంగా వకుళ ప్రతిభ అతన్ని ఆకట్టుకుంది. ఆ చురుకుదనం అతన్ని కట్టిపడేసింది. నిన్నటిదాకా ఆమె గుణాల్లో ఏవేవి అయితే అతనికి కంటగింపుగా అనిపించాయో ఇప్పుడు అవన్నీ చక్కని నక్షత్రాలై ఆమె ముఖంలో ప్రతిబింబిస్తూ, భీమన్న దృష్టిలో ఆమెకి మరింత వన్నెతెచ్చిపెడుతున్నాయి.

వకుళ పేరుకే స్టూడెంటుగాని సర్వం తెలిసిన జ్ఞాని, అనుకున్నాడు భీమన్న.

బామ్మ పుణ్యమా అని తను... చదువు...చదువు...చదువు... ఇది తప్పితే వేరే దేన్ని గురించీ ఆలోచించేవాడు కాదు. అందుకు ప్రతిఫలంగా డిగ్రీ అయితే వచ్చిందిగాని...లోకజ్ఞానం కరువైంది అనుకున్నాడు.

'వకుళకి జనరల్ ఎవేర్‌నెస్ బాగుంది' ఆమెని లోలోనే మెచ్చుకున్నాడు.

క్లాసులో పిల్లలముందు అభాసుపాలు కాకుండా వకుళ తనని రక్షించినతీరు భీమన్నని ముగ్ధుణ్ణిచేసింది.

చక్కని చొరవ, సమయస్ఫూర్తి... వీటన్నింటినీ మించిన అందం... ఆమె సొత్తు... ఇదీ వకుళ మీద భీమన్న స్థూల అభిప్రాయం.

భీమన్నలో స్తబ్ధత పోయి ఏదో తెలియని ఆనందం ద్యోతకమవుతోంది. తన మనస్సు ఇరవైనాలుగ్గంటలూ దూదిపింజంలా తేలిపోతుండటం అతను గమనించకపోలేదు. తన జీవితగమనం దారి మారబోతున్నట్లు అతనికి అనిపించింది.

నిన్నమొన్నటిదాకా వకుళ కనిపిస్తేనే




చిరాకు పడేవాడు.

కానీ ఇప్పుడు?

నిత్యం ఆమెకోసం ఎదురుచూపులే. మనస్సు లోలోనే ఆమెకోసం పరితపిస్తోంది. కాలేజీలో సైతం ఆమె ఉనికి అతన్ని ఇబ్బంది పెడుతూనేవుంది...

తన మనస్సు ఎందుకిలా ఆమెకోసం ఆరాటపడుతోందో అతనికి అర్థంకాకుండా వుంది.

ఇలా ఆలోచనల సుడిగాలిలో కొట్టుకుపోతూ నడుస్తున్న భీమన్న—

వీపుమీద ఛెళ్ళున పడిన దెబ్బతో ఈ లోకంలోకి వచ్చాడు.

తలతిప్పి చూస్తే జిజిరావ్.

"గొడ్డుని బాదినట్టు బాదావ్‌గదరా..." వీపు ఇంకా చురుక్ చురుక్‌మంటూనే వుంది భీమన్నకి.

"నువుమాత్రం రోడ్డుమీద గొడ్డుపోయినట్టు పోవడంలేదూ" జిజిరావ్ అన్నాడు.

చేత్తో వీపు రుద్దుకుంటూ జిజిరావ్‌వైపు అయోమయంగా చూశాడు భీమన్న.

ఆ బస్టాండ్‌లో నిలబడి ఎన్నికేకలేశానని. చప్పట్లుకొట్టినా వినబడదా... ఏలోకంలోకి వెళ్ళిపోయావురా?" అడిగాడు జి.జి.రావ్.

అంతటి బాధలోనూ భీమన్నకి సిగ్గేసింది. అయితే అదేమీ పైకి కనిపించనివ్వలేదు.

"అన్నట్టు బామ్మగారికెలావుందిప్పుడు?" జిజిరావ్ కుశల ప్రశ్నవేశాడు.

ఆ రోజు ఆసుపత్రిలో ఒకసారి కనిపించడం అంతే- ఆ తర్వాత పత్తాలేదు...

ఏదోపనుల వత్తిడితో మళ్ళీ రాలేకపోయానని తనంతతానే సంజాయిషీ చెప్పుకున్నాడు.

బామ్మ బాగానే కోలుకుందని చెప్పాడు భీమన్న...

'అలావెళ్ళి కాఫీ తాగుదాం పద' అన్నాడు జిజిరావ్— మిత్రుడి భుజంమీద చెయ్యేస్తూ.

భీమన్నకి వెంటనే పాతసంఘటన జ్ఞాపకమొచ్చింది. పరిసరాల్ని ఓమాటు పరీక్షగా చూశాడు... తాను, జిజిరావ్ మొదటిసారి కలుసుకున్న బస్టాప్ అదే. దానికి దగ్గర్లో వున్న ఏకైక

హోటల్ . కూడా వెంటనే గుర్తొచ్చింది. అందులో బుర్రమీసాల, ఆరడుగుల సూపర్వైజర్ కళ్ళముందు మెదిలాడు. ఆ సంఘటనంతా కళ్ళముందు సినిమారీలులా తిరిగింది.

జి.జి.రావ్ ఆఫర్‌ని భీమన్న తిరస్కరించాడు...

"కాఫీ వద్దు, ఏమీ వద్దుగాని నాక్కొంచెం నీ సలహా కావాలి. నీ కోసమే బయల్దేరాను. అనుకోకుండా నువ్విక్కడ తగలడం నా అదృష్టమేననుకోవాలి"

"సలహానా ... దాన్దేముంది... ఏమిటో చెప్పు" అన్నాడు జి.జి.రావ్.

"ఎక్కడన్నా కొంచెం తాపీగా కూర్చొని మాట్లాడుకుందాం" అన్నాడు భీమన్న చుట్టూ చూస్తూ.

"అలాగంటావా. సరే... అయితే అదుగో ఆ చెట్టుకింద సిమెంట్ బెంచీమీద కూర్చుని మాట్లాడుకుందాం పద" అంటూ దూరంగావున్న చెట్టుని చూపించాడు జి.జి.రావ్.

ఇద్దరూ అటువైపు వెళ్ళారు...

సిమెంట్ బెంచీమీద కూర్చోబోతున్నంతలో:

నాలుగు అడుగులు అవతలనుంచి ఓ బిచ్చగాడు పరుగెత్తుకునివస్తూ "సార్‌సార్... అది రిజర్వుడు సార్..." అన్నాడు.

"ఏమి రిజర్వుడయ్యా... అలాగని రాసిలేదే?" అన్నాడు జిజిరావ్.

వాడికి కోపమొచ్చిందో ఏమో... "రూల్స్ గీల్స్ నహీ చల్తా..." అన్నాడు.

"వీటికి రిజర్వేషన్లు ఎక్కడ దొరుకుతాయ్? మున్సిపాలిటీవాళ్ళు చేస్తారా?" మళ్ళీ అడిగాడు జిజిరావ్.

"ఆదేవో...వాటి వివరాలు నాకు తెలవదండి... నేనుమాత్రం అల్లంతదూరాన వుందగానే అనుకున్నాను ఈ బెంచీ నాది అని - అంతే" అన్నాడు బిచ్చగాడు.

"ఓహో... నువ్వు రిజర్వు చేసుకున్నావా?" అన్నాడు జిజిరావ్.

బిచ్చగాడు ఏమీ మాట్లాడకుండా కూర్చోబోతుంటే—

"ఇదుగో నా ఈ అరచెయ్యి వుంది చూశావూ... ఇప్పుడే నీరెండు చెంపల్ని రిజర్వు చేసుకుందయ్యా" అంటూ జిజిరావ్ చెయ్యెత్తాడు.

దబాయింపులతో పనిగడువుకునే ఆ బిచ్చగాడు బిత్తరపోయి—

వీడేదో గడునుపిండంలా వున్నాడనుకుని అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

"చూశావురా... నోరు లేకపోతే ఎన్నివిధాల మనం ఎక్స్ప్లాయ్‌టేషన్‌కి గురిఅవుతామో... ఇదే సాక్ష్యం... కూర్చో" అన్నాడు జిజిరావు.

ఇద్దరూ సిమెంట్ బెంచీమీద చతికిలబడ్డారు.

'ఇప్పుడు చెప్పు... ఏమిటో నీ సమస్య'— అన్నట్టు చూశాడు జిజిరావ్ భీమన్న ముఖంలోకి.

అయితే జిజిరావ్ మీద మొదట్లోవున్నంత ఆశ భీమన్నలో ఇప్పుడు లేదు.

ఇంతకుముందు బిచ్చగాడు సంఘటన చూశాక భీమన్న ఆలోచనలో మార్పు వచ్చింది...'

కొంపదీసి తన సమస్యకి పరిష్కారంగా దౌర్జన్యానికి దిగమంటాడేమోనన్న అనుమానపడ్డాడు. బిచ్చగాడి మీద జిజిరావు చెయ్యెత్తడం ఈ అనుమానానికి ఆస్కారం కల్పించింది. ఈ లెక్కన బామ్మని చావబాదమంటాడేమోననుకున్నాడు.

"ఏమిట్రా ఆలోచిస్తున్నావ్?" అన్నాడు జిజిరావ్ విసుగ్గా.

భీమన్న ఆలోచనలకి తెరపడింది.

ఇంతదూరం వచ్చాక వెనకడుగువేయడం ఎందుకు... అయినా వాడేం సలహా ఇస్తాడో వినకుండానే వాణ్ణి శంకించడం ఉత్తమ పురుషుని లక్షణం కాదు... అనుకుని తన సమస్యని జిజిరావ్‌కి వివరించాడు.

బామ్మతో తను పడుతున్న ఇబ్బందులు: కాలేజీలో తోటి లెక్చరర్ల వేధింపులు: చివరికి అటెండర్ గురవయ్య తననెంత వెధవకింద జమకట్టి చూస్తున్నాడో కూడా ఏకరువిగిన వివరించి చెప్పాడు భీమన్న. పకుళామీద తన అభిప్రాయం మారినందువల్ల ఆ అమ్మాయి





మీద మాత్రం ఏ పితూరీ చెప్పలేదు.

జిజిరావ్ అంతా ఓపిగ్గా విని చివర్లో-

చాలా సీరియస్‌గా ముఖంపెట్టి-

"చూడరా భీమా... నీ సమస్యని మాత్రం రెండుభాగాలుగా విభజించుకోవచ్చు" అన్నాడు లాజికల్‌గా. "రెండు కాకపోతే వెయ్యి భాగాలుగా విభజించుకో. నాకేం అభ్యంతరంలేదు... నాక్కావల్సిందల్లా..." భీమన్నని పూర్తిగా చెప్పనివ్వకుండానే-

ఇప్పుడు ఇందులో పెద్ద సమస్య... మీ బామ్మ సమస్య. దాన్ని కాసేపు అలా పక్కనుంచు... ఇకపోతే మిగిలిన సమస్యల్లా నువ్వే" అని తేల్చిపారేశాడు జి.జి.రావ్.

భీమన్న బిత్తరపోయాడు... సమస్యకి పరిష్కారం చూపుతాడని వీడిదగ్గరికొస్తే చివరికి నేనే ఓ సమస్యనంటూ తేల్చేశాడేమిటా అన్న సందిగ్ధంలో పడిపోయాడు భీమన్న. ఏమీ అర్థంగాక మిత్రుడి వైపు వెర్రిగా చూస్తూ కూర్చుండిపోయాడు.

"అలా అయోమయంగా చూడకు. ముందు నిన్ను నువ్వు కొంతలోకొంతయినా సంస్కరించుకోవాలిరా... నీ ప్రవర్తనలో మార్పు రావాలి" అని చెప్పాడు జి.జి.రావ్.

"ఎలాగంటావ్?"

"మధ్యలో ఎదురుప్రశ్నలు వేయొద్దు. నేను చెప్పేదంతా ఆసాంతం విన్నాక సందేహాలడుగు - సరేనా?" సరేనన్నట్టు తలూపాడు భీమన్న - అచ్చం ఆదర్శవిద్యార్థిలా.

"ఏపని చేసినా దాని పాన్స్ అండా కాన్స్- అంటే మీ తెలుగుభాషలో లాభనష్టాలు అంటారు ... అవునా?"

"అనుకోవచ్చు- అభ్యంతరంలేదు" అన్నాడు భీమన్న.

"వాటిని ఆలోచించి చెయ్యటం నేర్చుకోవాలి. నపోజ్ ఇందాక చెప్పావే - నీ కాలేజీ వ్యవహారం. నీతోటి లెక్చరర్లే నిన్ను ఏడిపిస్తున్నారని... చివరికి అటెండర్ గురవయ్యకి కూడా లోకువైపోయావని- నీకే గనుక మెదడు వుంటే- అందులో మట్టి గనక లేకుండా వుంటే- ఈ రెంటినీ ఒకేఒక్క చిట్కాతో పరిష్కరించుకుని వుండేవాడివి"

అయోమయంగా చూశాడు భీమన్న.

"అప్పుడు... ఇడియట్... టు బర్డ్స్ ఎట్ వన్ షాట్ అయ్యుండేది... గురవయ్యగాడికి నువు దసరా మామూలు ఇవ్వలేదనే కదా దొరికిపోయావ్... ఓ పాతిక రూపాయలు నీవి కాదనుకుని ఇచ్చేశావనుకో. నీమీద గౌరవం పెరుగుతుంది. నువు రైలువట్టాల మీద కనిపించినా, బాత్రూములో కనిపించినా నమస్కారం కొట్టకుండా మానడు - మళ్ళా దసరా వచ్చేదాకా!"

భీమన్నకి నవ్వొచ్చింది.

"నవ్వకు... మరో లాభం ఏమిటో తెల్సా... ప్రిన్సిపాల్ నిన్ను పిలవమని వాడికి చెప్పినప్పుడల్లా... సందర్భాన్నిబట్టి వాడు నిన్ను రక్షిస్తూ వుంటాడుగూడా" చెప్పాడు జిజిరావ్.

భీమన్నకి ఇదెలాగో అర్థమైచావలేదు. ఆ ఫీలింగ్స్ కనిపించేలా ముఖంపెట్టాడు.

"ఏ లెక్చరర్ అన్నా నీమీద మళ్ళీ ఫిర్యాదు చేశాడనుకో, ప్రిన్సిపాల్ నీకు తలంటిపోయాలనుకున్నాడనుకో, నిన్ను పిలుచుకురమ్మని గురవయ్యని పంపాడనుకో... వాడు క్యాంటీన్‌లో హాయిగా టీ తాగుతూ మరికాసేపు అలా అలా వ్యాహ్యాళిగా విహరించి ఓ అరగంటకి వెళ్ళి ప్రిన్సిపాల్‌కి ఏం చెబుతాడో తెల్సా? - సార్... భీమన్నసార్ కోసం కాలేజీ మొత్తం ఈ చివరి నుండి ఆ చివరిదాకా వెతికానండీ... అయినా కనబళ్ళేదు. చివర్లో వేరేసార్ చెప్పినారు గందా... భీమన్నసారూ బాత్రూంలోకెళ్లారని. కాని నిజానికి నీవుమాత్రం స్టాఫ్‌రూంలోనే వుంటావు. వాడు నీదగ్గరికసలురాడు. ఆ మాట కొస్తే స్టాఫ్‌రూం వైపే కన్నెత్తిచూడడు. తన యోగక్షేమాలు చూసేవాళ్లని వాడిలా అవద్పాందవుడిలా రక్షిస్తూవుంటాడు. మిగతావాళ్ళంతా పోరంబోకు వెధవలై వాడు అడగ్గానే దసరామామూళ్ళు ఇస్తున్నారనుకున్నావా?" అన్నాడు జి.జి. రావ్.

గురవయ్య విషయంలో తను చేసిన పొరపాటేమిటో గ్రహించాడు భీమన్న. రేపు కాలేజీకి వెళ్ళీవెళ్లగానే ముందు వాడికి దసరా మామూలు ఇచ్చెయ్యాలి అనుకున్నాడు అప్పుడే.

"ఇక క్లాసులో పిల్లల విషయం అంటావా...

సాధారణంగా ఎక్కడ చూసినా తెలుగుక్లాసులు అలాగే వుంటున్నాయి. ఎటొచ్చీ తెలుగుమాష్టారన్నవాడికి కమ్మనికంఠం వుంటే మంచిది. ఎప్పుడూ ఓ పాతిక పద్యాలు ఫింగర్‌టిప్స్ మీద వుండాలి... పిల్లల్ని మంచిమంచి జోకులతో నవ్విస్తూ, తనూ వాళ్లల్లో ఒక్కడై సందు చూసుకుని పాఠం లాగెయ్యగల నేర్పు ఒడుపు వుండాలి. ఇవన్నీ అనుభవంమీద వస్తాయనుకో"

"జోకులు నావల్లకాదురా బాబూ... ఆ కుళ్లు జోకులు నేను వెయ్యలేను"

"జోకులు అనగానే కుళ్లు జోకులేనా వున్నది. క్లాసికల్ జోక్స్ ఎన్నిలేవు?"

"ఏదీ ఒక్కటి చెప్పు... చూద్దాం"

జిజిరావ్ ఒక్కక్షణం ఆలోచించి- "ఈమధ్య రేడియోలో ఇంగ్లీషు వార్తలు వింటున్నా- ఫారెస్ట్ మినిష్టర్ మిస్సెస్ మేనాకాగాంధీ కాల్డాన్ ప్రయిమ్ మినిస్టర్ వి.పి. సింగ్ అని చెప్పాడు... వెంటనే మావాడు అందుకుని అంటే ఏమిటి డాడీ... మేనకాగాంధీ విపిసింగ్ నెత్తిన కాళ్ళుపెట్టిందనా చెప్పాడు... అని అడిగాడు... ఇందులో ఎంత ప్రాక్టికల్ జోక్ వుందో చూశావా?"

భీమన్న ఒక్క నిమిషం ఆలోచించాక జోక్ అర్థమైంది. ఆ తర్వాత నవ్వకుండా వుండలేక పోయాడు. "సరేగాని... ఇంతకీ నా అసలు సమస్యకి చిట్కా చెప్పలేదు. త్వరగా వెళదాం. అవతల నా కాలేజీ టైమ్ అవుతోంది" అన్నాడు భీమన్న.

"చెబుతారా... ఇందాకట్నుంచి నీతో మాట్లాడుతున్నానేగాని నామనసంతా దానిగురించే ఆలోచిస్తోంది. ఎన్నివిధాల ఆలోచించినా నాకు మాత్రం ఒకేఒక్క పరిష్కారం తోస్తోంది" అన్నాడు జిజిరావు.

"ఏమిటది చెప్పు" ఆత్రంగా అడిగాడు భీమన్న.

"నువ్వేదో వేములవాడ భీమకవిలైప్పులో నీ నోటిమహిమ చూపించి అందర్నీ హడలగొట్టి, గుర్తింపుపొందాలని నీ బామ్మ తాపత్రయం... కదూ. పూర్వకాలంలో- అంటే మీ తాతలకాలంలో ఏం జరిగిందీ, ఎలా జరిగిందీ అన్నది మనకి అప్రస్తుతం... కాని ఈ కాలంలోమాత్రం అలాంటి మంత్రాలుతంత్రాలు మానవమాత్రుడివైన నీకు అసాధ్యం... అవునా... ఈ పరిస్థితుల్లో బామ్మ అజ్ఞానాన్ని బైటపెట్టి ఆవిడ కళ్లు తెరిపించడం మినహా నాకు వేరే గత్యంతరం కనిపించడంలేదు"

"పోనీ బామ్మ కళ్ళు ఎలా తెరుచుకుంటాయో చెప్పు?"

"ఇందుకు నీకు చొరవ, ధైర్యం, సమయస్ఫూర్తి చాలా అవసరం. నీనోటి మీదుగా నువ్వు ఏదంటే అది అయ్యితీరాలనిగదా- బామ్మంటున్నది. దానికి రివర్స్‌గా ఆలోచించు. అంటే ముందు ఏంజరగబోతోందో తెలుసుకుని నువ్వు అన్నావనుకో - ఎలావుంది చిట్కా?"

"అంటే జ్యోతిష్యం నేర్చుకోవాలంటావ్?"

"అబ్బెబ్బె... అదేం అక్కర్లేదు. నువ్వు నిత్యం లేచినదగ్గర్నుంచి నీకు తారసపడే వ్యక్తుల్ని సంఘటనల్ని చాలా దీక్షతో పరిశీలిస్తూ వుండు. సమయాన్ని సందర్భాన్ని బట్టి నువ్వు వాటిని వాడుకోవచ్చు. ఎవరికన్నా ముప్పు ముంచుకొస్తున్నదని తెలిసినప్పుడు నువ్వు అన్యాపదేశంగా నీ మహిమతో వాళ్ళని హెచ్చరించవచ్చు. ఇదీ ఒక రకంగా సంఘసేవే. అయితే ఇందుకు నువ్వు కొంత కష్టపడాల్సి వుంటుంది. జర్నలిజంలో ఇన్వెస్టిగేటివ్ జర్నలిజం అని ఒకటుంది. చాటుమాటుగా జరిగిన వ్యవహారాల్ని కూపీలాగి వెలుగులోకి తేవడం ఒకరకమైతే, ముందుముందు జరిగే పరిణామాలపై ఆరాతీసి చెప్పడం ఇందులో మరో రకం. నువ్వు కొన్నాళ్ళు ఇన్వెస్టిగేటివ్ రిపోర్టర్‌గా అవతారం ఎత్తు... ఇక గెలుపు నీదే" అన్నాడు జిజిరావ్.

భీమన్న ఆలోచనలో పడ్డాడు. ఇదెంతవరకు ఆచరణీయమా అన్న మీమాంసలో వున్నాడు. ఉన్న ఉద్యోగంలోనే చస్తుంటే మళ్ళీ ఇదొకటా అనుకున్నాడు. జిజిరావ్ చూపు మాత్రం నాలుగుగజాల దూరంలో వున్న ఓ వ్యక్తిమీద పడింది. తలతిప్పకుండానే భీమన్నని చేత్తోతట్టి, "ఇప్పుడు నేను చెప్పిన చిట్కాని ప్రాక్టికల్‌గా చేసిచూపిస్తా చూడు" అన్నాడు జిజిరావ్.

గోడలమీద అంటించివున్న ఇంగ్లీష్





సినిమా వాల్‌పోస్టర్లని, వాటిల్లోవున్న అర్థ నగ్న స్త్రీల ఫొటోల్ని అబగా చూస్తూనడుస్తున్న ఆ వ్యక్తినుద్దేశించి జిజిరావ్ పెద్దగా అన్నాడు- "రోడ్డు చూసి నడవయ్యాబాబూ... లేకపోతే మువ్వయ్యారు వళ్ళూ రాల్తాయి..." ఇలా అన్నాడోలేదో ఆ వ్యక్తి తలతిప్పి చూసేసరికి అక్కడే పడివున్న పెద్దరాతిక తగలడం, దభీమని కిందపడిపోవడం క్షణంలో జరిగిపోయింది...

"చూశావురా భీమా... ఇందులో ఎంత సమయస్ఫూర్తి ఉందో వాడుదిక్కులు చూస్తూనడుస్తున్నాడు. ఎదురుగా పెద్దబండరాయి వుంది. వాడది గమనించలేదు. మనం సలహా ఇచ్చాం- అంతే" అన్నాడు జిజిరావ్.

భీమన్న మనసుకి ఈ సంఘటన బాగా పట్టేసింది.

అచ్చంఇదే ఫక్కీలో తానూ మేనేజ్‌చేసి బామ్మదృష్టిలో వేములవాడ భీమకవి అవతారాన్ని నేనేనని చెప్పుకోవచ్చునన్న ధైర్యం కలిగింది. జిజిరావ్‌వైపు మెచ్చుకోలుగా చూశాడు భీమన్న.

మిత్రుణ్ణి కన్విన్స్ చేయగలిగినందుకు జిజిరావ్‌కి కూడా సంతోషంగా వుంది. అందుకే భీమన్న భుజం తడుతూ- "అర్థమైంది గదా - నీ వెనకే నేనుంటాను. స్టీరింగ్ నేను తిప్పుతాను. ఇక టర్నింగ్‌లు నువ్వు తిరుగు... ఒకే?" అన్నాడు లేస్తూ.

"ఒకే..." అంటూ మిత్రుడికి షేక్‌హ్యాండ్ ఇచ్చి అక్కడినుంచి కాలేజీవైపు దారితీశాడు భీమన్న.



భీమన్న ఓ శుభముహూర్తాన కలర్ టీవీతో ఇంట్లో దిగాడు.

ముందుగా చెబితే ఎక్కడ బ్రేక్ వేస్తుందోనన్న భయంతో బామ్మకి తెలినివ్వలేదు... తీరా టీ.వి ఇంటికొచ్చాక ఆమె అవాక్కయింది.

బామ్మకి సర్దిచెప్పడానికి భీమన్న తల ప్రాణం తోకకి వచ్చినంతపనైంది... పైసా ఖర్చు లేకుండా వచ్చిందని వకుళ సాయంతో చాలా నేర్పుగా ఆమెకి నచ్చచెప్పగలిగాడు.

బామ్మ మొదట్లో టీవీవల్ల విముఖత చూపించినా రానురాను టీవీలో కార్యక్రమాలను శ్రద్ధగా చూడసాగింది... ఓ నెలరోజుల్లో ఆమెలో కొట్టొచ్చినంత మార్పు స్పష్టంగా కనిపించింది. ఇప్పుడు సాయంకాలాల్లో భీమన్న రాకకోసం ఎదురుచూడటంలేదు... భీమన్న ఎక్కడెక్కడో తిరిగి ఆలస్యంగా ఇంటికి చేరుకుంటున్నా... అతని కోసం బాల సి.ఐ.డీలు ఎవరూ రోడ్డుమీదికి రావడంలేదు... బామ్మ వ్యాపకం ఇప్పుడు పూర్తిగా మారిపోయింది... ఒక్కోరోజుసాయంకాలంపూట భీమన్న కాలేజీనుంచి ఇంటికొచ్చాక అరగంటదాకా కూడా అతని ఉనికినే బామ్మ గమనించని పరిస్థితి ఏర్పడింది.

భీమన్నకి ఇది ఒకరకంగా బాధాకరంగానే వుంది... బామ్మ తనకోసం ఎదురుతెన్నులు చూడటంలో తనకు ఆనందం వుంది. కాని ఇప్పుడు బామ్మ పూర్తిగా టీవీకే అంకితమైపోవడం చూసి- బామ్మకి ఈ పాడు టీవీయే ఎక్కువైంది కాబోలనుకునేవాడు బాధగా.

ఆ బాధలోనే వకుళ గుర్తొస్తుంది. దాంతో ఆ బాధంతా మాయమైపోతుంది. వకుళ తన కోసం నిత్యం పిల్లల పార్కులో ఎదురుచూస్తుంటుందన్న విషయం గుర్తుకురాగానే అతని మనస్సు ఆనందలోకాల్లోకి వెళ్ళిపోయేది. దాంతో బామ్మ గురించి మరిచిపోయేవాడు... గబగబా స్నానం చేసి వ్యాహ్యాళికని చెప్పి పార్కువైపు దారితీస్తాడు హుషారుగా. బామ్మ వద్దు అనిగాని, ఎందుకు అనిగాని అడగదు. ఆమె కాలక్షేపం ఆమెకి వుంది.

వకుళని ప్రతిసాయంకాలం పిల్లల పార్కులో కలిసి కనీసం ఒకటి రెండు గంటల పాటు బాతాఖానీ కొట్టడం భీమన్నకి నిత్యకృత్యమైపోయింది. ప్రతిరోజూ నిద్రలేచిన దగ్గ

ర్నుంచి ఎప్పుడెప్పుడు సాయంకాలం అవుతుందా అని ఎదురుచూస్తుండేది అతని మనస్సు.

భీమన్న ఇప్పుడు సాదాసీదా తెలుగు మాస్టారేకాదు-

గొప్ప ప్రేమికుడు... వకుళ పరిస్థితీ అదే...!

తామిద్దరి మధ్యా ప్రేమ చిగురించిందన్న విషయం ఇద్దరికీ అర్థమైంది... అందుకే ఇద్దరికీ ఒకరివల్ల ఒకరికి గౌరవం ఇనుమడించింది.

మరోవంక బామ్మలో వస్తున్న మార్పుల్ని వకుళ జాగ్రత్తగా గమనిస్తూ, అందుకనుగుణంగా తన పథకాలను అమలు జరుపుతోంది. ప్రతిరోజూ బామ్మ దర్శనానికి వెళ్ళి రావడం మాత్రం వకుళ మానలేదు. ఓ రోజున-

రోజూ మాదిరిగానే కాసేపు కూర్చొని వకుళ వెళ్ళబోతుంటే బామ్మ గుర్తుచేసింది- "అమ్మాయ్... రేపు మావాడి పుట్టినరోజు... భోజనానికి రావాలి మర్చిపోకుండా" అన్నది.

"సారీ బామ్మా... రేపు మహాశివరాత్రి గదా... రావడం కుదరదు" అన్నది టక్కున.

బామ్మకి అప్పుడుగాని గుర్తురాలేదు- రేపు శివరాత్రి అని.

ఆమాటే వకుళతో అన్నది- "నా మతి మండ... ఏమిటో వీడి పుణ్యమా అని అన్నింటికీ గంటకొడుతున్నానమ్మాయ్" అన్నది బామ్మ బాధగా.

"రేపంతా నేను మహాబిజీ బామ్మా... తెల్లవారు జామునే లేచి తలారాస్నానాలు... ఆ తర్వాత పూజలు... సాయంకాలం గుడికెళ్ళాలి" అని చెప్పింది.

ఈ వయసులోనే వకుళకి ఇంతటి దైవభక్తి వున్నందుకు బామ్మకి ముచ్చటేసింది.

"ఏమిటే అమ్మాయి... ఈ ఊళ్ళో శివుడి గుడి కూడా వుందా?" బామ్మ కనుబొమలు చిట్లిస్తూ అడిగింది.

"ఉందా ఏమిటి? ఎంత పెద్ద గుడి అనుకున్నావ్... రేపు జనం తండోపతండాలుగా వస్తారు... నువ్వూ రాకూడదూ?"

బామ్మ కాసేపు ఆలోచించి- "సరే... నువ్వెళ్ళేటప్పుడు ఇటురా... నేనూ వస్తాను" అని చెప్పింది.

వాస్తవానికి ఈ సదవకాశాన్ని ఎలాగైనా వినియోగించుకోవాలని వకుళ ఓ వారం ముందే ప్లానవేసింది. బామ్మని దారిలోకి తెచ్చే పథకంలో భాగంగా ఆ ముసలావిడని కాస్త అటూ ఇటూ తిప్పి, బైట ప్రపంచాన్ని చూపించాలన్నది వకుళ ఆలోచన.

వకుళ ఇందులోనూ సక్సెస్ అయింది.

ఆ సాయంత్రం పార్క్‌లో కలిసినప్పుడు భీమన్నతో అంది- "చూశారా... బామ్మ మీద నేను వేస్తున్న ప్రతి పథకం గ్రాండ్ సక్సెస్ అవుతోంది"

భీమన్న మౌనంగా ఆమె ముఖంలోకే చూస్తూ కూర్చున్నాడు.

"ఒక్క టి.వి సెట్‌తో ఆవిడ వ్యాపకాన్ని మార్చేశామా... మెల్లిగా బయటికి వెళ్లటం అలవాటుచేస్తాను. వారంలో ఏడురోజులూ ఏడురకాల చోట్లకు తిప్పుతాను... రకరకాల చోట్లు, రకరకాల మనుమల్ని చూస్తుంది" అన్నది వకుళ.

"నువ్వనుకుంటే ఏదైనా చెయ్యగలవు... మొత్తానికి బామ్మలో ఇప్పటికే మంచి మార్పొచ్చింది" చెప్పాడు భీమన్న.

"అప్పుడే ఏమైంది... ఇంకో వారం ఆగండి" అన్నది నవ్వుతూ.

"మళ్ళా ఏంపథకం వేశావ్?"

"అమ్మమ్మ... ముందే చెబుతానేమిటి... దానికి రేపు రంగం సిద్ధమవుతుంది... అది సరేగాని దిగ్రేట్ భీమన్నగారూ... రేపు పుడుతున్నారటగదా - మరి నాకేమిటి స్పెషల్?"

"నేను పుడితే నీకేమిటమ్మాయ్ స్పెషల్?"

వకుళ అదోలా చూసింది.

"కష్టపడి కన్నది మా అమ్మ... నవమాసాలు కష్టపడి పెరిగి, పుట్టింది నేను... మధ్యలో నీకేమిటట?"

"ఆహా మాస్టారూ... పడ్డారు... మీరు లైన్లో పడ్డారు... ఫర్లేదు... మాటలు నేర్చారు... అదేం కుదరదు... మీ పుట్టినరోజు సందర్భంగా మీరు నాకేమిస్తారు?"

"నీకేం కావాలో చెప్పు..."

"నేను చెప్పింది ఇవ్వడంలో ఏముంది





థ్రిల్... మీరే ఆలోచించి ఇవ్వాలి"

"అలాగా..." అని ఓ క్షణం ఆలోచించి-

"అయినా నేనెందుకివ్వాలమ్మాయ్ నీకు... నువ్వేం అవుతావని నాకు?" ఆటపట్టించాలన్న ఉద్దేశంతో అన్నాడు.

"నేను ఏమీ కానా... నిజం చెప్పండి" అన్నది భారంగా.

రెండు నిముషాలు వాళ్ళిద్దరి మధ్య మౌనం రాజ్యమేలింది.

కాసేపు వారి మనస్సులు చూపుల భాష్యంతోనే సంభాషించుకున్నాయి.

భీమన్న వకుళ చేతిని తన చేతిలోకి తీసుకుని తన వేలి వుంగరం తీసి ఆమె వేలికి తొడిగి చేతిని ముద్దాడాడు.

ఆ క్షణంలో వకుళ కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

మరుక్షణమే భీమన్న చేతిని తన చెంపల మీద ఆనించుకుని ఆ మార్దవాన్ని అణచుకుందిలోలోనే.

తన చేతి వేలికివున్న వుంగరం తీసి భీమన్న వేలికి తొడిగింది.

భీమన్న నిశ్చేష్టుడయ్యాడు.

మాస్టారి చేతిని ముద్దాడుతూ వకుళ చాలా భారంగా సన్నగా అన్నది "ఐలవ్‌యూ మాస్టారూ"

"నేను కూడా... అంతే... వకుళా" అన్నాడు భీమన్న.

"మన ఈ మారిన ఉంగరాలు దేనికి సంకేతమో తెల్సా?" అడిగింది వకుళ.

తెలుసునన్నట్టు తలూపాడు భీమన్న.

"మరి దొరగారు ప్రాణిగ్రహణం ఎప్పుడంటారో?"

"అది తలచుకుంటేనే భయంగా వుంది వకుళా... బామ్మ ఏమంటుందో ఏమో" అన్నాడు దిగులుగా.

వకుళ కళ్ళు ఆనందంతో మెరిశాయి

"బామ్మ వ్యవహారం నాకొదిలేయండి" అన్నది ధీమాగా.

"నీకా ధైర్యం వుండటంలో తప్పులేదు గాని... బామ్మ అసలే సనాతనవాది కదా... ఈ ప్రేమలు గీమలు అంటే ఆమెకినచ్చవ్"

"ఆ సనాతన భావాలన్నింటిని బామ్మ త్వరలోనే గోనెసంచిలో మూటకట్టి మచ్చుమీద పడేస్తుంది. సరేనా"

"అయితే ఆ పనయ్యాక అడుగుతాలే మన పెళ్ళి వ్యవహారం" అన్నాడు.

"అడగడం మానడం సంగతి తర్వాత. అడుగుతానని మీ నోటిమీదగా అన్నారు - అదే పదివేలు. మీ ధైర్యానికి నా జోహార్లు" అన్నది నవ్వుతూ.

"ఇంతకీ నువ్వు ఈ మూడ్‌లో పడిపోయావ్... ఇక చదువుకి గాటకొట్టినట్టేనా?"

"అంటే ఏమిటి మీ వుద్దేశం?"

"మరేంలేదు. నువ్వీ ఏడాది పాసవుతావా అని?"

"ఢంకా బజాయించి మరీ పాసవుతాను"

"ఏమో.. నాకైతే డౌట్"

"ఏమండోయ్ మాస్టారూ... మీరెంత భీమకవి అవతారమెత్తినా మీ శాపాలు గీపాలు నాదగ్గరేం వుడకవ్- సరేనా... మీరన్నందుకైనా పంతంతో చదువుతాను" అన్నది రెట్టిస్తూ.

"సరే చూద్దాం" అన్నాడు భీమన్న.

ఆరోజు మధ్యాహ్నమే క్లాసులో ఓ కుర్రాడు అదే పనిగా గొడవచేస్తుంటే భీమన్నకి కోపమొచ్చి "ఏ కాలో చెయ్యో విరిగితేగానీ నీకు బుద్ధిరాదు" అన్నాడు విసుగ్గా. అందుకా కుర్రాడు నవ్వుకున్నాడు కాని ఆ తర్వాత అతను క్యాంటీన్‌లో కాలుజారి పడి ఫ్రాక్చర్ చేసుకున్నాడు. వకుళ ఈ విషయాన్నే ప్రస్తావిస్తూ- "మీ నోటిని మంచిపనులకు ఉపయోగించవచ్చుకదా" అని సలహా ఇచ్చింది.

"ఇంతకీ జిజిరావ్‌గారిచ్చిన సలహా ఏమాత్రం పనిచేస్తోందో తెలుసుకున్నారా?"

"అప్పుడేనా.. ఇప్పుడిప్పుడేగదా అమలుచేస్తున్నాను. నిన్ననే రేషన్‌షాపు కుర్రాడికి ఓ డోస్ ఇచ్చా. బిత్తరపోయాడు. ఏమవుతుందో చూడాలి"

"డోసా... ఏమిచ్చారేమిటి?"

"ఎప్పుడెళ్ళి అడిగినా - ఏమీ లేవంటాడు. షుగర్ వుండదు. ఆయిల్ వుండదు. గోధుమ

లుండవ్. లైస్ వుండదు... వాడు మాత్రం ఉంటాడు దిష్టిబొమ్మలా! నీ డీలర్‌షిప్ వారంరోజుల్లో వూడిపోతుందని శపించి వచ్చేశాను"

"ఊడకపోతే..."

"ఏమవుతుంది... ఏమీకాదు"

"ఇప్పటికే మిమ్మల్ని వాడు లెక్క చెయ్యడంలేదా... వారం తర్వాత అస్సలు లెక్కచెయ్యడు"

"వారం ఆగి చూడు తల్లీ" అన్నాడు భీమన్న ధీమాగా.

"సరే... ఈ విషయాలకేంగాని... రేపు మీ బర్త్‌డే సందర్భంగా నన్ను పిక్చర్‌కి తీసుకెళ్ళరా?"

"అమ్మో... పిక్చర్ ప్రోగ్రామా?"

"ఏం... ఈసారి నేనొక్కదాన్నేలే..."

"అయినా శివరాత్రి అన్నావు... పూజలన్నావ్... గుళ్ళు, గోపురాలు అన్నావ్"

"అదంతా మామ్మకోసం. అయినా దాని దారి దానిదే. పొద్దున్నే పూజలు; సాయంత్రం గుళ్ళు; పగలంతా మీరు- ఎలావుంది నా టైమ్‌టేబుల్?"

"అబ్బ... నువ్వింకో శతాబ్దం ఆగి పుట్టాల్సింది"

"అదేం?"

"మరేంలేదు... అప్పటికి ఈలోకం కూడా నీ అంత సూపర్‌ఫాస్ట్ అయిపోయివుండేది" వకుళతో సినిమాకి వెళ్ళడానికి నిజానికి భీమన్నలో ఇప్పుడెలాంటి సంకోచమూ లేదు. అందుకే అతను గట్టిగా ప్రతిఘటించలేదు.

మసకమసక చీకటిపడేదాకా ఇద్దరూ పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ గడిపారు.

వకుళ చేతిగడియారం వైపు చూసింది-

"ఇంక వెళ్లాం... టైమవుతోంది... మా వార్డెన్ కోప్పడుతుంది" అన్నది.

"అప్పుడేనా... కాసేపు ఆగరాదూ... అయినా నువు హాస్టల్ ఖాళీచేసెయ్యరాదూ. ఆ వెధవ వార్డెన్‌తో ఎందుకీ గొడవ" అన్నాడు చికాకుగా.

భీమన్న మాటలకి వకుళ నవ్వింది... "ఇంకెంతకాలం లెండి... నేను హాస్టల్ ఖాళీ చేసేరోజు దగ్గరపడుతోందిగా... ఇంకొన్నిరోజులు ఓపికపట్టండిచాలు... ఆ తర్వాత నేనూ మీ ఇంట్లోనే వుంటాగా" అన్నది.

భీమన్న ఆ మాటలతో చల్లబడ్డాడు.

ఇద్దరూ భారంగా లేచారు అక్కడినుంచి.

శివరాత్రినాడు-

తెల్లవారుజామునుంచే బామ్మ పూజలు, పునస్కారాల్లో మునిగిపోయింది...

భీమన్నకి తలంటి, పది గంటల ప్రాంతంలో వంట మొదలుపెట్టింది...

వకుళ వచ్చి వుంటే తనకి వంటలో సాయం చేసి వుండేదనుకుంది...

అసలారోజు శివరాత్రి ఉపవాసం చెయ్యాలనుకున్నదిగాని భీమన్న వద్దన్నాడు. ఉపవాసానికి తోడు తెల్లవార్లు జాగారం చెయ్యాలి! తిండీ, నిద్రా రెండూ లేకపోతే శరీరంలో రక్తప్రసరణ వేగంలో తేడా వస్తుంది. అది బామ్మకి బి.పి తెప్పించే ప్రమాదంవుంది... భీమన్న ఇలా సైన్సు చెప్పేసరికి బామ్మ ఇక వెనక్కి తగ్గింది.

"బామ్మా... వంట ఎంతసేపు పడుతుందే?" అని అడిగాడు బట్టలు తొడుక్కుంటూ.

"రెండింటికల్లా ముగించేస్తాన్లే" చెప్పింది.

"సరే అయితే... నేనీలోగా అలా బజారు వెళ్ళొస్తా" అన్నాడు.

బామ్మ ఏమీ మాట్లాడలేదు.

భీమన్న చక్కగా ముస్తాబయ్యాడు. కొత్త ఫాంటు, షర్టు వేశాడు. ఇన్‌షర్ట్‌లో అతను కొత్త రకంగా కనిపిస్తున్నాడు. పుట్టినరోజునడ్డంపెట్టుకొని మొదటిసారిగా బూట్లుకొన్నాడు... కొత్త బట్టల్లో బామ్మ కాళ్ళకి నమస్కరించి ఆశీర్వాదం తీసుకున్నాడు.

ఆ రూపంలో భీమన్నని చూసుకుని బామ్మ మురిసిపోయింది.

"ఇంతగా ముస్తాబై బైటికి వెళ్ళకపోతే ఏంరానాయనా? నలుగురి దిష్టీ తగలదూ?"

"బామ్మా... ఇంకా దిష్టి గిష్టి ఏమిటి? బైటికి వెళ్ళేటప్పుడు కాకపోతే ఇంట్లో వున్నప్పుడు




ఎందుకే ముస్తాబులు?"

"సరేరా... పుట్టినరోజునాడు నువ్వు సంతోషంగా వుండాలి. అదే నాక్కావాలి... వెళ్ళు కాని త్వరగా వచ్చెయ్" అన్నది.

అలాగేనంటూ హుషారుగా రోడ్డుమీదికొచ్చాడు. కొంతదూరం నడిచాక రిక్షా కనిపించింది - అదెక్కాడు!

ముందుగా అనుకున్న ప్రకారం వకుళ దారి మధ్యలో కలిసింది. ఆమెనీ రిక్షా ఎక్కించుకున్నాడు.

కొత్త డ్రస్‌లో టిప్‌టాప్‌గా తయారైన భీమన్నని చూసి వకుళ నిశ్చేష్టురాలైంది... మాష్టారిలో ఇంత అందం, దర్జా వుందా అనుకుంది... భీమన్న బుగ్గమీద చటుక్కున ఓ ముద్దుపెట్టకుండా వుండలేకపోయింది.

ఊహించని పరిణామమే అయినా భీమన్న ఖంగుతిన్లేదు. ఆ ముద్దు అతనికెంతో హాయినిచ్చింది... వకుళని రెండో వైపు కూర్చొబెట్టుకుంటే రెండో చెంపకి కూడా ఇంకో ముద్దుపెడుతుందిగదా అన్న చిలిపి ఆలోచన వచ్చింది. దానికి తనలో తనే నవ్వుకున్నాడు.

రిక్షాలో ఇద్దరూ పక్కపక్కగా ఒదిగి ఒదిగి కూర్చుని వెళుతుంటే- ఇద్దరి మనసుల్లోనూ అనిర్వచనీయమైన ఆనందం తొణికిసలాడుతోంది... రిక్షా కుదుపులకి ఇద్దరి శరీరాలు పరస్పరం తాకుతున్నప్పుడల్లా గుండెలు ఝల్లుమంటున్న వింత అనుభూతి. ఇలాగే ఇంకా చాలాసేపు రిక్షాలో పోతే బావుణ్ణనిపించింది భీమన్నకి. "పాడు సినిమా చూసేబదులు ఆ రెండున్నర గంటలు ఇలాగే రిక్షాలో ఒదిగొదిగి కూర్చుని వూరంతా చుట్టివస్తే ఎంత బావుణ్ణు" అనుకున్నాడు.

అయితే వకుళకి ఇది నచ్చకపోవచ్చునన్న ఆలోచనతో తన మనస్సుకి కళ్ళెం వేసుకున్నాడు.

మరో అయిదు నిముషాల్లో థియేటర్ రానే వచ్చింది.

భీమన్న విచారంగా మొహం బైటికిపెట్టాడు.

వీళ్ళిద్దరూ రిక్షా దిగకముందే-

'హౌస్‌ఫుల్ సర్'- అన్నాడు రిక్షావాడు.

'థాంక్ గాడ్' అనుకున్నాడు మనసులోనే భీమన్న... ఇంకొంచెంసేపు వకుళ పక్కనే కూర్చుని ప్రయాణించే అవకాశం చిక్కినందుకు అతనికి సంతోషంగా వుంది.

కాని సినిమా ఛాన్స్ పోయినందుకు వకుళ బాధపడుతుందేమోనన్న భావంతో ఆమెని అనునయిస్తూ "డోంట్ వర్రీ వకుళా... మరో థియేటర్‌కి ట్రయ్‌చేద్దాం" అన్నాడు భీమన్న.

మళ్ళీ రిక్షా కదిలింది.

"ఏ థియేటర్ సర్?" అడిగాడు రిక్షావాడు.

ఎక్కడ ఏసినిమా ఆడుతుందో, ఏ థియేటర్ ఎక్కడ వుందో భీమన్నకి తెలిసీ తెలీదు. అదంతా వకుళ సెక్షన్. ఆమెని అడిగి ఆమె ఇష్టప్రకారం తీసుకెళ్ళడం తన ధర్మం.

"మెల్లగా పోనిస్తూ వుండు. ఈలోగా ఆలోచించుకుని చెబుతాం" అన్నాడు రిక్షావాడితో.

ఆ తర్వాత వకుళని అడిగాడు- నీకే సినిమా ఇష్టమో చెప్పమని.

నిజానికి వకుళకి కూడా ఇలాగే భీమన్న పక్కనే కూర్చుని రిక్షాలో పోవడం చాలా మజాగా వుంది... ఒక సినిమా తప్పిపోయినందుకు ఆమె భీమన్న అనుకున్నట్టు బాధపడలేదు. పైగా లోలోన సంబరపడింది. ఎటొచ్చీ ఈసారి సినిమా తప్పదేమోనన్న బాధ పట్టుకుంది. భీమన్న అడిగేసరికి ఆమె కొంచెం ఇబ్బంది పడింది. మనసులో మాట చెప్పడానికి ఆ క్షణంలో బిడియం అడ్డొచ్చింది. అయినా చెప్పక తప్పదు అనుకుంది...

అందుకే భీమన్న చెవి దగ్గరగా నోరుబెట్టి మెల్లగా గొణిగింది:

"సినిమావద్దు పాడువద్దు. కాసేపు ఇలాగే నాలుగు రోడ్లు చుట్టేసి ఇంటికెళ్ళిపోదాం" - ఈ మాటలు విన్న భీమన్న ఒక్కసారి ఎగిరి గంతేసినంత పనిచేశాడు.

తామిద్దరి మనసులూ ఒకే రూట్‌లో ఆలోచిస్తున్నందుకు అతనికి పట్టరానంత సంతోషమేసింది. వకుళ చెక్కిళ్ళను తన చేతుల్లోకి తీసుకుని ఆమె పెదాలమీద గట్టిగా ముద్దుపెట్టుకున్నాడు. ఇంతలో చౌరస్తా వచ్చింది... ఎటు వెళ్ళాలో తెలీక రిక్షావాడు ఆగిపోయాడు.

భీమన్నకి కర్తవ్యం గుర్తొచ్చింది... వెంటనే





తడుముకోకుండా-

"సరాసరి పోనియ్ బాబూ" అన్నాడు.

రిక్షావాడు తలవెనక్కి తిప్పి- "ఆ రూట్‌లో సినిమాహాళ్ళు లేవుసార్" అన్నాడు.

"ఇంక సినిమాకి వెళ్ళంలే... మా ఆవిడ మిగతావన్నీ చూసేసింది. పైగా ఆమెకి తలనొప్పిగా వుందట... ఇంటికెళ్ళిపోతాం" అన్నాడు భీమన్న. ఆ వెంటనే తన మాటలకి తానే ఆశ్చర్యపోయాడు.

రిక్షా ముందుకి కదిలింది. భీమన్న అన్నమాటలు వకుళ మనసుని పులకింపచేశాయి.

ఇద్దరూ కబుర్లలో పడ్డారు... రిక్షావాడికి వినిపించకుండా ఏవేవో గుసగుసలాడుకుంటున్నారు...

క్షణం గడుస్తున్నకొద్దీ భీమన్న మనస్సు తమకంతో కొట్టుకోవడం ఎక్కువ కాసాగింది.

వకుళ భుజాలు అప్పుడప్పుడు అతని భుజాలకి తగులుతుంటే అతనిలోని కోర్కెలకు కళ్ళెం సడలుతోంది.

"రిక్షా కుర్రాడికి మా ఆవిడ అని చెప్పారేమిటి?" గుసగుసలాడుతూ అడిగింది.

"ఏం కాదా... ఉంగరాలు మార్చుకున్నాంగా" అంటూ వకుళ చేతిని తన చేతిలోకి తీసుకుని గట్టిగా ముద్దాడాడు.

ఆ శబ్దానికి రిక్షావాడు ఆగిపోయాడు... రిక్షా చైన్ తెగిపోయిందేమోనన్న అనుమానంతో రిక్షా దిగాడు.

"ఏమైందోయ్?" ఆత్రంగా అడిగాడు భీమన్న.

"ఏదోసౌండ్ ఇనిపిచ్చింది సర్... చైన్ తెగిన సౌండులాగుండ" అన్నాడు మోకాళ్ళమీద కూర్చుని చైన్‌వైపు చూస్తూ.

"చైనూ తెగలేదు- ఏమీ తెగలేదు... పోనీవయ్యా" అన్నాడు విసుగ్గా ముఖంపెట్టి.

వకుళకి ఈ పరిస్థితి కొంచెం ఇబ్బంది అనిపించింది.

రిక్షా కదిలాక చెప్పింది భీమన్నకి "మీ కోరికలకి కొంచెం కళ్ళెం వేయండి. ఇది బజారు. అభాసుపాలవుతాం... అయినా మొదట్లో అంతగా బిడియపడేవారు ఇప్పుడేమిటి ఇంతగా చెడిపోయారు?" అంది నవ్వుతూ.

భీమన్న కూడా నవ్వుతూ వుండిపోయాడు.

కొంతదూరం వెళ్ళాక మళ్ళీ చౌరస్తా వచ్చింది.

"ఎటుపోవాలి సార్...?" అన్నాడు రిక్షావాడు.

భీమన్న తలబైటికి పెట్టకుండానే ఠక్కున చెప్పాడు "ఎడమచేతి వైపు తిరుగు"

రిక్షా మళ్ళీ రోడ్డున పడింది.

మరో పదినిముషాలయ్యాక మళ్ళీ చౌరస్తా వచ్చింది. రిక్షా ఆగింది. విషయం గ్రహించిన భీమన్న "మళ్ళీ లెఫ్టే కొట్టవయ్యా" అన్నాడు.

ఆ ప్రకారమే రిక్షా ఎడమవైపు తిరిగిపోసాగింది. కొంచెం సేపటికి రిక్షా మళ్ళీ ఆగింది. రిక్షావాడు దిగాడు - భీమన్న తలబైటికి పెట్టి చూశాడు...

మళ్ళీ ఇందాకటి థియేటర్ దగ్గరికొచ్చారన్నమాట!

రిక్షావాడు వింతగా చూస్తుంటే భీమన్న అతనివైపు వెర్రిగా చూడాల్సి వచ్చింది.

"దారి తప్పామోయ్" అన్నాడు భీమన్న లాజికల్‌గా.

"ఈసారి ఈ సైడ్ పోదామాసార్... ఇది చాలా పొడుగు రోడ్డు... కాలక్షేపం బాగా అవుద్ది" అన్నాడు రిక్షావాడు.

"ఓరి వీడి బండబడ... వీడికి తెల్సిపోయిందే మా వ్యవహారం" అనుకున్నాడు భీమన్న.

వెంటనే రిక్షా దిగేసి వకుళని కూడా దిగమన్నాడు. రిక్షావాడికి డబ్బులిచ్చేసి వాణ్ణి పంపించేశాడు.

"వకుళా... కాఫీ తాగుతావా?" అడిగాడు.

"తాగుదాం... ఇప్పుడు అవసరం కూడా" అంది.

ఇద్దరూ రోడ్డు వెంట నడుస్తున్నారు- హొటల్ ఏదన్నా తగులుతుందేమోనని?

కొంచెంసేపయ్యాక వకుళ అన్నది - దూరంగా చూపిస్తూ "అదుగో... అందులోకి వెళ్దాం"

"సరేవద..." అంటూ భీమన్న వకుళని అనుసరించాడు.

ఇద్దరూ హోటల్‌లో అడుగుపెట్టారు.

బుర్రమీసాలు, ఆరడుగుల ఆజానుబాహుడు ఎదురుగా కనిపించేసరికి భీమన్న ఖంగుతిన్నాడు.

వకుళ తన పక్కనే వుండటంతో మెదడు జ్ఞాపకశక్తిని కోల్పోయిందనుకున్నాడు భీమన్న.

పక్కనే వున్న వకుళతో గొణిగాడు- "జి.జి.రావ్, నేను మొదటిసారి ఈ హోటల్‌కే వచ్చాం" అన్నాడు. ఆ వెంటనే పాతఅనుభవం గుర్తొచ్చింది. కొంపదీసి జి.జి.రావ్ మాదిరిగా తన గురించి ఏదో గొణుగుతున్నానని ఆ బుర్రమీసాల వ్యక్తి అపార్థం చేసుకుంటాడేమోనన్న అనుమానం వచ్చింది. దాంతో ... వెంటనే ఆ భారీ విగ్రహంవైపు తిరిగి నవ్వుతూ విష్ చేశాడు.

అవతలివ్యక్తి కూడా నవ్వుతూ, వీళ్ళిద్దరికీ ఫ్యామిలీ రూమ్ చూపించాడు.

"వీడు మారినట్టున్నాడే" అనుకున్నాడు భీమన్న.

ఇద్దరూ చెరొక కుర్చీలో కూర్చున్నారు.

"మీ ఫ్రెండ్ రాలేదాసార్?"

భీమన్న తలెత్తిచూశాడు. ఎదురుగా సూపర్‌వైజర్ -

వీడికెంత జ్ఞాపకశక్తి - అనుకున్నాడు భీమన్న మనసులోనే. పైకిమాత్రం నవ్వుతూ... "అహ... రాలేదు... ఈసారెప్పుడన్నా వాడితోవస్తాలే" అన్నాడు.

"ఫర్లేదు సార్" అన్నాడు సూపర్‌వైజర్ మొహమాటంగా.

ఇంతలో సర్వర్ వచ్చాడు.

భీమన్న రెండు కాఫీలకి ఆర్డరిచ్చాడు!

"టిఫిన్ చెయ్యండి సార్" అన్నాడు సూపర్‌వైజర్.

"అబ్బే... వద్దు... ఇప్పుడెటూ ఇంటికెళ్ళి భోజనం చెయ్యాలిగదా" అన్నాడు మొహమాటంగానే భీమన్న.

"ఫర్లేదు చెయ్యండిసార్... ఇవ్వాళ స్పెషల్ పూర్ పూరీ స్పెషల్ సర్" అంటూ సర్వర్‌వైపు తిరిగి రెండుప్లేట్లు తెమ్మనమని పురమాయించాడు.

మరో పదినిముషాల్లో టిఫిన్ వచ్చింది.

అరటాకు అంతప్లేట్లో చేటంత పూరీ వుంది. దాని సైజు చూసేసరికే భీమన్న గుండెఝల్లుమంది. వకుళ భయంగా భీమన్నవైపు చూసింది. తినకతప్పదని కళ్ళతోనే బదులిచ్చి రంగంలోకి దూకాడు భీమన్న.

టిఫిన్ పూర్తిచేయడానికి ఇద్దరికీ అరగంట పట్టింది.

ఆ తర్వాత కాఫీ తాగి- బిల్లు తీసుకోబోతుంటే-

సూపర్‌వైజర్ వాళ్ళని వారించి తన జేబులోనుంచి డబ్బులు తీసి- బిల్లుతోసహా సర్వర్‌కిచ్చి పంపాడు- కేష్ కౌంటర్ దగ్గరికి.

భీమన్నకి, వకుళకి ఇదేమీ అర్థం కాలేదు... ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

"ఇంక వెళ్ళండి సర్... తొందర్లో మీకు పెళ్ళి అయిపోవాలని నేను ఆ దేవుణ్ని ప్రార్థిస్తా" అన్నాడు సూపర్‌వైజర్.

భీమన్న ముందు కొంచెం ఇబ్బందిపడ్డాడు గాని అతను తమ సానుభూతిపరుడని ఆ తర్వాత అర్థంచేసుకున్నాడు.

ఈ భయాన భారీవిగ్రహం తన శ్రేయోభిలాషి అనిపించడంతో భీమన్న మనస్సు తేలికపడింది.

అతనికి షేక్‌హాండ్ ఇస్తూ "థాంక్స్‌సర్... మా పెళ్ళికి మిమ్మల్ని తప్పకుండా పిలుస్తాం" అన్నాడు.

"మంచిదిసర్" అన్నాడు సూపర్‌వైజర్. రెండు చేతులెత్తి దణ్ణం పెడుతూ.

భీమన్న - వకుళ మరో రిక్షాఎక్కి ఇంటిదారి పట్టారు.

ఇంటికి కొంచెం దూరంలోనే రిక్షా ఆపించింది వకుళ.

ముందు తాను దిగి ఒక్కర్తే నడుచుకుంటూ బామ్మ దగ్గరికి వెళ్ళింది...

భీమన్న ఆ వెనకాలే నిదానంగా వెళ్ళాడు.

★ ★ ★

ఆ సాయంత్రం బామ్మని తీసుకుని గుడికి





బయల్దేరింది వకుళ.

దారంట వచ్చేపోయే మనుమల్ని పరిశీలి స్తూ బామ్మ మెల్లగా నడుస్తుంటే వకుళ చాలా ఓపికగా ఆమె వెంటే నడవసాగింది.

"కాళ్ళు నొప్పి పుడుతున్నాయా బామ్మా..." కొంత దూరం వెళ్ళాక అడిగింది వకుళ.

"అఁ... మరే... ఎప్పుడూ నడక అలవాటు లేదా... కొంచెం నొప్పిగానే అనిపిస్తున్నాయ్"

రోజూ ఇలా నువ్వు గుడికి వెళ్ళొచ్చు గదా"

"వెళ్ళొచ్చే తల్లీ. కాని నాకు ఇదుగో గుడి అని చూపించే నాథుడేడీ?"

"సరే... అదే నీ సమస్య అయితే నీకు ఈ వూళ్ళో గుళ్ళన్నీ చూపిస్తాను"

"ఆ పనిచేసి పుణ్యం కట్టుకోతల్లీ" రొప్పు తూ అంది బామ్మ.

"ఏంటి బామ్మా... రొప్పుతున్నావ్... కొంచెంసేపు ఆ గచ్చు మీద కూర్చో" అని సలహా ఇచ్చింది.

"ఫర్వాలేదు. నడుస్తాలే" అంటూ ముందు కి సాగింది.

"బామ్మా... నేను నీకో సలహా ఇస్తాను... చేస్తావా?"

"చెప్పు తల్లీ!"

"ఏమీ లేదు... నువ్వు రోజూ తెల్లవారుజా మునే లేస్తావు గదా ఎటూ! ఓ గంటసేపు ఫ్రెష్‌గా చల్లని వాతావరణంలో అలా నాలుగు రోడ్లు నడిచావనుకో పొద్దున్నే - నీకెంత ఆరో గ్యంగా వుంటుందో తెల్సా? దానివల్ల రక్తప్రస రణ బాగా జరుగుతుంది. నీకేలాంటి జబ్బు లూ రావు... తెల్సా?" అన్నది వకుళ.

బామ్మ నుంచి ఎలాంటి సమాధానమూ రాలేదు. అదే అదనుగా తీసుకుంది వకుళ.

"మాస్టారు ఎప్పుడూ నీ ఆరోగ్యం గురించే బెంగపడుతుంటారు.... ఆయన బాధపడితే నాకూ బాధేగదా! ఆయనకు నువ్వు చలాకీగా కనిపించాలి బామ్మా... అందుకు మందూమా కులు పరిష్కారంకాదు... ఇదొక్కటే మంచి చిట్కా"

ఈ సెంటిమెంట్ బామ్మ మీద బాగా పనిచే సింది. మనవడి సంతోషం కోసం తాను ఈ మాత్రం చెయ్యలేకపోతే ఇంకో ఉపయోగమే ముంది అనుకుంది బామ్మ...

టి.విలో నిత్యం చూపించే ఎక్సర్‌సైజుల మీద వకుళ ఉపన్యాసమిచ్చింది...

"నువ్వు ఈ వయస్సులో అంతటి ఎక్సర్‌సై జులు చేయలేవుగాని సింపుల్‌గా మార్నింగ్ వాక్‌కి రా నాతోపాటు" అని ముక్తాయింపుగా చెప్పింది.

మొత్తానికి బామ్మ ఒప్పుకుంది.

గుళ్ళో దేవుణ్ణి చూశాక బామ్మని మళ్ళీ ఇంటి దగ్గర దింపి వకుళ తన హాస్టల్‌కి వెళ్ళిపోయింది. ఆ రాత్రి చాలా పొద్దుపోయేదా కా బామ్మ టి.విలో శివరాత్రి స్పెషల్ ప్రోగ్రామ్ చూస్తూ కూర్చుండిపోయింది.

భీమన్న ఎన్నోసార్లు చెప్పాడు... "బామ్మా... ఇంక వెళ్ళి పడుకోవే. ఆరోగ్యం పాడవుతుంది" అని. అయినా వినిపించుకోలేదు.

"శివరాత్రినాడన్నా కొంచెం భక్తి కార్యక్రమా లు చూడనివ్వరా" అంటూ టి.వి ముందు నుంచి లేవలేదు. చివరికి నిద్రకి ఆగలేక అతి బలవంతాన టి.వి. కట్టేసి వెళ్ళి పడుకుంది.

మర్నాడు తెల్లవారుజామునే-

నాలుగున్నరకి తలుపు మీద 'టకటక' శబ్ద మవుతూంటే భీమన్నకి నిద్రాభంగమైంది. చికా గ్గా లేచివెళ్ళి తలుపు తీశాడు - ఎదురుగా వకుళ.

"ఏం తల్లీ... అప్పుడే తెల్లారిందా నీకు?" అన్నాడు నిద్రమత్తులో విసుగ్గా.

వకుళ అదేమీ పట్టించుకోకుండా హుషా రుగా లోనికెళ్ళిపోయింది.

బామ్మ అప్పటికే నిద్రలేచింది.

అయిదు నిముషాల్లో బామ్మతోసహా వకుళ ముందు గదిలోకొచ్చింది.

"ఒరేయ్ భీమా... నేనలా కాసేపు మార్నింగ్ వాక్‌కి వెళ్ళొస్తాగాని... ఇల్లు జాగ్రత్త. నేను బయట గడియ పెట్టుకుపోతాగాని... కంగారు పడకు" అంటూ ముందుకి దారితీసింది బామ్మ.

భీమన్న తన చెవుల్ని తానే నమ్మలేకపోయా డు... ఇందతా కలా నిజమా అన్న అయోమ యంలో పడ్డాడు. అ వెనకే బైటికెళ్ళిపోతూ



వకుళ భీమన్న వైపు కళ్ళెగరేస్తూ "చూశారా... నా ప్రతాపం" అన్నట్టు చూసింది.

బామ్మలో ఇంతటి మార్పు- అదీ ఇంత తొందరగా వచ్చిన సంతోషంలో భీమన్న అమాంతం వకుళని రెండు చేతుల్తో పైకెత్తి గిరగిరతిప్పాడు. రెండు క్షణాల తర్వాత కిందకి దించి, ఆమె పెదాల మీద గట్టిగా ముద్దుపెడుతూ "యు ఆర్ గ్రేట్ మైడియర్" అన్నాడు.

వకుళ పెదాలు తుడుచుకుంటూ "ఛీ... పాడు... పాచి నోటితో" అన్నది. ఆ వెంటనే రోడ్డు మీదికి తుర్రుమంది.

అప్పటికే రోడ్డుమీదికి వెళ్ళిపోయిన బామ్మ వకుళని చూస్తూ తలుపు గడియ వేసి రమ్మనమని పురమాయించింది. వకుళ మళ్ళీ వెనక్కి వచ్చి తలుపు గడియపెట్టి వెళ్ళింది.

ఆ రాత్రి భీమన్నకి ఓ చిలిపి ఆలోచన వచ్చింది.

భోజనాలయ్యాక బామ్మ పక్కలు సిద్ధం చేస్తుంటే- భీమన్న తన మంచం తీసుకెళ్ళి బైట వంచలో వేసుకున్నాడు.

"అదేమిటిరా?" అంది బామ్మ.

"నేను బైటపడుకుంటానే" అన్నాడు.

"ఎందుకని?"

"లోపల దోమలతో చస్తున్నా"

"దుప్పటి కప్పుకో..."

"మునుగుతన్నితే వూపిరాడి చావడంలేదు"

"బైట చలిగా వుంటుందిరా"

"ఫర్లేదు... దుప్పటి కప్పుకుంటాలే"

"సరే... నీ యిష్టం"

బామ్మ ఇక ఆ విషయం పొడిగించదలుచుకోలేదు.

నిజానికి భీమన్న బైటపడుకోవాలనుకున్నది దోమల కారణంగా కాదు అదొకవంక మాత్రమే. పడుకున్నాడేగాని ఎంతసేపటికీ నిద్రపట్టడంలేదు.

ఎప్పుడెప్పుడు నాలుగున్నర అవుతుందా అని ఎదురుచూడటంతోనే సరిపోతోంది.

తెల్లవారుఝామున వకుళ మార్నింగ్‌వాక్‌కి బామ్మకోసం వచ్చినప్పుడు తలుపుతట్టి బామ్మని లేపకముందే ఆ అమ్మాయిని నిలేసి, కాసేపు ముచ్చట్లాడాలన్నది భీమన్న ఆలోచన. అందుకే బైట తిష్ఠవేశాడు. అర్థరాత్రి దాటేవరకు ఏవేవో చిలిపి ఆలోచనల్తో గడిపాడు. ఆమె వచ్చేసరికి నిద్రపోకూడదన్న ఉద్దేశంతో అలాగే కూర్చుండిపోయాడు. కొంచెంసేపటికి నిద్ర ముంచుకొచ్చింది. ఎంత ఆపుకుందామన్నా ఆగలేదు. ఓ అరగంట కునుకుతీద్దామనుకొని పడుకున్నాడు. వెంటనే గాఢ నిద్రలోకి జారిపోయాడు... దోమలు కుడుతుంటే మునుగుతన్ని మరీ పడుకున్నాడు.

ఠంచనుగా నాలుగున్నరకల్లా వకుళ బామ్మ గారింటికొచ్చింది.

భీమన్న ఒక్కడే బైటపడుకుని వుంటాడంటే ఆమెకి నమ్మశక్యం కాలేదు. బహుశా బామ్మే పడుకునివుంటుంది. తెల్లవారుజామున నేను కేకలువెయ్యడం; ఆమె పలకడం- ఈ న్యూసెన్స్ లేకుండా చెయ్యడం కోసం బామ్మే బైటపడుకునివుంటుందనుకుంది. మెల్లగా వెళ్ళి మంచం మీద కూర్చొని, బామ్మని లేపే ప్రయత్నంలో దుప్పటి తొలగించింది. భీమన్న గాఢనిద్రలో మునిగివున్నాడు.

వకుళ ఓ క్షణం ఆలోచనలోపడింది!

"ఏమిటి...ఈయన ఇక్కడ..." అనుకుంది.

అంతలోనే నిన్న తెల్లవారుఝామున భీమన్న చేసిన చిలిపి పని గుర్తొచ్చింది. బహుశా మళ్ళీ అందుకోసమే బైటికి చేరాడేమో అబ్బాయిగారు... అన్న ఆలోచనరాగానే నెత్తిమీద ఓ మొట్టికాయ వెయ్యబోయి అంతలోనే చెయ్యి వెనక్కి తీసుకుంది.

అదేక్షణంలో ఆమె మనసులో ఓ ఆలోచన మెదిలింది.

మెల్లిగా లేచి- ఎలావుందో అలాగే దుప్పటి కప్పేసి, దొడ్డిదారిన సందులోగుండాలోనికెళ్ళింది. అప్పటికే బామ్మలేచింది. ఇద్దరూ మళ్ళీ అదే సందులో నుంచి బైటికొచ్చి మార్నింగ్‌వాక్‌కి వెళ్ళారు.

భీమన్నకి ఏడింటికి మెలుకువ వచ్చింది.

'ఛీ ఛీ... పాడునిద్ర' అనుకున్నాడు. మంచం మీద నుంచి లేస్తూ.

లోనికెళ్ళగానే బామ్మని ఆరా తీశాడు.




"ఇవ్వాళ మార్నింగ్‌వాక్‌కి వెళ్ళావుటే బామ్మా?"

"ఆఁ... నిక్షేపంగా వెళ్ళొచ్చాను"

"నువ్వొక్కదానివే వెళ్ళావా ఏమిటి?"

"నువ్వంత భయపడక్కర్లేదులేరా... వకుళ వచ్చిందిగా..."

భీమన్న ప్రాణం ఉసూరుమంది. రాత్రి కన్నకలలన్నీ అతని కళ్ళముందే కల్లలైపోయాయి.

"ఆ అమ్మాయి వచ్చిన అలికిడే వినిపించ లేదుగదే! కనీనం తలుపుకొట్టేది గదా"

"నువు బైటపడుకున్నావని తెలిసిందేమో... నీ నిద్ర చెడగొట్టడమెందుకనుకుందో ఏమో నందులోగుండా వచ్చింది"

భీమన్న డీలాపడ్డాడు... తాను ఒకందుకు బైటపడుకుంటే చివరికి మరోలా జరిగిందన్న మాట! ఇంకెప్పుడూ బైటపడుకోకూడదని ఆ క్షణమే నిర్ణయించుకున్నాడు.

ఆ సాయంత్రం పార్క్‌లో కలుసుకున్నప్పుడు వకుళ ఈ విషయాన్నే ప్రస్తావించింది.

"అవునూ... రాత్రి ఎందుకు మీరు బైటపడుకున్నారు?"

"నిజం చెప్పనా... అబద్ధం చెప్పనా?"

"మీరు చెప్పాలనుకున్నదేదో చెప్పండి. అది నిజమో అబద్ధమో నేను తేల్చుకుంటాను" అన్నది నవ్వుతూ.

భీమన్న ఓ క్షణం ఆలోచించి "నీ కోసమే" అన్నాడు చిలిపిగా.

"నేననుకున్నాన్లే" అన్నది.

"కాని టోపీవేశావుగా"

"అవును. తిక్కకుదిరిందా?" వకుళ మరింతగా కవ్వించింది.

"మురిసిపోకు... నీ తిక్కంతా పెళ్ళయ్యాక కుదిరిస్తాలే" అన్నాడు.

"పెళ్ళా... అదికూడా నేనే నెత్తినేసుకుని నేనే జరిపించాల్సివుంటుంది మాస్టారూ... మీ వల్లకాదులే"

"అంటే... బామ్మని అడగలేననా నీవుద్దేశం?"

"మాటలు వద్దు... చేసిచూపండి... చూస్తాను" అన్నది రెచ్చిస్తున్నట్లు.

భీమన్నకి ఆ క్షణంలో పంతం పెరిగింది...

"చూడు... వారం తిరిగేనరికల్లా పెళ్ళి సెటప్ చెయ్యలేకపోతే నా పేరు మార్చుకుంటా... నరేనా?" ఛాలెంజ్ చేశాడు.

మాస్టారికి ఇంతటి ధైర్యం వచ్చినందుకు వకుళ లోలోనే మురిసిపోయింది. తను కోరుకునేదీ ఇదే అనుకుంది - మనసులో.

అయితేవారం రోజులు మరీ పెద్ద గడువు అనిపించింది.

వారం అంటే ఏడురోజులు... అంటే నూటఅరవై గంటలు... అబ్బో... ఇన్నిగంటలు ఏకబిగిన మూడ్ నిలవాలంటే కష్టమేననిపించింది. అందుకే భీమన్నని మరింత తొందరపెట్టింది.

"నిజంగా అడగాలనుకుంటే వారంరోజులెందుకండీ... ఒక్కరోజు చాలు" అంది.

భీమన్నకి ఇది ప్రిస్టేజీ వ్యవహారమైంది.

"నరే... అయితే రేపు సాయంత్రం నీకు రిజల్ట్ చెప్పేస్తా" అన్నాడు.

"రిజల్టా... మళ్ళీ ఇందులో ఇదేమిటంట తిరకాసు?"

"అదేంలేదు... మా బామ్మని ఒప్పించానన్న విషయం చెబుతా... నరేనా?" అంటూ లేచాడు.

అలాగేనంటూ వకుళ కూడా లేచింది.

"జాగ్రత్త...ఇక్కడినుంచే గుండెనిండా గాలి పీల్చుకుపొండి" అన్నది జోకీగా.

"ఓ.కే... అలాగే... నువు మాత్రం రేపు గుండెలో కొంచెంకూడా గాలి మిగుల్చుకోకుండా రా... ఇక్కడికొచ్చాక తృప్తిగా గాలిపీల్చుకుందువుగాని- విషయం విని" అంతే స్ఫూర్తితో ఎదురుజోకు వేశాడు.

'ఫర్వాలేదు... నావుడ్ బీ, ప్రాణనాథుడు బాగానే ఇంప్రూవ్ అయ్యాడు' అనుకుంది వకుళ.

ఆ రాత్రి భోజనాల ముందు తన పెళ్ళి విషయం ప్రస్తావనకు తీసుకురావడానికి నానా తంటాలుపడ్డాడు భీమన్న...



"బామ్మా... ఇవ్వాళ వంటకాలన్నీ బ్రహ్మాండంగా వున్నాయే... ఈ వయస్సులో కూడా నువ్వింత చక్కగా వంటచేయడం నాకు గర్వకారణమేగాని, నిన్ను బాధపెడుతున్నానన్న బాధమాత్రం నన్ను వదలడంలేదే" అన్నాడు భీమన్న సానుభూతిగా.

"పోనీలే... ఇప్పటికన్నా తెలుసుకోగలిగావ్" అన్నది బామ్మ.

"తెలుసుకున్నానుగాబట్టే నీ కోరిక తీర్చాలనుకుంటున్నానే"

ఏమీ అర్థంకానట్టు ముఖం పెట్టింది బామ్మ.

భీమన్న చెప్పడానికి తెగ ఇబ్బంది పడుతున్నాడు. అతని వాలకాన్నిబట్టి ఆమె విషయం గ్రహించింది...

ఓహో... ఇలా నరుక్కొచ్చాడా అనుకుంది...

మొత్తంమీద ఈమధ్య మనవడి ప్రవర్తనలో మార్పు కొట్టొచ్చినట్టు కనిపించిందామెకి! కాని అతను ఇంత తొందరగా పెళ్ళి ప్రస్తావన తెస్తాడని వూహించలేదు!

"ఒకవేళ వీడు- అప్పుడెప్పుడో కలం తీసుకున్న అమ్మాయితో ప్రేమలో పడ్డాడు కదా... ఆ అమ్మాయినే చేసుకుంటానంటే... ఏమిటి దారి...?" అనుకుంది బామ్మ.

ఇలా ఎవరి ఆలోచనల్లో వాళ్ళున్నారు.

బైట తలుపుమీద దబదబా బాదుతున్నారెవరో...

బామ్మవెళ్ళి తలుపుతీసింది!

ఎదురుగా ఓ అపరిచిత వ్యక్తి! కొంచెం మొరటుగా వున్నాడు...

"వంతులున్నాడా?" అరిచినట్టే అడిగాడు. అతని చేతిలో పొడవాటి కర్ర వుంది.

"ఇంతకీ నువ్వెవరివి?"

"వాణ్ణి పిలువు- నేనెవర్నో వాడే చెబుతాడు" అన్నాడు చాలా నిర్లక్ష్యంగా.

ఇదంతా విని భీమన్న బైటికొచ్చాడు. అతను గుర్తుపట్టాడు. రేషన్‌షాపు డీలర్!

భీమన్నని చూస్తూనే అతను కర్రెత్తబోయాడు!

బామ్మ మనవణ్ణి అడ్డుకుని అతన్ని వారించింది.

"ఏరా... నాకు శాపం పెడతావ్... నువ్వన్నట్టు వారంరోజుల్లో నా డీలర్‌షిప్ వూడింది. ఇప్పుడు నిన్ను వూరికే వదలను" అంటూ మీదికి రాబోయాడతను.

ఆ గొడవకి చుట్టుపక్కలవాళ్ళంతా చేరారు...

డీలర్‌ని వారించి దూరంగా తీసుకెళ్ళారు...

భీమన్నకి ఇది చాలా సిగ్గు చేటనిపించింది.

"ఒరే భీమాయ్... ఇదేమిట్రా... ఇలా ఇంటిమీదికి దెబ్బకి రావటం ఇదివరకెప్పుడన్నా విన్నామా కన్నామా చెప్పు... ఏమిటీ అప్రతిష్ట?" బామ్మ బాగా నొచ్చుకుంది!

"ఇదంతా నీకోసమే చేశానే. నువు నన్ను నాన్నలాగా, తాతలాగా భీమకవిగా చూడాలనుకుంటున్నావ్‌గదా! అందుకే వాడికి శాపంపెట్టా.... అది నిజంగా జరిగింది. వాడు ఇంటిమీదికొచ్చాడు."

"మీ తాతగారి హయాంలో ఇలా ఇళ్ళమీదకి వచ్చేవారు కాదురాబాబూ..." అన్నది బామ్మ.

భీమన్నకి ఆ రాత్రంతా నిద్రపట్టలేదు- అవమానభారంతో!

తెల్లవారగానే జిజిరావ్ దగ్గరకెళ్ళాడు.

మిత్రుణ్ణి చూస్తూనే విష్ చేశాడు జిజిరావు.

"ఏరా... ఎలా తిరుగుతున్నావ్ టర్నింగులు?" అని అడిగాడు.

దగ్గర్లో ఏదన్నా ఓ పెద్దరాయి దొరికితే వీడి తల పగలగొట్టాలన్నంత కోపమొచ్చింది భీమన్నకి. కాని తమాయించుకున్నాడు.

తాపీగా కూర్చుని నిన్న జరిగిన విషయమంతా చెప్పాడు.

"వాడు ఇంటిమీదికొచ్చాడన్నమాట... బైట్... మంచిపని జరిగింది" అన్నాడు జిజిరావ్.

భీమన్నకి పిచ్చెక్కినట్టయింది. వెర్రిగా జిజిరావువైపు చూశాడు.

"ఒరేయ్ భీమా... నువ్వేం కలత చెందకు... జరిగేవన్నీ మంచికనీ అనుకోవడమే మనిషి

వని అన్నాడు ఆత్రేయ. నీ కోసమే అన్నాన్రా వెధవాయ్... ఇంకా ఒకటి రెండు జరగనీ... ఇలాగే... దాంతో కథ సుఖాంతమవుతుంది." అన్నాడు జిజిరావ్!

"ఈలోగా నాకు పిచ్చెక్కుతుంది" అన్నాడు భీమన్న జుట్టు పీక్కుంటూ!

"బంగారంలాంటి జుట్టు పీక్కోకు. మరి మీ బామ్మను మార్చాలంటే నువ్వీమాత్రం ఇబ్బంది పడకతప్పదు. ఇంకో రెండు కేసులు చూడు. చాలు... కేసు ఫైనల్ చేస్తా" అన్నాడు.

"తప్పదంటావా?" విషాదంగా ముఖంపెట్టి అడిగాడు భీమన్న.

"తప్పదు.. అయినా సగం మునిగాక చలేముంది... నిరభ్యంతరంగా నిండా మునగొచ్చు."

"కోటేమన్లు చెప్పొద్దు... కడుపు తరుక్కుపోతోంది." అని కసిదీరా జిజిరావు మీద పళ్ళు నూరి అక్కడి నుంచి బైటపడ్డాడు.

ఆ సాయంత్రం వకుళని పార్కులో కలిసి, జరిగిందంతా ఆమెకి చెప్పుకునేదాకా భీమన్నకి మనస్సు మనస్సులో లేదు.

అంతా విన్నాక వకుళ నోరు విప్పింది- "నేను మొన్నచెబితే విన్నారుగాదు. ఇంతకీ మీకు దొరక్క దొరక్క వాడెలా దొరికాడు?"

"సివిల్ సప్లయిస్‌లో మా దూరపు చుట్టం ఒకడున్నాడ్లే. వాడా మధ్య కలిసినప్పుడు మాటల సందర్భంలో ఈ డీలర్ ప్రస్తావన వచ్చింది. అప్పుడు తెలిసింది వీడి భాగోతం. వీడు మహా కండూతిగాడట. బస్తాలకు బస్తాలు బియ్యం, వంచదార బ్లాక్‌లో అమ్మేస్తుంటాడట. బోలెడన్ని ఫిర్యాదులొస్తే ఎంక్వయిరీ జరిపార్ట! అన్నీ రుజువయ్యాయి. ఓ వారంలో డీలర్‌షిప్ పీకేస్తున్నట్టు వాడే చెప్పాడు. దొరికాడు గదా గురుడు ఓసారి మన ప్రతాపం చూపుదామని వదిలా బాణం. వాడికి ఏ కొంచెం తెలివివున్నా నా హెచ్చరిక విన్నాక జాగ్రత్తపడి ఎలాగొలా డీలర్‌షిప్ నిలుపుకునేందుకు తంటాలు పడాల్సింది. వాడి ఖర్మ. మనమేం చేస్తాం" అన్నాడు భీమన్న.

"అవునూ... ఇంటిమీదికి దొమ్మీకి వచ్చా

డంటున్నారు. చెయ్యి చేసుకున్నాడా?"

భీమన్నకి చిరాకేసింది- "నువ్వేమీ అంత డీప్‌గా పరామర్శించనక్కర్లేదు" అన్నాడు రుసరుసలాడుతూ.

భీమన్న మూడ్ బాగాలేదని గ్రహించిన వకుళ ఇక ఆ టాపిక్ మార్చింది.

కాసేపు ఏవో పిచ్చిపాటీ మాట్లాడుకుని చీకటి పడగానే లేచి వెళ్ళిపోయారు.



ఉదయం తొమ్మిదిన్నరకల్లా భీమన్న రెడీ అయి కాలేజీకి బయల్దేరాడు!

అతని మనసంతా చాలా వెలితిగా వుంది. అందుక్కారణం లేకపోలేదు.

స్టూడెంట్స్‌కి పరీక్షలు దగ్గర పడుతున్నాయి. ప్రిపరేషన్ హాలిడేస్ ఇచ్చేస్తున్నారు.

అంటే రేపట్నుంచి పిల్లలు కాలేజీలకి రారు. ఇది ఒకరకంగా భీమన్నకి వరమే! హాయిగా కొద్ది రోజులపాటు క్లాసులు, పిల్లల అరుపులు, గోల గట్రా ఏమీ వుండవు. కాని వకుళ ఇక పరీక్షలయ్యేదాకా కనిపించదని అనుకుంటేనే మనసంతా అదోలా అయిపోతున్నది. పైగా నిన్న సాయంత్రమే గట్టిగా చెప్పేసింది- పరీక్షలయ్యేదాకా షికార్లు బంద్ అని! అంటే ఇక రోజూ సాయంకాలాల్లో పార్కుదగ్గర కలవడం కుదరదన్నమాట... వెధవ పరీక్షలు ఇప్పుడే రావాలా... అని మనసులోనే కసితీరా తిట్టుకున్నాడు పరీక్షల్ని!

ఇలాంటి అల్టిమేటమే బామ్మకి కూడా ఇచ్చింది- వకుళ!

పరీక్షలయ్యేవరకు- నిత్యం ఇంటికి రావడం కుదరదని!





వారానికి ఒకసారి మాత్రమే వస్తానని, గాభరావడొద్దని బామ్మకి చెప్పింది. వకుళకి ఈ పరీక్షలు ప్రెస్టేజీ సమస్య అయ్యాయి!

బామ్మ సేవలోపడి చదువుని నిర్లక్ష్యం చేస్తున్నానని భీమన్న అనటం ఆమె మర్చిపోలేదు...

ఇలాగైతే తప్పుతావ్- అనేశాడు కూడా! ఈ శాపాలు, గీపాలు నాముందు జాన్తానై... అని రుజువు చెయ్యాలని ఆ అమ్మాయి ఆరోజే ప్రతినబూనింది! అందుకే ఈ పకడ్బందీ ఏర్పాట్లు!

నిన్న సాయంత్రం పార్కులో వకుళ ఈ విషయం చెప్పాక భీమన్న డీలాపడ్డాడు. ఆ సమయంలో అతని ముఖం చూసిన వకుళకి నిజంగా జాలేసింది!

"అవును.. మీరే అన్నారుగా- నేను తప్పుతానని! తప్పకుండా చూసుకోవాల్సిన బాధ్యత నామీదలేదా?" అన్నది వూరడింపుగా!

"సరే.. బుద్ధితక్కువై అన్నాను... నా మాటల్ని వెనక్కి తీసుకుంటాలే" అన్నాడు...

"మాటల్ని వెనక్కి తీసుకోవడాలు, ముందుకి తొయ్యడాలు ఏమీ వుండవండీ మాటంటే మాటే. మీరు మీ మాటమీదే వుండండి నేను నా పందెంమీదే వుంటాను" అని కరాఖండిగా చెప్పింది.

వకుళ మనసు మార్చే ఉద్దేశంతో పెళ్ళి ప్రస్తావన తెచ్చాడు.

"మరి పెళ్ళి గిళ్ళి అన్నావ్.. అవేమీ వద్దా?"

వకుళ పగలబడి నవ్వింది.

"మీరు బామ్మతో మాట్లాడి, పెళ్ళి సెటప్ చేసేసరికి నేను ఇంకా ఎన్నిపరీక్షలు రాస్తానో... డిగ్రీ కూడా అయిపోవచ్చు... నిదానంగా ట్రయ్ చెయ్యండి. ఈలోగా పరీక్షలైపోతాయ్‌గదా?" అన్నది.

వకుళది బామ్మలాగే ఉడుంపట్టు అనుకున్నాడు... ఆమె మనసు మార్చడం తనవల్లకాదనుకుని ఇక ఆ ప్రస్తావనని ముగించేశాడు.

భీమన్నకి కొంతలో కొంత ఊరడింపుగా వకుళ కొసమెరుపు చెప్పింది! తెల్లవారుజామున మార్నింగ్ వాక్‌కి వస్తానని, అది మాత్రం మాననని ఆమె చెప్పిన మాటలు విని భీమన్న

ఎగిరి గంతేసినంతగా సంబరపడిపోయాడు!

'పోనీయ్- ఈ తృప్తన్నా మిగిల్చావ్' అనుకు న్నాడు తనలో తనే.

పరధ్యానంగా రోడ్డుమీద నడుచుకుంటూ పోతున్న భీమన్నకి ఎదురుగా రోడ్డుమీద మ్యా న్‌హోల్ కనిపించింది- ఒక్క అడుగు అలాగే ముందుకేసివుంటే అందులో పడిపోయేవాడే! భీమన్నకి ఒళ్ళంతా ఒక్కసారి ఝల్లుమంది. మున్సిపాలిటీవాళ్ళ నిర్లక్ష్యానికి మనసులోనే నిరసన తెలియజేస్తూ పక్కకి తప్పుకుని ముందుకి దారి తీశాడు.

నాలుగడుగులు వేశాక అతను తలెత్తి చూశా డు!

ఎదురుగా ఓ పాతికేళ్ళ కుర్రాడు కనిపించా డు! పుస్తకాల పురుగులా వున్నాడు...

ఏదో పత్రిక చూస్తూ రోడ్డువారగా నడుస్తున్నా డు.

రోడ్డుమీద నడిచేటప్పుడు కూడా వదలలే నంతటి మంచి పత్రికేమో అది అనుకున్నాడు భీమన్న. సరిగ్గా అప్పుడే అతనిలోని అభినవ భీమకవి మేల్కొన్నాడు!

భీమన్న అతని దగ్గరగావెళ్ళి పత్రికలోకి తలదూర్చి చూశాడు. ఆ వెంటనే చికాగ్గా ముఖంబైటికి తీసేసుకున్నాడు!

అదో సెక్స్ పత్రిక!

పీడిపిచ్చి కుదిరించాలనుకున్నాడు భీమ న్న.

ఆ కుర్రాణ్ణి భుజంతట్టి- "రోడ్డుమీద చూ సినడువు నాయనా... లేకపోతే నడుములు జారతయ్" అన్నాడు!

ఆ కుర్రాడికి కోపమొచ్చింది! తలెత్తి భీమ న్నవైపు చురుచురా చూశాడు!

"చూపులతోనే కాల్చేసేట్టు చూడకునా యనా. నువ్వేమీ తపస్వికాదు. నేను చెట్టుమీద పక్షిని అంతకన్నాకాదు" అని అనేసి భీమన్న చకచకా ముందుకి సాగిపోయాడు.

ఆ కుర్రాడు భీమన్నమీద కోపంకొద్దీ- నీమాట నేను వినేదేమిటి- అన్న పంతంతో పత్రికలో తలదూర్చి ముందుకిసాగాడు. నాలు గడుగులు వేశాడోలేదో... ఎదురుగా మ్యాన్ హోల్ వుందన్న విషయం గమనించేసరికే సమయం మించిపోయింది.

'దభీ'మని అందులో పడిపోయాడు!

ఆ శబ్దానికి భీమన్న వెనక్కి తిరిగి చూశాడు! పరుగు పరుగున అక్కడికొచ్చి అతన్ని మెల్లగా లేవదీశాడు అందులోనుంచి!

ఆ కుర్రాడి ఒంటినిండా మురుగునీళ్ళు అంటుకుపోయాయి. ఆకారమే గుర్తుపట్టలే నంతగా తయారైంది. మోకాళ్ళకి, నడుముకి బాగా దెబ్బలు తగిలాయ్. ముక్కు, చెవులు దొక్కుపోయాయి. ఆ బాధతో ఆ కుర్రాడు భీమన్నమీద విరుచుకుపడ్డాడు.

ఆ కుర్రాడు బలమంతా కూడదీసుకుని పిడిగుద్దులు గుద్దుతుంటే భీమన్నకి కళ్ళు బైర్లుకమ్ముతున్నాయ్! బాధతో ఏడుపుకి లంకించుకున్నాడు!

అంతలోనే అటుగా వెళుతున్న ఒక స్టూ డెంట్ చూసి వాళ్ళిద్దర్నీ విడదీశాడు!

భీమన్నని మెల్లగాలేపి 'ఏమైంది మాస్టా రూ' అని అడిగాడు.

భీమన్న కళ్ళెత్తి అతని ముఖంలోకి చూశా డు... అతను తన స్టూడెంట్! ఆ విషయం గుర్తురాగానే సిగ్గుతో ప్రాణం చచ్చిపోయినట్ట యింది. వెంటనే బట్టలు దులుపుకుంటూ ఇంటివైపు దారితీశాడు భీమన్న!

మురికి దుమ్ము కట్టుకున్న బట్టల్లో మనవణ్ణి చూడగానే బామ్మకి నోటమాటరాలేదు. తనవై పే అయోమయంగా చూస్తున్న బామ్మనుద్దే శించి భీమన్న ఆగ్రహంతో అన్నాడు-

"చూశావా... ఇదంతా నీప్రతాపమే... నోరు తెరిచినందుకు చచ్చేలా తన్నులు తినొస్తు న్నా"నంటూ దొడ్లోకి వెళ్ళాడు.

బామ్మకి పరిస్థితి అర్థమైంది....

"ఇదెక్కడి ప్రారబ్ధమంట! మనుమల్లో బొత్తిగా భయమేలేకుండా పోయింది" అను కుంటూ తనూదొడ్లోకి దారితీసింది.

ఒళ్ళంతా నొప్పుల కారణంగా భీమన్న రెండు రోజులు కాలేజీకి వెళ్ళలేదు... మాస్టార్ని ఎవరో రోడ్డుమీద పడేసి బాదారని కాలేజీలో చాలామందికి తెలిసింది... గ్రూపులు గ్రూపు లుగా వచ్చి పలకరించి వెళ్ళడం ప్రా

రంభించారు.

భీమన్నకి ఈ పరిస్థితి మరీ బాధాకరంగా అనిపించింది...

రెండు రోజులకి నొప్పులు తగ్గాయి. కాలేజీకి వెళితే ప్రతిలెక్చరరూ తనని వింతగా చూడసాగారు.

ఇంగ్లీషు మాస్టారైతే స్కూటరుమీద వెళుతూ ఎదురుపడ్డారు.

స్కూటరు ఆపి అచ్చ తెలుగులో పరామర్శించారు.

"ఏమండీ భీమన్నగారూ... ఏమిటి పాపం... మొన్న మీకు దేహశుద్ధి జరిగిందటకదా... ఇంటికొచ్చి పలకరిద్దామనుకున్నాగాని ఏదీ తీరికదొరకలేదు" అంటూ నవ్వాడు.

భీమన్నకి ఒళ్ళంతా కంపరమెత్తింది! వాచి లెంపకాయ కొడదామన్నంత కోపమొచ్చింది.

చేతిని మాత్రం అదుపు చేసుకోగలిగాడు కాని అంతలోనే నోరు తన మాట వినకుండా జారిపోయింది.

"నాదేహశుద్ధిని తలుచుకుని మీరేమీ మురిసిపోనక్కర్లేదు. మీరు ఒళ్ళు దగ్గర పెట్టుకుని స్కూటరు జాగ్రత్తగా తోలుకెళ్ళండి. లేకపోతే మీ పళ్ళుమీది అవదు" అన్నాడు భీమన్న

ఆ మాటలకి ఇంగ్లీషు మాస్టారు రెచ్చిపోయారు. ఆయనకి అచ్చం ఇంగ్లీషు స్టయిల్ లోనే కోపమొచ్చింది. అందుకే ఏమీ మాట్లాడకుండా స్కూటర్ గేర్‌మార్చి యాక్సిలేటర్ ఒక్కసారి అమాంతం పెంచేశాడు. దాంతోస్కూటర్ పెద్దకుదుపుతో ముందుకు దూకింది.!

ఇంగ్లీషు మాస్టారి కోపానికి చిహ్నంగా స్కూటర్ పెట్రేగిన స్పీడ్‌తో పోతోంది. అంతలోనే ఎదురుగా ఒక గేదె అడ్డంరావడం, సడన్‌బ్రేకు లేక మాస్టారు కంగారు పడటం... ఈలోగా స్కూటర్ వెళ్ళి గేదెని ఢీకొనడం రెప్పపాటు కాలంలో జరిగిపోయాయి. స్కూటర్ ఒక పక్క ఇంగ్లీషు మాస్టారు మరో పక్క పడిపోయారు. బాగా దెబ్బతగిలిందేమో గేదకి చిర్రెత్తింది. అమాంతం కొమ్ములతో మాస్టారిమీదికి విజృంభించింది. ఆయన ఎక్కడలేని ఓపికని బలవంతాన కూడదీసుకొని కాలేజీలోకి పరుగు పెట్టాడు.

నేరుగా ప్రిన్సిపాల్ గదిలోకి వెళ్ళి జరిగిన విషయమంతా చెప్తుతూ ఏకరువు పెట్టాడు.

భీమన్న నోటి ప్రతాపం గురించి అప్పటికే ప్రిన్సిపాల్ ఆనోటా ఈనోటా వినివున్నాడు. దాంతో అతన్ని పిలిపించి మందలించడానికి ఆయనకి ధైర్యం చాల్లేదు.

'నేనే పిలిపించి మాట్లాడతాలే' అని చెప్పి ఇంగ్లీషు మాస్టార్ని శాంతపరచి పంపించారు.

అయితే ఆ విషయం అంతటితో సమసిపోలేదు.

ఇంగ్లీష్ లెక్చరర్ తనకి జరిగిన అవమానాన్ని అంత తేలిగ్గా మరిచిపోదలుచుకోలేదు. భీమన్నమీద ఎలాగైనాసరే ప్రతీకారం తీర్చుకోవాలనుకున్నాడు.

కాలేజీలో తనకి అనుకూలంగా ఉన్న కుర్రాళ్లని పోగేసి భీమన్నమీదికి పురిగొల్పాడు వారు రెచ్చిపోయేలా ఉపన్యాసాలిచ్చాడు.

డియర్ స్టూడెంట్స్... ఇది నా ఒక్కడి సమస్యకాదు. రేపు మీకుకూడా ఎదురు కావచ్చు. ఇప్పుడు నామీద ప్రయోగించిన నోటిని రేపు మీమీద ప్రయోగిస్తాడు... తనని పరామర్శించినందుకే నామీద నోరుపారేసుకుని, నా ప్రాణంమీదికి తెచ్చాడు. రేపు మీరు రోడ్డుమీద ఎదురుపడ్డారన్న కోపంతో మిమ్మల్ని శపించినా శపిస్తాడు.... భావి భారత పౌరులైన మిమ్మల్ని అధఃపాతాళానికి తోసెయ్యడానికి చిన్నమాట చాలు... పరీక్ష తప్పుతారని శపించాడనుకోండి. ఒక్క ఏడాది మీరు ఒక సబ్జెక్టులో తప్పితే చివరికి మీకు అదెంతటి నష్టం... ఎన్నేళ్ళు మీరు వెనకబడతారో... ఆలోచించండి. ఏదేమైనా... భావి భారత పౌరులైన మీరే దీనికొక పరిష్కారం ఆలోచించాలి. ఈ దుష్టచర్యలకు మీరే ఫుల్‌స్టాప్ పెట్టాలి"

ఈ మాటలు విద్యార్థులమీద బాగా పనిచేశాయి.

అసలే పరీక్షలు దగ్గర పడుతున్నాయి... వాటిని వాయిదావేయించడానికి ఎలాంటి సాకు దొరకక ఇన్నాళ్ళుగా సతమతమవుతున్న విద్యార్థులకి మంచి అవకాశం చిక్కింది.

"మీరేమీ బెంగపెట్టుకోవద్దు మాస్టారు... మేం ఈ సమస్యమీద పెద్దఎత్తున ఉద్యమి



స్తాం. భీమన్నగార్ని ట్రాన్సఫర్ చేయించాలని డిమాండ్ చేస్తూ ఘెరావ్ చేస్తాం. ధర్నా జరువు తాం. జాతి శ్రేయస్సుకోసం మా పరీక్షలనైనా త్యాగం చేస్తాం'' అని భరోసా ఇచ్చాడు అతను. మిగతా కుర్రకారు అతనికి వంతపాడారు.

ఆ మర్నాడే కుర్రాళ్ళు ఆందోళన ప్రారంభించారు...

లెక్చరర్లలో ఇంగ్లీషు మాస్టారుకి ఓ వర్గముంటూ వుంది. వాళ్ళందరికీ ఇది చాలా ఆనందాన్నిచ్చింది. విద్యార్థులు పట్టణంలో వూరేగింపు జరిపారు.

"పాపిష్టి నోరు- జాతికి కీడు''

"ఇంగ్లీషు మాస్టారికి భీమన్న బేషరతుగా క్షమాపణ చెప్పాలి''

"ఇకముందెన్నడూ నోరు పారేసుకోనని తెలుగు మాస్టారు లిఖితపూర్వకంగా హామీ ఇవ్వాలి''

"అపర భీమకవిగారూ ఆపండి మీ నోటిజోరు''

ఇలా—

రకరకాల బ్యానర్లు విద్యార్థుల చేతుల్లో దర్శనమిచ్చాయి.

ఊరంతా తిరిగి చివరికి భీమన్న ఇంటి ముందుకొచ్చి ఆగారు విద్యార్థులు! వాళ్ళ అరుపులు, కేకలకి బామ్మ బయటికొచ్చింది!

ఆమెకి ఓ పట్టాన విషయం అర్థంకాలేదు!

"భీమన్నగారు.... ఆపాలి మీనోటి జోరు'' విద్యార్థులు గట్టిగా నినదించారు. అప్పటికి ఆమెకి చూచాయగా విషయం అర్థమైంది!

"మంత్రతంత్రాల మాస్టారు బైటికి రావాలి'' – మరికొందరు అరిచారు!

మళ్లా వాడేదో కొంపముంచాడనుకుంది బామ్మ!

వాళ్ళల్లో ఒక కుర్రాణ్ణి దగ్గరికి పిలిచి విషయం ఏమిటని అడిగింది!

ఆ కుర్రాడు ఓ పావుగంటసేపు అనర్గళంగా ఉపన్యాసం ఇచ్చాడు – తెలుగుమాస్టారి నోటి లీలల మీద!

ఇంగ్లీషు మాస్టార్ని తిట్టడం, ఆయనకి యాక్సిడెంట్ కావడంతోసహా అంతా పూసగుచ్చినట్టు చెప్పాడు.

బామ్మ ఆ కుర్రాడి గడ్డంపట్టుకు బతిమిలాడింది.

"ఏదో పిచ్చి సన్నాసి... తెలీక అన్నాడు.... ఇంకెప్పుడూ వాడలా అనకుండా నేను జాగర్త తీసుకుంటాను. నా మాట నమ్మండి'' అని అర్థించింది...

చుట్టుపక్కల వాళ్ళంతా గుమికూడి వింతగా చూడటం ఆమెకి తలతీసేసినట్టయింది. ముందు ఈ గండం నుంచి గట్టెక్కి వీళ్ళని ఇక్కడినుంచి పంపెయ్యడమే ఆమెకి శరణ్యమైంది. అందుకే ఆ కుర్రాళ్ళని వేడుకుంది.

"మాస్టార్ని వచ్చి ఆమాట చెప్పమనండి. ఇంగ్లీషు మాస్టారికి 'సారీ' కూడా చెప్పాలి'' కుర్రాళ్ళు డిమాండ్ చేశారు.

బామ్మ గబగబాలోనికెళ్లి భీమన్నని వెంటబెట్టుకొచ్చింది.

తప్పుచేసినవాడిలా భీమన్న తలవంచుకు నిలబడ్డాడు!

"చెప్పరా భడవా... చెప్పు. ఇంకెప్పుడూ అలాంటి కారుకూతలు కుయ్యనని చెప్పు'' గద్దించింది బామ్మ.

ఆ క్షణంలో బామ్మమీద చెప్పలేనంత కోపమొచ్చింది భీమన్నకి.

"ఇదంతా నీవల్లకాదూ'' అని మనసులోనే అనుకున్నాడు.....

స్టూడెంట్స్ వైపు తిరిగి "ఇంకెప్పుడూ నేను నోరుపారేసుకోను'' అని బుద్ధిగా చెప్పాడు. "మాతోపాటు వచ్చి ఇంగ్లీషు మాస్టారికి క్షమాపణ చెప్పండి'' అన్నారు కుర్రాళ్లు.

ఆ పనిమాత్రం చేయాలనిపించలేదు భీమన్నకి!

వాస్తవానికి ఇంగ్లీష్ లెక్చరర్‌కి జరిగిన యాక్సిడెంట్‌కి, ఏదో కోపంలో తాను అన్నదానికి అసలు సంబంధమేలేదు. కాకపోతే తనమీద అక్కసుకొద్దీ ఆయన ఈ రెంటికీ ముడిపెట్టాడంతే! తన ఖర్మగాలి ఆయనకి అప్పుడే యాక్సిడెంట్ జరగాలా... అనుకున్నాడు... తానిప్పుడు ఈ కుర్రాళ్ళ మాట వినకపోతే ఏం జరుగుతుందా అన్న ఆలోచనలోపడ్డాడు. ఈ





వయస్సులో కుర్రాళ్ళకి ఆవేశమే తప్ప ఆలోచన వుండదు. తానిప్పుడు క్షమాపణ చెప్పకపోతే వాళ్లు మరింత రెచ్చిపోతారు. ఉద్యమం పేరుతో ఆందోళనని మరింత ఉధృతం చేస్తారు.... అసలే పరీక్షల సీజన్! ఈ సాకుతో పరీక్షలకు డుమ్మాకొడతారు. వాళ్ళకి కావాల్సింది కూడా ఇదే! ఇంగ్లీషు మాస్టారు తన స్వార్థంకోసం వీళ్ళని పావులుగా వాడుకుంటున్నాడు. ఏమైనాసరే... తన వ్యక్తిగత పరువు ప్రతిష్ఠలకిపోయి వీళ్ళ భవిష్యత్తును నాశనంచేయడం ఓ మాస్టారిగా తనకెంతమాత్రం భావ్యంకాదనుకున్నాడు భీమన్న!

అందుకే మరేమీ మాట్లాడకుండా వాళ్ళ వైపు నడిచాడు.

విద్యార్థులు విజయగర్వంతో ఇంగ్లీషు మాస్టారికి జేజేలు కొడుతూ ముందుకి కదిలారు!

ఆ ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్న కుర్రాడు బామ్మ దగ్గరకొచ్చి

"మీ అబ్బాయి ఆ మధ్య క్లాసులో నామీద కోపం వచ్చి నేను పరీక్ష తప్పుతానని శపించాడు. నిజంగా అదే జరిగితే అప్పుడు చూపిస్తా నా తడాఖా" అంటూ హెచ్చరిస్తున్నట్లు చూపుడువేలు గాలిలో వూపుతూ వెళ్లిపోయాడు.

"నీ ముఖం మండ... ఇలా ఆందోళనలు, ఉద్యమాలు.... నీ బొంద... నీ బోలె... అని రోడ్లమ్మట తిరుగుతుంటే ఠపీమని తప్పి కూర్చోక పాసవుతావుర్రా అంట్ల వెధవ" ఆ కుర్రాడివైపు చూస్తూనే కోపంగా గొణుక్కుంది బామ్మ.

కుర్రాళ్ళంతా వెళ్ళిపోయారు.... వాళ్ళ నినాదాలు మాత్రం ఇంకా పూర్తిగా చెవిమరుగుకాలేదు.

చుట్టుపక్కలవాళ్లు అలాగే వుండిపోయారు.

"సినిమా అయిపోయిందిగా.... ఇంక వెళ్లండి" బామ్మ వాళ్ళవైపు చూస్తూ గర్జించింది. ఆ వెంటనే లోనికెళ్ళి తలుపు దభీమని మూసేసుకుంది.

బామ్మ మనస్సు అవమానభారంతో కుంగిపోయింది!

తాను ఆశించిందేమిటి.... జరుగుతున్నదేమిటి? తాతని మించిన మనవడు అనిపించుకుంటాడని తాను కలలుకంటే... చివరికిలా అభాసుపాలవుతున్నాడేం? ఇందులో వాడిదా లోపం లేక తనదా... ఈ ఆలోచన్లతో ఆమెకి ఆ రాత్రంతా నిద్రపట్టలేదు.

తన ఈ సందేహాలు తీర్చి, ఈ కష్టకాలంలో తన కర్తవ్యాన్ని బోధించేవాళ్లు వుంటే ఎంత బాగుణ్ణు అనిపించింది ఆమెకి!

వూళ్లో జరిగిన గొడవంతా మర్నాడు పేపర్లలో వచ్చింది....

జిజిరావ్ పేపరులో చూసి విషయం తెలుసుకుని హడావుడిగా బామ్మగారింటికొచ్చాడు.

బామ్మ ముఖంలో విషాదం కొట్టొచ్చినట్టుగా కనిపించింది!

భీమన్న అయితే మరీ డీలాపడిపోయి వున్నాడు.

అతన్ని కదిలిస్తే చాలు – విషాదం సముద్ర కెరటాలై కన్నీళ్ళరూపంలో జిజిరావ్‌ని ముంచిసేటట్లుంది అతని ముఖం!

జిజిరావ్‌ని చూడగానే బామ్మకి కొంత ధైర్యంవచ్చినట్టయింది!

"రావయ్యా... రా... కూర్చో..." అంది పాడిగా...

జిజిరావ్ నోరెత్తకుండా స్టూలుమీద కూర్చున్నాడు.

అయిదు నిముషాలపాటు వాళ్ళమధ్య మాటలే కరువయ్యాయి.

జిజిరావ్‌కి తన కర్తవ్యం గుర్తొచ్చింది. అందుకే ముందుగా తనే పెదవులు విప్పాడు!

నిన్న జరిగిన సంఘటన నాకివాళే తెలిసింది. చాలా బాధేసింది అన్నాడు నాందీ ప్రస్తావనగా!

బామ్మగాని, భీమన్నగాని పెదవి విప్పలేదు.

భీమన్న అయితే జిజిరావ్‌మీద అలిగాడు...

ఇంటా బయటా నీవల్లే ఇలా భ్రష్టుపట్టిపోయాం అని జిజిరావ్‌కి ముఖాన్నే చెప్పాలని వుంది. ఈ జీవితంకంటే పాత జీవితమే అతనికి బాగుందనిపించింది!

"బామ్మగారూ... ఇలా ఎందుకు జరిగిందో

మీకేమైనా తెల్సా?" జిజిరావ్ అడిగాడు.

బామ్మదగ్గర సమాధానంలేదు. అందుకే ఆమె నోరెప్పలేదు.

"వేములవాడ భీమకవిని మరిపిస్తూ ఇంటాబయట మీ వంశం పేరుప్రతిష్ఠలు మార్మోగిపోయేలా మీ మనవడు ప్రవర్తించాలని మీరు కలలు కన్నారు"

"కాని ఏంలాభం... మాసిరమ్మంత కాల్చి వచ్చినట్టు చేశాడు" బామ్మ నిష్ఠూరం ఆడింది.

"అదే పొరపాటు బామ్మగారూ... ఇందులో వాడితప్పేమీలేదు. ఒక రకంగా ఆలోచిస్తే తప్పు మీలోనేవుంది! మన నోటిదురుసుతనం చూపితే అవతలివాడు భయపడి మన అడుగులకి మడుగులొత్తుతాడని మీరనుకున్నారు... అప్పుడెప్పుడో కాలంనాడు ఎవరో కొందరు అమాయకులు అలా ప్రవర్తించారని... ఇప్పుడూ అలాగే వుంటారని మీరు భ్రమించారు... కాని పరిస్థితులు మారాయి బామ్మగారూ... కాలానుగుణంగా మనుమల్లోనూ పరివర్తన వచ్చింది... చదువు లేనివాడు కూడా ఎందుకు, ఏమిటి, ఎలా అని ఆలోచించడం నేర్చుకున్నాడు. పాతకాలంనాటి మూఢవిశ్వాసాలకు ఇప్పుడు కాలం చెల్లింది. ఈ దేశ పౌరుడిగా తనకే వున్న ప్రాథమిక హక్కులేమిటో ప్రతి ఒక్కరూ తెలుసుకుంటున్నారు. ఏ ఒక్కరికిందా తాము ఏ పరిస్థితుల్లోనూ అణిగిమణిగి వుండాల్సిన అవసరంలేదన్న నగ్నసత్యాన్ని ప్రతి ఒక్కరూ తెలుసుకుంటున్నారు"

"జనం తెలివిమీరిపోయారు" బామ్మ అన్నది అక్కసుకొద్దీ!

"అలా అనుకోవడమే తప్పు... మనిషి పురోగమిస్తున్నాడనడానికి ఇంతకంటే ప్రత్యక్ష నిదర్శనం ఇంకేం వుంటుంది! మనిషి పురోగమిస్తున్నాడంటే దేశం ప్రగతిపథంలో నడుస్తున్నట్టే లెక్క... ఎటొచ్చీ మీరే కాలానుగుణంగా మారలేకపోయారు.. నానాటికీ మారుతున్న సమాజంతో మీ మానసిక పరిపక్వతని ఎప్పటికప్పుడు బేరీజు వేసుకుంటూ తదనుగుణంగా మనస్సుని మలుపులు తిప్పుకోవాల్సింది పోయి... మీ మనవణ్ణి సైతం తిరోగమనంలోకి నడిపించబోయారు... కాని వ్యక్తి కన్నా వ్యవస్థ, వ్యవస్థకన్నా కాలం బలీయమైనవి. అందుకే ఆ రెండూ మీ మనవడికి అడ్డువచ్చాయి. ఆ విధంగా ఆదుకున్నాయి కూడా!"

మిత్రుడి మాటలు భీమన్నకి బాగా నచ్చాయి!

బామ్మకి తానింతవరకు ఎప్పుడూ ఇంత వప్పుగా తాను అనుకోని ఎరగదు! జిజిరావ్‌కి ఇప్పటిదాకా గొణుగుతాడనే పేరుండి గాని ఇలా మాటలతో చెరుగుతాడని ఇప్పుడే తెలుసుకున్నాడు తాను!

జిజిరావ్‌వైపు కృతజ్ఞతా భావంతో చూశాడు భీమన్న!

"బామ్మగారూ... ఇప్పటికీ మించిపోయిందేమీలేదు... మీ ఆలోచనా సరళిని మార్చుకోండి... నోటిమాటతో ఎదుటివాణ్ణి బెదిరించి పబ్బం గడుపుకోవాలన్న ఆలోచనే మంచిదికాదు. వాడా... గౌరవప్రదమైన ఉద్యోగంలో వున్నాడు... చక్కని మాస్టారుగా పదిమందిలో వాడు పేరు తెచ్చుకుంటే- మీకు అంతకుమించి కావాల్సిందేమీలేదు.. వాడు భీమకవి అవతారాన్ని ఇహ చాలించకపోతే మరిన్ని అనర్థాలు తప్పవు... చివరికి సమాజంలో ప్రతి ఒక్కరూ వాణ్ణి ఈసడించుకుంటారు... సమాజం మిమ్మల్ని వేరుగా చూస్తుంది... ఈ సమాజ జీవన స్రవంతి నుంచి మీరు విడివడిపోతారు... ఆ జీవితం మరింత దుర్భరంగా వుంటుంది."

బామ్మ అదేమీ వినలేనన్నట్టుగా చెవులు మూసుకుంది...

"సరే" అన్నది బామ్మ సిగ్గుపడుతూ.

భీమన్నకి ఆ క్షణంలో వెయ్యి ఏనుగులంత బలం వచ్చినట్టయింది. ఆ వెంటనే జి.జి.రావ్ చెవిలో ఏదో చెప్పారు.

"ఏమిటబ్బాయ్... కాలంమారినా మీకింకా ఆ గొణుగుడు రోగంపోలేదా?" అన్నది బామ్మ.

"అబ్బే... అదికాదు బామ్మగారు... వీడు పెళ్ళి విషయం మాట్లాడమని చెవిదగ్గర రొద పెడుతుంటేనూ..." గొణిగాడు జి.జి.రావ్-

"ఎవరి పెళ్ళంటూ?"

"వాడిదే"...

భీమన్న ఆ మాటలు విని బిత్తరపోయాడు.



లోనికి వెళ్ళబోతున్నదల్లా బామ్మ మళ్ళీ వెనక్కివచ్చి కూర్చుంది.

"వచ్చినవాడివి ఎటూ వచ్చావ్... వాడు ఎప్పటినుంచో ఆ విషయం చెప్పాలనుకుంటు న్నాడు సిగ్గుతో నాముందు ఆ మాట చెప్పలేక పోతున్నాడు. అదేదో నువ్వే తేల్చిపో బాబూ" అన్నది బామ్మ.

"ఏంలేదు బామ్మగారు... వాడు ఓ అమ్మా యిని ప్రేమించాడు" అన్నాడు జి.జి.రావ్. ఆ వెంటనే భీమన్నవైపు తిరిగి- "ఏరా... అవునా?" అని ప్రశ్నించాడు.

ఔనన్నట్టు భీమన్న తలూపాడు.

"చెప్పానుగదబ్బాయ్... నేను మారిపోయా నని! వాణ్ణి ఇదివరకటిలా బాలభీమన్నని చూ సినట్టు చూడను. వాడా పెద్దవాడయ్యాడు. వాడి ఆలోచనలు వాడికుంటాయి. వాడికీ ఇష్టా నిష్టాలు వుంటయ్‌గదా! అందుకే వాడి పెళ్ళి విషయాన్ని వాడికే వదిలెయ్యాలని నిర్ణ యించుకున్నాను" అన్నది.

బామ్మ ఈ మాటలు లౌక్యంగా అన్నదిగాని వాస్తవానికి భీమన్న మనసంతా వకుళకోసమే తపిస్తున్నదని ఆమెకి తెలుసు!

బామ్మ మాటలువిన్న భీమన్న ఆనందంతో ఉబ్బితబ్బిబ్బయ్యాడు. ఆ సంతోషంలో బామ్మని ఉడికించాలన్న చిలిపి ఆలోచన వచ్చింది.

"బామ్మా... నువ్వు ఈ మాటమీదే వుండాలి... నేను ఫలానా అమ్మాయి అని చెప్పాక నువ్వు ఫ్లేటు ఫిరాయించకూడదు" అన్నాడు.

బామ్మ అదోలా నవ్వింది...

"నేను... నేను... నా కలంఫ్రెండ్‌ని చేసు కుంటానే" అన్నాడు భీమన్న నానుస్తూ.

"శుభస్య శీఘ్రమ్!" అన్నది బామ్మ.

భీమన్న ఎగిరి గంతేశాడు! అమాంతం జి.జి.రావ్‌ని మళ్ళా వాటేసుకున్నాడు! అతని మనస్సులో సందేహం అలాగే వుండిపోయింది. దాన్ని ఇప్పుడే నివృత్తి చేసుకోవాలనుకున్నాడు.

"బామ్మా... ఇంతకీ... నా కలం ఫ్రెండెవరో తెల్సా?" అని అడిగాడు భీమన్న.

బామ్మ సన్నగా నవ్వింది...

"తెలీకుండానే నీ మాటకి తలూపాననుకు న్నావా?" అన్నది...

"తెలిస్తే చెప్పు చూద్దాం... ఎవరో..." అన్నా డు భీమన్న...

బామ్మ ఓ క్షణం ఆగి—

వాకిలివైపు చూస్తూ—

"అదుగో... వస్తున్నదిగా అసలు కథానా యిక! ఆ పిల్లని అడుగు" అంటూ లోనికెళ్ళి పోయింది తృప్తిగా నవ్వుకుంటూ!

భీమన్న జి.జి.రావ్ వాకిలివైపు చూపులు మరల్చారు!

ఆపిల్ల మరెవరోకాదు... వకుళ!!! ★



# వింతల ప్రపంచం

## పర్వత పర్యాటక కేంద్రం సాపుతార

దూర దూరం వరకు వ్యాపించిన పర్వతశ్రేణులు, పచ్చనిచెట్లు, చేమలమధ్య సాపుతార ఉంటుంది. సాపుతార గుజరాత్‌లోని 'డాంగ్' అనే దట్టమైన అరణ్యంలో ఉంది. ఆ ప్రాంతంలో నివసించే ఆదివాసులు హోలీ, ఇతర పర్వదినాలకు సర్పగంగనదీతీరానికి సర్పపూజచేయడానికి వెళతారు. సాపుతార సముద్రమట్టానికి 872 మీటర్ల ఎత్తులో ఉంది. అక్కడ గ్రామంకాని, పట్టణంకానిలేదు. కాని అక్కడి అద్భుతప్రకృతి సౌందర్యంవల్ల అదొక పర్యాటక కేంద్రంగా అభివృద్ధి చేయబడింది.

డాంగ్ ప్రాంతంలో 689 చదరపుమైళ్ల విస్తీర్ణందాకా అరణ్యం వ్యాపించి ఉంది. అక్కడి వెదురుచెట్లు 100 అడుగులనుండి 120 అడుగుల ఎత్తు వరకు ఉంటాయి. వాటితోపాటు సంత్ర, జీడిమామిడి చెట్లు కూడా విస్తారంగా



ఉంటాయి. అక్కడి ఆదివాసులు జొన్నలు, ప్రత్యేక రకానికి చెందిన కొర్రధాన్యం పండిస్తారు. వేసవికాలంలో అక్కడి గరిష్ఠ ఉష్ణోగ్రత 32 డిగ్రీల సెంటీగ్రేడ్, చలికాలంలో కనిష్ఠ ఉష్ణోగ్రత 18 డిగ్రీల సెంటీగ్రేడ్‌లవరకు ఉంటుంది.

సాత్‌పురమధ్య ఒకచిన్న ఉద్యానవనం, ఒక మ్యూజియం నెలకొల్పబడ్డాయి. మ్యూజియంలో డాంగ్ ప్రాంతానికి చెందిన ఆదివాసుల వాద్యయంత్రాలు, వస్త్రాలు, పౌరాణిక నాగరికతకు చెందిన వస్తువులు భద్రపరచబడ్డాయి. అక్కడి ఆదివాసులలో ప్రధానంగా మూడుజాతులున్నాయి. అవి: భిల్లు, కొంకణ్, వార్లీ. మ్యూజియం పరిసర ప్రాంతాలలో కొంకణ్, భిల్లు జాతులకు చెందిన కుటీరాలు దర్శనమిస్తాయి. భిల్లుజాతి ప్రజలగుడిసెలు గుండ్రంగా ఉంటాయి. కొంకణ్ ప్రజల గుడిసెలు చతురస్రాకారంలో శుభ్రంగా ఉంటాయి. వాటిలో నివసించే ఆదివాసులు పర్యాటకులను ఆకర్షిస్తారు.

సాపుతారా గత 21 సంవత్సరాలనుండి పర్యటనా కేంద్రంగా అభివృద్ధి చేయబడుతోంది. అక్కడ 1966లో పర్యటనా విభాగం 'తోరణ్' అనే హోటల్ ప్రారంభించింది. ఏప్రిల్ నుండి జూన్‌వరకు అక్కడి వాతావరణం ఆహ్లాదకరంగా ఉంటుంది.

సాపుతారలో సూర్యోదయ, సూర్యాస్తమయ దృశ్యాలు అత్యద్భుతంగా ఉంటాయి. అక్కడ 'ప్రతిధ్వని' అనే ప్రదేశం ఉంది. పర్యాటకులు అక్కడ నిలబడి బిగ్గరగా కేకవేసి ప్రతిధ్వని విని ఆనందిస్తారు. సాపుతారకు సమీపంలో 'ట్రైబల్ హీరో స్టోన్' అనే పొడవైనరాయి ఉంది. అది ఆదివాసుల ఇష్టదేవత ఆకారంలో ఉంటుంది. అక్కడ నాగేశ్వర్ మహాదేవ మందిరం, వన్యవిభాగానికి చెందిన నర్సరీ, అంబికా దర్శనం మొదలగు దర్శనీయప్రదేశాలున్నాయి. బోట్‌క్లబ్‌లో పడవలపై షికారు చేయవచ్చు.

ప్రఖ్యాత నర్తకి సోనల్ మాన్‌సింహ్ తల్లి పూర్ణిమ పక్వాసా 1975లో ఆదివాసి బాలికల సంక్షేమంకోసం అక్కడ 'రుతుంభర విశ్వవిద్యాపీఠం' నెలకొల్పింది. ఉషాశాస్త్రి అనే అభ్యుదయ మహిళ అక్కడ పండే కొర్రధాన్యంతో అప్పడాలు తయారు చేసే కొత్త ప్రయోగానికి అంకురార్పణ జరిపింది. పర్యాటకులు తమతో అక్కడ లభించే వెదురుపచ్చడి, జీడి మామిడి పూరీలు మొదలగు ఆహార పదార్థాలు తీసుకొని వెళ్ళటం మర్చిపోరు.

పర్యాటకులు నిర్ణీత రుసుము చెల్లించి ఆదివాసుల 'డాంగీ' నృత్యాన్ని చూసి ఆనందించవచ్చు. సాపుతారలో రెండు తేనె కేంద్రాలు కూడా ఉన్నాయి. వాటిలో శుద్ధమైన తేనె అమ్మబడుతుంది.

నాసిక్, సూరత్, అహ్మదాబాద్‌లనుండి సాపుతారకు వెళ్ళే బస్సులు ఉన్నాయి. అక్కడికి పర్యాటకులు ఎక్కువగా బొంబాయి నుండి వస్తుంటారు. సాపుతారకు 52 కిలోమీటర్ల దూరంలో ఉన్న బఘాయిలో వనస్పతి ఉద్యానవనం, 77 కిలోమీటర్ల దూరంలో వేడినీటి గుండం ఉన్నాయి. అక్కడికి 164 కిలోమీటర్ల దూరంలో ఉభ్‌రాట్, 130 కిలోమీటర్ల దూరంలో తీథల్ అనే అందమైన బీచ్‌లున్నాయి. అక్కడ గుజరాత్ పర్యటనా విభాగానికి చెందిన వసతిగృహాలు కూడా ఉన్నాయి.

## లాయర్లకు అభిషేకం చేసే అమెరికన్లు

అమెరికాలో ఏ చిన్నప్రమాదం జరిగినా కోర్టుకెక్కడం అలవాటు. పిల్లలు ఆడుకుంటున్నప్పుడు దెబ్బలు తగిలి కాలో చెయ్యో విరిగితే, ఆ పిల్లవాని తల్లిదండ్రులు నష్టపరిహారం కోసం కోర్టులో దావా వేస్తారు. పిల్లవాడు ఎవరింట్లో ఆడుకుంటున్నాడో, ఆ ఇంటియజమాని నష్టపరిహారం చెల్లించాల్సి వుంటుంది. వారు కోరే నష్టపరిహారం లక్షలు, కోట్ల డాలర్లలో వుంటుంది. 'మారిస్, రోసలిండ్ ఫ్రండ్‌మెన్' అనే దంపతులు పక్కవాటాలో పిల్లల్ని తమ ఆవరణలో ఆడుకోవటానికి అనుమతినిచ్చారు. వాళ్ళలో సిల్వియా అనే తొమ్మిదేళ్ళ అమ్మాయి ఉయ్యాల ఊగుతూ కిందపడింది.



ఆమె చెల్లెళ్ళు డెబోరా, లిసా, రోసెన్‌బర్గ్ ఉయ్యాల ఊపుతున్నారు. ఊయల మీంచి పడటంవలన ఆమె కాలి ఎముక విరిగింది. చికిత్సకోసం ఆమెను ఆస్పత్రిలో చేర్చారు. మూడేళ్ల తరువాత ఆ పిల్ల తండ్రి ఉయ్యాల తయారు చేసిన కంపెనీ మీద, ఎవరింట్లో ఆ పిల్ల ఆడిందో ఆ ఇంటియజమాని ఫ్రెండ్‌మెన్ మీద కోర్టులో దావా వేశాడు. ఉయ్యాలతయారు చేసిన ఫార్కో కంపెనీకి, దానిని అమ్మిన 'సెర్సీ రోస్‌బర్ డిపార్ట్‌మెంటల్ స్టోర్‌కి' కోర్టు సమన్లు అందాయి. ఆ పిల్ల తల్లిదండ్రులు లాయర్‌ని పెట్టి వాదించారు. ప్రతివాదులుగా ఇంటియ జమాని, ఉయ్యాలతయారు చేసిన కంపెనీ, దానిని అమ్మిన దుకాణం యజమాని ముగ్గు రూ లాయర్‌ని పెట్టుకుని కోర్టులో వాదించాల్సి వచ్చింది. 1972వ సంవత్సరంలో జరిగిన ఆ ప్రమాదానికి మూడేళ్ళ తరువాత 1975లో కోర్టు కేసు విచారణ చేసింది. విచారణ పూర్తి కావటా నికి పది సంవత్సరాలు పట్టింది. ముగ్గురు ప్రతివాదులు కలిసి ఆ పిల్లకి మూడు కోట్ల రూపాయలు నష్టపరిహారంగా చెల్లించాల్సి వచ్చింది. ఊయల తయారీలో లోపం వలననే పిల్లకి దెబ్బతగిలిందనీ, అందువలన నష్టపరి హారంగా చెల్లించిన మూడు కోట్లలో 80 శాతం ఫార్కో కంపెనీ చెల్లించాలనీ మిగతా 20 శాతం ఊయల అమ్మిన దుకాణం యజమాని చె ల్లించాలనీ కోర్టు తీర్పు చెప్పింది. ఇంటి యజమానిని నిర్దోషిగా నిర్ణయించి న్యాయ స్థానం అతన్ని వదిలిపెట్టింది. కాని ఆ ముగ్గు రూ పన్నెండేళ్ళపాటు కోర్టు చుట్టూ తిరగవ లసి వచ్చింది. ఎవరి ఇంట్లో పిల్లలు ఆడు కుంటారో ఆ ఇంటి యజమాని వారి క్షేమం కోసం అన్ని జాగ్రత్తలు తీసుకోవాలని లాయరు వాదించాడు. ఏదైనా కేసు కోర్టులో గెలు స్తుందని లాయర్లు భావిస్తే ఫీజు లేకుండానే వాదిస్తామంటారు. కేసు గెలుపొందాక నష్టపరి హారంలో 20 నుండి 50 శాతం ఫీజుగా తీసుకుంటారు.

నిత్యావసర వస్తువులు తయారు చేసే కంపెనీలు, అవి అమ్మే దుకాణాల యజమాను లు ప్లీడర్లని గురించి భయపడతారు. నష్టపరి హారం చెల్లించడం వలన దివాలా తీసిన కంపెనీలు కూడా వున్నాయి. ఎవరైనా అతిథిని ఇంటికి విందుకి పిలిచి మత్తుపానీయాలివ్వ టానికీ భయపడతారు. ఆ అతిథి తప్పతాగి త్రోవలో ఏదైనా ప్రమాదానికి గురియైతే అతనికి నష్టపరిహారం చెల్లించాల్సిన బాధ్యత విందు చేసిన గృహ యజమానిపై ఉంటుంది. అటు వంటి ఒక కేసులో గృహ యజమాని అతిథిగా వచ్చినతనికి తొమ్మిది లక్షల రూపాయల నష్టప రిహారంగా చెల్లించాలని సుప్రీంకోర్టు తీర్పు చెప్పింది.

• మిచిగన్‌లోని ఒక బార్‌లో తప్పతాగి కారున డుపుతున్న ఒక కష్టమర్‌కి కారుప్రమాదంలో దెబ్బలు తగిలాయి. అతనికి నష్టపరిహారంగా బార్‌యజమాని కోటి రూపాయలు నష్టపరిహా రంగా చెల్లించాల్సివచ్చింది. ఆ వార్త పేపర్‌లో వచ్చింది. బార్‌లు నడిపే యజమానులు ఆ వార్త పడిన పేపర్ కటింగ్‌ని తీసి జాగ్రత్తగా ఫ్రేమ్ కట్టించి బార్‌లో పెట్టుకున్నారు. మితి మీరి తాగేవారికి ఆ కటింగ్‌ని చూపి తాగ కుండా నివారిస్తుంటారు.

వైద్యులు కూడా తరచు కోర్టుకేసులలో ఇరు క్కుంటారు. అజాగ్రత్తగా వైద్యంచేసే డాక్టర్లపై రోగులు కోర్టులో దావావేసి నష్టపరిహారం రాబ ట్టుకుంటారు. అలాంటి కేసులు గతంలోకంటె ఇప్పుడు రెట్టింపు అయ్యాయి. కొన్నికేసులు కోర్టులో ఓడిపోతాయి. కాని కేసు గెలిస్తే మాత్రం వాళ్ళు కోటీశ్వరులవుతారు. 360 మంది రోగులు డాక్టర్లపై దావావేసి నష్టప రిహారం పొంది కోటీశ్వరులయ్యారు. ఒక్కొక్కకే సులో సరాసరి 42 లక్షల రూపాయలు నష్టపరి హారంగా చెల్లించారు. ఆఖరుమొత్తాన్ని డాక్ట ర్ల తరపున ఇన్సూరెన్స్ కంపెనీలు భరిస్తాయి. అందువలన డాక్టర్లు ఎక్కువమొత్తంలో ప్రీ మియం భరించవలసి వుంటుంది. ఏటా డాక్ట ర్లు 26వేల కోట్ల రూపాయలు ప్రీమియమ్‌గా చెల్లిస్తారు. ఈ మొత్తం వారి ఆదాయంలో ఆరవ వంతు వుంటుంది. స్త్రీల వ్యాధులకి చికిత్సచేసే గైనకాలజిస్టులకి నష్టపరిహారం కే సుల బెడద ఎక్కువగా వుంటుంది. తల్లికిగాని పుట్టిన బిడ్డకుగాని ప్రమాదం జరిగితే డాక్టర్ నష్టపరిహారం ఇచ్చుకోవలసివుంటుంది. పుట్టి నబిడ్డ మానసిక రుగ్మతలకి గురిఅయితే ప్రస





నాకు పాకెట్‌మనీ ఇవ్వనందున
ఫ్రెండ్స్ దగ్గిర నా పరువు
పోయింది మీపై
పరువునష్టం దావా
వేస్తాను...

వసమయంలో వైద్యుని అజాగ్రత్తవలననే అలాంటి రుగ్మత ఏర్పడిందని ఆ బిడ్డ తల్లి దండ్రులు కోర్టుకెక్కే ప్రమాదం వుంటుంది. "కోర్టుకి వెళ్ళటం, వ్యాజ్యంలో ఇరికించటం అమెరికన్లకి ఒక హాబీ" అని ఒక జపాన్ ఆర్థిక శాస్త్రవేత్త వ్యాఖ్యానించాడు.

అమెరికన్లని గురించి ఒక జోక్‌వుంది. దొంగతనం చెయ్యటానికి వచ్చిన ఒక గజ దొంగ నిచ్చెనమెట్లు ఎక్కుతూ జారిపడి కాళ్ళు విరగ్గొట్టుకున్నాడు. అతను ఇంటి యజమానిపై నిచ్చెన సరిగా పెట్టివుంచలేదని దావావేశాడు.

అటువంటి కేసులు అమెరికా న్యాయస్థానాల్లో ఎన్నోవుంటాయి. అమెరికాలో పేదలాయర్లు వుండనేవుండరు. కొన్నికేసులలో వారు ఆస్తివిలువలో 40 శాతం ఫీజుగా తీసుకుంటారు. కేవలం కేసు గెలుస్తుందా? లేదా అనే దానిపై సలహా ఇచ్చినందుకు 650 నుండి 2 వేల రూపాయలవరకు ఫీజుగా తీసుకుంటారు.

మనదేశంలో పేరుపొందిన అశోక్‌సేన్, నానీ పాలకీవాలా, సోలీసొరాబ్జీవంటి లాయర్లు 1983వ సంవత్సరంలో అమెరికాలో 26 కోట్ల రూపాయలు సంపాదించినట్లు చెపుతారు. అమెరికాలో మొత్తం 7 లక్షల మంది న్యాయవాదులు ఉన్నారు. వారందరి వార్షిక ఆదాయం 70 వేల బడ్జెట్‌కంటె ఎక్కువ. హెన్రీఅబ్రహాం అనే రచయిత 'పొలిటికల్‌సైన్స్' అనే త్రైమాసిక పత్రికలో కొన్ని ఆసక్తికరమైన కేసులను గురించి రాశాడు. ఒక పిల్లవాడు తనని సరియైన పద్ధతిలో పెంచలేదని తల్లిదండ్రులపై కోర్టులో దావావేశాడట.

సిన్‌సినాటిలో ఒక పౌరుడు రోడ్డుపై టాంకి నడుపుతూ ప్రయాణంచెయ్యటం తన ప్రాథమికహక్కు అని వాదించాడు.

తన భవిష్యత్తుని పాడుచేసిందని ఒక యజమానురాలిపై ఆమెదగ్గర పనిచేసిన ఉద్యోగి రెండులక్షల రూపాయలు నష్టపరిహా

రంగా కోరుతూ దావావేశాడు. అడ్వాన్సు తీసుకోవటానికి నిరాకరించాడన్న నేరంపై అతన్ని శిక్షించాలని ప్రయత్నం చేసిందని ఆ ఉద్యోగి ఆమెపై నేరం ఆరోపించాడు.

ఫ్లోరిడా రాష్ట్రంలో ఒక ఆఫీసు భవనంలో టాయిలెట్‌సీట్‌పై పడి నడుంకి దెబ్బతగిలించుకున్న ఒకఉద్యోగినిమేనేజర్‌పై నష్టపరిహారంకోసం దావావేసింది.

నావికాదళానికి చెందిన టెన్నిస్ కోర్టులో బ్యాడ్‌మింటన్ ఆడుతూండగా మతగురువుకి మోకాటిపై దెబ్బతగిలింది. ఆయన ప్రభుత్వంపై రెండులక్షల డాలర్లు నష్టపరిహారంగా ఇవ్వాలని దావావేశాడు. మోకాలిపై దెబ్బతగలటంవలన చర్చిలో మోకరిల్లి ప్రార్థనలు జరపటానికి వీలులేకపోతున్నదని వాదించాడు.

ఒక వనిత చర్చిఫాదర్‌పై ఏడుకోట్ల రూపాయల నష్టపరిహారానికి దావా వేసింది. ఆమె చర్చి ధనాన్ని దుర్వినియోగం చేసింది. కాని తన తప్పుని అంగీకరించలేదు. ఆ సమాచారాన్ని చర్చిఫాదరే రహస్యంగా వుంచలేదనీ, అందరికీ వెల్లడించి తన వృత్తిధర్మానికి కళంకం తెచ్చుకున్నాడని ఆమె కోర్టులో వాదించింది.

కాలిఫోర్నియాలో జిమ్నాస్టిక్స్ నేర్చుకునే క్రీడాకారుడు జారిపడి కాలు విరగ్గొట్టుకున్నాడు. నేలపై పరిచే చాపవలన తనకి ప్రమాదం జరిగిందని ఆ చాప తయారుచేసిన కంపెనీపై దావా వేశాడు. ఆ కంపెనీ అతనికి 16 కోట్ల రూపాయలు నష్టపరిహారంగా చెల్లించాల్సి వచ్చింది.

ఏస్‌బెస్టాస్ పరిశ్రమలో వెలువడే దుమ్మువలన కార్మికులకి శ్వాసకోశవ్యాధులు, ఊపిరితిత్తుల క్యాన్సర్‌వ్యాధి కలుగుతాయని వైద్యనిపుణులు తెలియజేశారు. అప్పటినుండి ఆ పరిశ్రమలో నష్టపరిహారంకోసం కార్మికులు యాజమాన్యంపై 30 వేల దావాలు వేశారు. వాటిలో ఇంకా ఎన్నో కేసులు పరిష్కారం కాలేదు. కొందరు పారిశ్రామికవేత్తలు నష్టపరిహారం చెల్లించలేక మూసివేయవలసి వచ్చింది.

వర్జీనియాలోని రాబిన్స్ కంపెనీ కుటుంబనియంత్రణకోసం 'టూప్'లు తయారుచేస్తుంది. నష్టపరిహారంకోసం వారిపై 15 వేల కేసులు విచారణలో వున్నాయి.

పిట్స్‌బర్గ్‌లో ఒక కార్మికుడు లుకేమియా వ్యాధివలన చనిపోయాడు. అతను పనిచేసే బెంజీన్ కంపెనీపై ఆమె నష్టపరిహారంకోసం దావా వేసింది. ఆ రసాయనం వలననే అతనికి ఆ వ్యాధి సంక్రమించిందని ఆమె వాదించింది. అటువంటి రసాయనాన్ని తయారుచేసే 101 కంపెనీలను ఆమె ఆ దావాలో పార్టీలుగా చేర్చింది. వారిలో 87 కంపెనీల యజమానులు తాము తయారుచేసే బెంజీన్‌ని పిట్స్‌బర్గ్‌లోని ఫ్యాక్టరీకి సరఫరా చేయలేదని నిరూపించారు. వారందరికీ ఆమె కోర్టు ఖర్చులు చెల్లించాల్సి వచ్చింది.

అమెరికన్ పౌరులు లాయర్లను కూడా వదలిపెట్టరు. తగిన సమయంలో కోర్టులో కాగితాలు దాఖలుచెయ్యకపోయినా కేసులో సరిగా వాదించలేకపోయినా వారిపై నష్టపరిహారంకోసం దావా వేస్తారు. రెండు సంవత్సరాల క్రితం సింగర్‌డోర్ అనే క్లయంట్ తన కేసు వాదించిన లాయర్‌పై 33 కోట్ల రూపాయలు నష్టపరిహారం కోరుతూ దావా వేశాడు. ప్రపంచ దేశాలన్నింటికంటే అమెరికాలో ఎక్కువమంది లాయర్లున్నారు. లెక్కల ప్రకారం అమెరికాలో 7 లక్షలమంది, జపాన్‌లో 12 వేలమంది, ఇంగ్లాండ్‌లో 53 వేలు, స్వీడన్‌లో 16 వేలు లాయర్లున్నారు. 1973వ సంవత్సరంలో 700 మందికిఒక అమెరికన్ లాయరు వుండేవారు. 1986 నాటికి ప్రతి 320 మందికి ఒక లాయరు వున్నట్లు లెక్కలలో నమోదు అయింది. వాషింగ్‌టన్ నగరంలో ప్రతి 18 మందికి ఒక లాయరు వున్నాడు. ఈ లెక్కప్రకారం చూస్తే 2045వ సంవత్సరంనాటికి ఆ నగరంలో ప్రతి మనిషికి ఒక లాయరు వుండటంలో ఆశ్చర్యంలేదు.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 52685, Visakhapatnam 52211, Tirupati 5291.

# మీరు నమ్మే ఫారెక్స్
# ఇప్పుడు రుచిలో సర్వోత్తమం!

నాలుగు నెలలు నిండిన తర్వాత, మీ పాపాయికి
క్రొత్త రుచికరమైన ఫారెక్స్‌ను పరిచయం చేయండి.
ఒక చిన్న చెంచాడు ఫారెక్స్‌ను 3-4 చిన్న చెంచాల
వెచ్చటి నీటితో కలిపి ఇవ్వడం ప్రారంభించండి.
ఫారెక్స్ మరింత రుచికరమైనది.
మునుపటికంటే మరింత ఎక్కువ పుష్టికరమైనది.




• ఎక్కువ రుచికరం
• ఎక్కువ పుష్టికరం

**ఫారెక్స్®-పెరుగుదల కోసం రుచికరమైన విధానం.**

Gx/65/172 Tel.

ఉషాకిరణ్ మూవీస్

# మనసు మమత

రామోజీరావు
మౌళి




డి.వి.నరసరాజు • డి.ప్రసాద్‌బాబు • కీరవాణి • వేటూరి • సత్తిబాబు • అట్లూరి రామార